# ప్రియ ఘుమ ఘుమలు మీకోసం

అద్భుతం... ఇది అమోఘం... ఔనండీ - ఈ ప్రియ పచ్చళ్లు మీ కోసమే ! మేలైన దినుసులు, నోరూరించే మధురిమల సమ్మేళనం - ప్రియ ఏ వేళైనా... ఏ వంటకమై అది భోజనమైనా - అల్పాహారమైనా - అతిథి సత్కారమైనా... 'ప్రియ' జోడించండి... మరచిపోలేని అనుభూతిని పొందండి!

ప్రియ - ఇప్పుడు మీ కెంతో ఇష్టమైన 15 వేర్వేరు రుచుల్లో




Sista's-UEL-272/92 TEL.B.




ఊరగాయలు

ఉషోదయా ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాదు- 500 482.



# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున, మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలో పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడు జాగ్రత్తపడటం మంచిది.

---------- కూపన్ ----------

మార్చి చతుర నవల 'బంటీ'..

సమీక్షకుని పేరు : ..........................................

చిరునామా : ..........................................

..........................................

..........................................

..........................................

# చమత్కారాలు

## టెక్నిక్

రాజ్యానికి రాయడమేపని. అచ్చయినా కాకపోయినా ఏవేవో కథలు రాసి పత్రికలకి పంపుతూనే వుంటుంది. అందులో కొన్ని వెనక్కొచ్చేస్తే మరికొన్ని పత్రికాఫీసు చెత్తబుట్టల్లోకి చేరిపోతూవుంటాయి. అయినా ఆమె మాత్రం రాయడం మానదు.

ఓరోజు పొద్దున్నే వాతావరణం మబ్బులు పట్టి, చెట్లు గాలికి ఊగిసలాడుతూ 'రాజ్యం! కథరాయి' అని చెవిలో గుసగుసలాడుతున్నట్లనిపించిందామెకి. వెంటనే వంట ఆపేసి, ఓ పది తెల్లకాగితాలు తీసుకుని బెడ్‌రూమ్ కిటికీ దగ్గర కూర్చుని, ప్రకృతిని చూస్తూ ప్రేరణ తెచ్చుకోసాగింది.

అంతలో గడియారం ఠంగుఠంగున ఎనిమిదిగంటలు కొట్టేసరికి ఉలిక్కిపడిలేచాడు గోపాలం.

"ఏమేవ్! ఎనిమిదిగంటలయిపోయింది. ఈవాళెందుకో మెళుకువ వచ్చి చావలేదు. చూస్తూ వూర్కోకపోతే కొంచెం లేపగూడదూ" అంటూ బాత్‌రూమ్‌లోకి పరుగెత్తాడు.

ఇవేవీ వినేస్థితిలో లేదు రాజ్యం. కథావస్తువుకోసం ఆపసోపాలు పడుతోంది. భావపరంపరలని భాషలో పెట్టలేక తికమకపడుతోంది.

"మళ్ళీ మొదలెట్టావా? నీకెన్నిసార్లు చెప్పాను. ఈ పిచ్చిరాతలు మానమని. ఇంతవరకూ ఒక్క కథయినా అచ్చయిందా? ఇంతకీ అసలు వంటయిందా? నాకవతల ఆఫీసుకు టయిమయిపోతోంది" గాభరాగా అరుస్తున్నాడు గోపాలం.

ఆ పరిస్థితుల్లో తనకి మూడ్ రావడం, అది ఓ అందమైన రచనలా రూపుదిద్దుకోడం కష్టమనుకున్న రాజ్యం ఉస్సురంటూ వంటపనికు పక్రమించింది.

రాజ్యం రాసి పత్రికలకి పంపగా తిరిగి వచ్చిన కథల దొంతర్లని చూసి బాధపడుతూ వుంటాడు గోపాలం. హాయిగా మరో కాలక్షేపమేదైనా పెట్టుకోక ఈ బుర్రతినే పనిపెట్టుకుందేమా అని జాలిపడుతూవుంటాడు. ఏమయినాసరే రాజ్యంచేత ఈ రచనా వ్యాసంగం మానిపించకపోతే లాభంలేదు. బొత్తిగా దేన్నీ పట్టించుకునేలా కనబడ్డంలేదనుకున్నాడు గోపాలం.

ఓనెల తరవాత ఓ చక్కటి సాయంత్రం హుషారుగా ఈలేసుకుంటూ ఇంటికొచ్చాడు గోపాలం.

"రాజ్యం! అర్జంటుగా ఓ స్వీటుంటే పట్రా! నా కథ పడింది పత్రికలో" అన్నాడు.

అదిరిపోయింది రాజ్యం.

"మీరు కూడా కథలు రాస్తారా?" అంది ఏదో మగత ఆవహించినట్టు.

"కథలు కాదు. కథే రాశాను. మొదటి కథ" అన్నాడు గోపాలం.

మరీ విస్తుపోయింది రాజ్యం.

"అదేమిటండీ? పుంఖానుపుంఖాలుగా నేను రాస్తున్న కథలన్నీ గోడక్కొట్టిన బంతుల్లా వెనక్కొచ్చేస్తుంటే మీ మొదటి కథే..." ఇంకా రాజ్యం పూర్తి చెయ్యకుండానే.

"ఓసి పిచ్చిమొహమా! కథ రాయడానికి ఓ టెక్నిక్ వుందే. అది తెలుసుకున్నావంటే నీ కథలన్నీ అచ్చే" అన్నాడు.

"ఏమిటండీ అదీ? నాకూ చెప్పరూ?" అంది రాజ్యం ఉద్వేగంగా.

"ఊఁ ఊఁ... ముందో కాఫీ పట్రామరి" అన్నాడు గోపాలం కాళ్లు బార్లాచాపుకుని

కవర్‌ఫొటో: జగ్‌మోహన్




సోఫాలో రిలాక్స్ అవుతూ.

తనారోజు మధ్యాన్నం అనుకోకుండా ఓ వారపత్రిక తిరగెయ్యడం అందులో ఓ ఊరూ, వునికీ తెలియని కొత్త కథారచయిత పేరూ, తన పేరూ ఒకటే కావడం చూసి ఈ నాటకం ఆడినట్టు రాజ్యానికి చెప్పకుండా వాయిదా వేస్తూవస్తున్నాడు గోపాలం.

రాజ్యం మాత్రం ఆ కిటుకేదో తెలుసుకోందే చచ్చినా మళ్ళీ కథ రాయకూడదని ఒట్టెట్టుకుని, ఆ శుభక్షణం కోసం ఎదురుచూస్తూనే వుంది.

-రాధాశివమోహన్

---

## టాలెంటెడ్ కేండిడేట్

"గుడ్‌మాణింగ్" అన్న వీణానాదంవంటి తీయని పిలుపుతో చటుక్కున తలెత్తాడు ఆఫీసు పనిలో తలమున్కలవుతున్న మేనేజర్ రంగరాజు.

ఎదురుగా ఓ అపురూప సౌందర్యరాశి... ఎత్తుకు తగ్గ లావు, ఆకర్షణీయమైన కళ్ళు, అందమైన ముఖవర్చస్సు, శిల్పమా అన్పించేలా ఎక్కడికక్కడ తీర్చిదిద్దినట్లున్న స్ట్రక్చరూ...

"గుడ్ మాణింగ్..." మళ్ళీ అందామె నవ్వుతూ.

"యస్... యస్... మాణింగ్! ప్లీజ్ బీ సీటెడ్..." తడబడుతూ ఎదురుగా ఉన్న సీట్ ఆఫర్‌చేశాడు రంగరాజు.

"మీరు నాకో ఫేవర్ చేసిపెట్టాలి" కూర్చుంటూ మెల్లగా అందామె.

"ష్యూర్... ష్యూర్... వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ?" అంటూనే బోయ్‌ని పిల్చి కాఫీలు తెప్పించాడు రంగరాజు.

కాఫీ తాగి గోళ్ళకున్న నెయిల్‌పాలిష్‌వంక చూస్తూ మెల్లగా నవ్వుతూ మొదలెట్టిందామె.




"నాకో జాబ్ కావాలి. ఎంత చిన్నదైనా ఫర్లేదు. ఐయామ్ బ్యాడ్లీ ఇన్‌నీడ్... పీ.జీ.చేశాను. కంప్యూటర్స్‌లో డిప్లమా ఉంది. టైప్‌రైటింగ్, షార్ట్‌హాండ్ తెలును..."

ఆమె చెబుతున్నది వింటూనే మరోవంక ఆమె అందాన్ని కళ్ళతోనే తాగేస్తున్న రంగరాజు, "వెరీ నైస్... ఐ విల్ ట్రై ఎట్ మై లెవెల్ బెస్ట్! ఓ అప్లికేషన్ రాసివ్వండి" అన్నాడు.

అలాంటి అప్సర తన ఆఫీసులో ఉంటే తనకి గర్వకారణం. ఆఫీసుకి అందం! బాస్‌కి గట్టిగా చెప్పి ఎలాగైనా ఆమెకో జాబ్ యిప్పించాలనుకున్నాడతను.

★ ★ ★




"మన దగ్గర ఖాళీలేమున్నాయ్ రంగరాజు?"

"అలా అనకండిసార్. ఆ అమ్మాయి మంచి ఇంటిలిజెంట్. పీ.జి. కంప్యూటర్స్, టైప్, షార్ట్ హాండ్ అన్నీ ఉన్నాయి. నిజంచెప్పాలంటే ఒక మేనేజర్‌కి కావల్సిన అర్హతలన్నీ ఆమెకున్నాయిసార్. అలాంటి కాండిడేట్‌కి ఏదో ఒక పోస్ట్ చిన్నదో చితకదో యివ్వడం న్యాయం సార్..."

"గుమాస్తా పోస్టులూ లేనట్లున్నాయి. సరే రేపు ఉదయం 9 గంటలకల్లా ఒరిజినల్ సర్టిఫికెట్స్‌తో రమ్మను. నువ్వింతగా చెబుతున్నావ్ గనుక నేనే పర్సనల్‌గా ఇంటర్వ్యూ చేస్తా" అని తన పనిలో తాను మునిగిపోయాడు బాస్.

★ ★ ★

మర్నాటి ఉదయం 10.30కి హుషారుగా ఈలవేసుకుంటూ వచ్చిన రంగరాజుకి తన సీటులో నిన్నటి వయ్యారి కూర్చుని ఉండడం ఆశ్చర్యం కల్గించింది.

రంగరాజుని చూడడంతోటే ఆమె లేచి "గుడ్మార్నింగ్ సార్! నన్ను మేనేజర్‌గా బాస్ అప్పాయింట్ చేశారు. ఇన్నాళ్ళూ ఇలాంటి 'మెరిక'లాంటి మేనేజర్ దొరకలేదనీ నన్ను ప్రశంసిస్తూనే నాలాంటి 'టాలెంటెడ్ కాండిడేట్'కి ప్రోత్సాహం యిచ్చినందుకు మిమ్మల్నీ మెచ్చుకున్నారు సార్! కానీ మిమ్మల్ని మాత్రం అసిస్టెంట్ మేనేజర్‌గా నా అండర్లో పనిచేయమన్నారు..." ఆమెవంక అలాగే తెల్లబోతూ చూస్తుండిపోయాడు రంగరాజు.

-ప్రతాపచంద్ర

# తుమ్ముల మిస్టరీ

పరమేశ్వర్ అదోటైపు మనిషి. ఎప్పుడూ యమా సీరియస్‌గా ఉంటాడు. ఆఫీసులో కూడా కొలీగ్స్ ఒకరిపై ఒకరు జోక్స్ విసురుకుంటూ సరదాగా పనిచేసుకుంటుంటే తను మాత్రం చిరునవ్వు కూడా నవ్వడు. అవసరమైతే తప్ప ఎవర్నీ పలకరించడు. మాట్లాడడు. ఓవేళ మాట్లాడినా అదీ ముక్తసరిగానే. అందుకే అతన్ని చాటుగా అంతా బుద్ధుడనో, దూర్వాసుడనో ఎగతాళి చేస్తుంటారు.

ఆనాడు పరమేశ్వర్ ఊర్నించి రైలుదిగి సరాసరి ఆఫీసుకే బయల్దేరాడు. సరిగ్గా 9.30 కల్లా రైల్వేస్టేషన్ బస్‌స్టాప్‌లో నిలబడ్డాడతను. అంతలో ఓ యువకుడు దగ్గరకొచ్చి, ''ఎక్స్‌క్యూజ్‌మీ...'' అన్నాడు.

సీరియస్‌గా అతనివైపు తిరిగి ఏమిటన్నట్లు కనుబొమలెగరేశాడు పరమేశ్వర్.

''ట... ట... అఁ... హాఁ... హాచ్ఛ్'' అంటూ తుమ్మి, ''సారీ... టైంప్లీజ్'' అన్నాడతను.

మీదపడిన ఉమ్మితుంపరల్ని తుడుచుకుంటూ చిరాగ్గా ముఖంపెట్టి, ''నైన్‌థర్టీ'' అని జవాబిచ్చాడు పరమేశ్వర్.

అతను అటువెళ్ళాడో లేదో ఇటునుంచి ఒకాయన వచ్చి ''సార్...'' అన్నాడు.

పరమేశ్వర్ క్వెశ్చన్‌మార్క్ ముఖంపెట్టి అతనివంక చూశాడు.

''సా... ల... ల... అఁ... హ...'' అంటూ రకరకాలుగా ముఖకవళికల్ని ప్రదర్శించి 'ఠాప్'మని తుమ్మాడు. తర్వాత ముక్కు తుడుచుకుని, ''సారీ... లక్డీకపూల్ బస్ వెళ్లిపోయిందా'' అన్నాడు.

పరమేశ్వర్‌కి చీదరన్పించింది.

''లేదు'' అంటూ ముఖం తిప్పేసుకున్నాడు.

తరువాత కొద్దినిముషాల్లో ఆ బస్ రావడం-బస్ ఆపుతూ డ్రైవర్ తుసుక్కున తుమ్మడం జరిగింది.

బస్ ఎక్కుతుంటే క్రిందనుంచి నాలుగుతుమ్ములు విన్పించాయి. అందుకు జవాబా అన్నట్లు బస్సులోంచి అరడజను తుమ్ములు వినపడ్డాయి.

''టికెట్... టికెట్...'' అంటూ వచ్చిన కండక్టర్ పరమేశ్వర్ దగ్గిర డబ్బులు తీసుకుంటూ ''ఎ... హాఁ... హాఛ్'' అని ఢామ్మున తుమ్మి ''ఎక్కడికి సార్?'' అన్నాడు.

''సెక్రటేరియట్'' అన్నాడు పరమేశ్వర్ సీ



రియస్‌గా.

బస్ అంతా ఫుల్‌రష్! ప్రయాణికులు తుమ్ముతూ టిక్కెట్లు అడుగుతుంటే కండెక్టరూ యధాశక్తి తుమ్ముతూనే వాటిని ఇష్యూ చేస్తున్నాడు. సీట్లలో కూర్చున్నవాళ్ళూ తుసుక్ తుసుక్ తుమ్ముతూనే కబుర్లు చెప్పుకుంటున్నారు. పరమేశ్వర్‌కి ఆ తుమ్ముల్ని చూస్తుంటే చెడ్డచిరాకేస్తోంది.

బస్‌దిగి బ్రీఫ్‌కేస్‌తోసహా గబగబ ఆఫీసు వైపు నడక సాగించాడతను.

గేటు దగ్గరి గూర్ఖా స్టిఫ్‌గా శాల్యూట్‌చేసి 'గుడ్ మార్నింగ్' అనకుండా 'హాఛ్' అని తుమ్మాడు.

అతనివంక కొరకొరా చూసి తన సెక్షన్‌లోకి వచ్చి సీట్లో కూర్చుంటూ "రంగయ్యా... వాటర్" అన్నాడు.

గాజు గ్లాసుతో నీళ్లందిస్తూ ఆఫీస్‌బోయ్ రంగయ్య పుసుక్కున తుమ్మాడు.

అతనివంక మింగేసేలా చూస్తూ గ్లాస్ అందుకున్నాడు పరమేశ్వర్.

అంతలో మిగిలిన స్టాఫ్ కూడా వచ్చేశారు.

"హాఛ్... హాఛ్..." అని తుమ్ముకుంటూనే కబుర్లలో పడ్డారు వారు. ఏదో డ్రాఫ్టు రాయాలని సీరియస్‌గా పదిలైనులు రాసేలోగా ఇరవైతుమ్ములు విన్పించాయి పరమేశ్వర్‌కి.

ఆ గోల భరించలేక కాంటీన్‌కి వెళ్ళాడు. అక్కడా అదే భాగోతం. ప్రొప్రైటర్, సర్వర్, ప్లేట్లు కడిగేవాడు కూడబలుక్కున్నట్లుగా ఒకరితర్వాతొకరు ఒక క్రమంలో తుమ్మేస్తున్నారు.

ఇలా లాభంలేదని ఆఫీస్ లైబ్రరీలో నిశ్శబ్దంగా ఉంటుందిగదా అని అందులో దూరాడతను. అక్కడ ఎవరూ మాట్లాడుకోడంలేదు గానీ ఎవరిమానాన వారు తుమ్ముకోడంలో ఒకరితో ఒకరు పోటీలు పడుతున్నారు.

తుమ్ముల విషయం ఆఫీసర్‌కి కంప్లెయింట్‌చేసి స్టాఫ్‌మీద యాక్షన్ తీసుకోమని చెప్పాలని ఆవేశంగా సరాసరి ఆయన కేబిన్‌లోకి దారితీశాడు పరమేశ్వర్.

అతను కాబిన్‌లోకి అడుగిడగానే "వాట్ మిస్టర్ పరమేశ్వర్..." అంటూ తుసుక్కున తుమ్మాడు ఆఫీసర్.

తనేదో చెప్పబోయేలోగానే ఆగమన్నట్లు చేతితో సైగచేసి వరుసగా ఆరుతుమ్ములు తుమ్మి ఆ తర్వాత అతనివంక ఏమిటన్నట్లు చూశాడాయన.

తుమ్ములమీద ఈయన ఏక్షన్ ఏం తీసుకుంటాడు నా పిండాకూడు అని మనసులో అనుకొని తలనొప్పి వంకతో పర్మిషన్ తీసుకుని ఇంటికి బయలుదేరాడతను. బస్సులో ఉదయం అనుభవం గుర్తుకొచ్చి ఆటో ఎక్కాడు.

మీటర్ సెట్ చేస్తూనే ఆటోవాడు భూమ్యాకాశాలు కంపించేలా గాఠిగా తుమ్మాడు. ఆ తర్వాత ఆటో ఇల్లు చేరేలోగా వాడెన్నిసార్లు గేర్లు మార్చాడో అందుకు రెట్టింపుసార్లు తుమ్మాడు. విసుగ్గా ముఖంపెట్టి ఆటో ఫేర్ చెల్లించి ఇంట్లో కొచ్చాడు పరమేశ్వర్.

అతన్ని చూస్తూనే భార్య ముఖం చేటంత చేసుకొని "ఏమండీ... ఆ... హాఛ్... కాంపునించి వచ్చి రైలుదిగి అటునించి అటే ఆఫీసుకి వెళ్లివస్తున్నారా హాఛ్..." అంటూ తుమ్ముతూనే అడిగింది.

పరమేశ్వర్‌కి పిచ్చికోపం వచ్చింది. "మీ అందరికీ ఏం మాయరోగం వచ్చిందే. సిటీ మొత్తం తెగతుమ్ముతున్నారు. కొంపలో కూడా ఉండనివ్వరా నన్ను" అన్నాడు చిరాగ్గా.

"మొన్న మీరు ఊళ్లో లేరుగదా సరదాగా పక్కింటివాళ్ళతో కల్సి టాంక్‌బండ్‌కి వినాయక నిమజ్జనం చూడ్డానికి వెళ్ళానండి. అబ్బ అక్కడ ఇసకేస్తే రాలనంత జనం... అంతలో పెద్దవాన పట్టుకుంది. తడిసి ముద్దయిపోయాం. జలుబుచేసి... హాఛ్..." నవ్వింది ఆమె.

"ఔరా ఇదన్నమాట తుమ్ముల రహస్యం" అంటూ ఆశ్చర్యంతో నోరు తెరిచిన పరమేశ్వర్ "హాఛ్" అని తనూ ఓ తుమ్ము తుమ్మి గట్టిగా నవ్వాడు.

పెళ్లయ్యాక అంతవరకూ భర్త ముఖంలో నవ్వు చూడని ఆ భార్యామణి ఆనందంగా పదితుమ్ములు తుమ్మింది.

-అన్వేష్

# సంకెళ్ళపై సమీక్షలు

జనవరి 'చతుర'లో ప్రచురితమైన పి.వి.బి. శ్రీరామమూర్తి నవల 'సంకెళ్ళు'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం..

## కొండంత క్షోభకు గోరంత ఊరట

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

**జా**నెడు కడుపుకోసం, నిత్యం ఈ వెకిలిచేష్టల పోకిరీ సమాజంలో, అనుక్షణం మానసిక క్షోభను, చిత్రహింసను అనుభవిస్తూ శ్వేతవస్త్రాలతో కదుల్తూ, రోగులకు ప్రాణంపోసే గ్రామీణ ఆరోగ్య కార్యకర్తల కొండంత ఆవేదనకు గోరంత దర్పణం జనవరి 'చతుర' అందించిన 'సంకెళ్ళు' నవల.

వృత్తిరీత్యా, సామాజిక దౌష్ట్యంలో భాగమైన కుళ్ళు రాజకీయాలమధ్య, అధికారుల దయా దాక్షిణ్యాల, కరుణా కటాక్షాలమధ్య, నిత్యం నలిగిపోతూ విధి నిర్వహణలో సజీవ సమిథలవుతున్న వేలాది ఆరోగ్య కార్యకర్తల అనుభవాల దొంతర ఈ నవల. ఆద్యంతం ఉత్కంఠతో సాగిన 'సంకెళ్ళు' నవల ఈనాడు ఎందరికో కనువిప్పు కలిగించాలి. రోగుల రోగాలకే తప్ప సామాజిక మాయరోగాలకు మందులివ్వలేని ఎందరో ఏ.ఎన్.ఎం.లు ఆర్థిక, సామాజిక, సాంఘిక, మానసిక, శారీరక దోపిడీల ఫలితంగా అనుక్షణం సంఘర్షణకు గురౌతున్నారు. ఆ వృత్తిలో ఇమడలేక కొందరు ఆత్మహత్యలకు పాల్పడుతుంటే, మరెందరో గత్యంతరం లేని పరిస్థితుల్లో పతనమవుతుంటే, 'ఈ విపరీత పరిస్థితులకు బాధ్యులెవరు?' అనే ప్రశ్న పఠితుల్నికదలించక మానదు.

గ్రామీణ ప్రాంతాల్లో ప్రభుత్వ వైద్యంమీదా, ప్రభుత్వ మందులమీదా నమ్మకం లేకపోవటానికి నిరక్షరాస్యత, అజ్ఞానంమాత్రమే కారణం అయితే మరి కార్యకర్తలపై నమ్మకం, గౌరవం లేకపోవటానికి బాధ్యులెవరు? వారిపై విశ్వాసాన్ని కలిగించలేకపోతున్నదెవరు? ఈ దౌర్భాగ్య పరిస్థితుల్లో, అసహాయస్థితిలో శలభాల్లా మాడిపోతున్నవారిలో అమ్మలులాంటివారికన్నా మరియమ్మలు, రమీజాలు, కమలమ్మలు ఎక్కువ మందన్న నగ్నసత్యాన్ని విస్మరించగలమా?

కమాలుద్దీన్‌లాంటి వంచకులు, కృష్ణారావు, యు.డి.సి.లాంటి సహోద్యోగులు విషసర్పాలై అనుక్షణం కాటువేసేందుకు పొంచివుండే భయంకర పరిస్థితుల్లో ఆరోగ్య కార్యకర్తల భవిష్యత్తు ఊహిస్తుంటే రేపు ఈ వృత్తుల్లోకి మన చెల్లెళ్ళను, అక్కలను పంపగలమా అనేది నేడు మనముందున్న భయంకరమైన ప్రశ్న.

"ఏఎన్.ఎం. అంటే అందరూ నా మొగుళ్ళే" అనే మాటను ఈ నవలలో ఏ రూపంలోనైనా రచయిత రాయకుండా వుండాల్సింది. ఈ నవల చదివి రేపు కార్యకర్తలను ఎవరేనా ఇలాగే వ్యాఖ్యానించరని గ్యారెంటీ ఏమిటి? నిజానికి ఈ పరిస్థితిని కల్పించిందెవరో ఆలోచించాల్సిన బాధ్యత మనమీదుంది

వినూత్నశైలిలో, మనలో భాగమైన స్త్రీలు, అందునా ఆరోగ్యాన్ని అందించే మహిళా ఉద్యోగినుల యదార్థ జీవితాలకు కొన్ని కోణాల్లోనైనా అక్షరరూపం ఇచ్చిన రచయిత పి.వి.బి.శ్రీరామమూర్తికి, ప్రచురించిన 'చతుర'కు ఎందరో ఆరోగ్య కార్యకర్తలు ఋణపడి వుంటారనటంలో సందేహంలేదు. మహిళల





జీవన కథాంశాలతో నవలలు అందించే 'చతుర'లో మరో మంచినవల చదివామన్న తృప్తి కలిగింది.

-బి.వి.
హైద్రాబాద్-500 008

## వ్యథార్థ జీవుల యథార్థగాథ

*(రెండవ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

**జ**నవరి 'చతుర'లోని శ్రీ పి.వి.బి.శ్రీరామమూర్తి నవల 'సంకెళ్ళు' సభ్యసమాజంలో నిర్లక్ష్యం కావించబడుతున్న ఒక వర్గపు స్త్రీ ఉద్యోగినుల సాధక బాధకాలను వీలైనంత విపులంగా చెప్పింది.

సమాజ సేవాదృక్పథమే ధ్యేయంగా గల కొన్ని ఉద్యోగాలు సమాజంలో హేళనలకు, ఎద్దేవాలకు మాత్రమేకాక, ఆ ఉద్యోగినులు అవమానాలకు కూడా గురి అవుతుండటం నిజంగా సిగ్గుపడాల్సిన విషయం.

నవలలో రచయిత రాసినట్టుగా ఏఎన్నెమ్‌లపై ఊరిపెద్దల దాష్టీకాలు, వాళ్ళ పై అధికారులైన డాక్టర్లు, మెడికల్ ఆఫీసర్ల అత్యాచారాలు చాలావరకు వాస్తవాలే.

ఇంత లోపభూయిష్టంగా ఉన్న ఆరోగ్య వ్యవస్థను ప్రభుత్వం చూసీ చూడనట్టుగా పట్టించుకోకపోవటంవల్ల ఏఎన్నెమ్‌లవంటి సాధారణ ఉద్యోగినులు తమ రోజువారీ విధుల్లో ఎన్నో అవమానాలు ఎదుర్కొనడమేకాక ఎంతో అమూల్యమైన వారి సేవలు మారుమూల గ్రామాల్లోని బీదాబిక్కికి అందకుండా పోతున్నాయి.

అన్నెంపున్నెం ఎరుగని రమీజా కామాంధుడైన డాక్టరు పన్నిన వలలో చిక్కటం, ఆత్మరక్షణార్థం అమ్మలు హత్యచేయాల్సి రావటం కేవలం కథకి సంబంధించిన సంఘటనలు అనిపించవు ఏఎన్నెమ్‌ల జీవితాన్ని దగ్గరగా చూసినవాళ్ళకు.

"ప్రతి మహిళా ఈ ఉద్యోగంలో చేరినప్పుడే సంకెళ్ళలో ఇరుక్కున్నట్లే" అన్న అమ్మలు మాటల్లో ఎంతో వాస్తవముంది.

కథకు కొంత డ్రమటిక్ టచ్ ఇచ్చినా చాలా విషయాలు వివరంగా పరిశీలించి ఈ వ్యథార్థ జీవుల యథార్థ కథను పాఠకులకందించిన రచయిత అభినందనీయులు.

-మేడేపల్లి శేషు
న్యూఢిల్లీ-110 001

## సామాజిక స్పృహ

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

'సంకెళ్ళు' చదువుతున్నంతసేపూ వాస్తవ జీవితాలను చూస్తున్న అనుభూతిని కలిగించింది, తప్ప ఒక నవలలా అనిపించలేదు. ఆగ్జలరీ నర్స్ మిడ్‌వైఫ్‌ల జీవితాలను రచయిత పి.వి.బి.శ్రీరామమూర్తిగారు చక్కగా వివరించారు.

అమ్మలు క్యారెక్టర్ ఆ వ్యవస్థకే వెలుగు వంటిది. ఇటు ఇంట్లోనూ, అటు ఉద్యోగంలోనూ మెప్పును పొందగలగడం ఆమె సుగుణాలకు నిదర్శనం. ఆమె నడవడి, నిర్భయత్వం దుర్మార్గుడైన సర్పంచ్‌ను కూడా మంచి మనిషిని చేస్తుంది.

ఎంతటి ఆలోచనాపరులైనా ఎప్పుడో ఓసారి తప్పటడుగు వేయకమానరు. కానీ తను తప్పటడుగు వేసి మోసపోయానని తెలుసుకొని, తన జీవితాన్ని సరిదిద్దుకునే ప్రయత్నంలో ఉండగానే కట్టుకున్నవాడి క్రౌర్యానికి ఘోరంగా బలి అవుతుంది రమీజా. రమీజా చావు ప్రతి ఒక్కరినీ కదిలించి, కంటతడి పెట్టించేలా ఉంది.

ఆర్థిక పరిస్థితులవల్ల విధిలేక కొందరు, ఆ వృత్తిపట్ల ఇష్టంతో కొందరు, ఏఎన్ఎమ్ ఉద్యోగాలకొస్తారు. ఆడది ఒంటరిగా బతికితే సహించలేని దౌర్భాగ్య సమాజం మనది. అందుకే ఎవరైనా నాలుగు ప్రేమమాటలు చెప్పగానే కరిగిపోయి వాళ్ళను నమ్మేసి, వాళ్ళతో జీవితాన్ని ముడిపెట్టుకోవాలని ఆశపడే అభాగినులెందరో! ఆ ఊపులో వారు అవతలి వాళ్ళ గతాన్ని గురించి ఆలోచించరు. ఇక్కడే చాలామంది మోసపోతారు. ఆ అవకాశాన్ని అదునుగా తీసుకొని పబ్బం గడుపుకునే కమాలుద్దీన్‌లు ఎంతమందో!

మనుషుల్లోనూ రాక్షసులుంటారనడానికి నిదర్శనం డాక్టరు కృష్ణారావు. కింది ఉద్యోగస్తు

లంటేనే సహజంగా చిన్నచూపు ఉంటుంది. వాళ్ళుగనుక స్త్రీలయితే ఇహ ఎదురు ఏముంటుంది. ఏంచేసినా చెప్పుకింద పురుగుల్లా పడి ఉంటారని వాళ్ళ ధీమా! కానీ, ఆడది ఆత్మరక్షణకోసం ఆదిశక్తి అవతారం కూడా ఎత్తుతుందని నిరూపించింది అమ్మలు.

ఏఎన్ఎమ్‌ల జీవితాలు ముళ్ళమీద పడిన అరిటాకుల్లాంటివి. వాళ్ళు నిష్కారణంగా గురయ్యే అపవాదుల విషయం గురించి అమ్మలు చేత విలేకర్లముందు చాలా సూటిగా చెప్పించారు.

'సిస్టర్' (సోదరి) అని పిలుస్తూనే సెక్స్‌దృష్టితో చూసే దుర్మార్గ మనస్తత్వాలకు చెంపదెబ్బలాంటిది ఈ నవల.

ఇలాంటి నవలలు సమాజానికి ఎంతో అవసరం.

మొత్తానికి నవల ఎక్కడా విసుగు పుట్టించకుండా, చివరివరకూ ఉత్కంఠతో చదివించేలా ఉంది. ఇంత చక్కటి యథార్థ జీవన కథాంశాన్ని ఎన్నుకున్నందుకు రచయిత అభినందనీయుడు.

-డి.సులోచనాదేవి
కుందారం-504 216

## కృతక సంకెళ్లు

*(నాలుగవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

ఆధునిక సాహితీరంగంలో అత్యంత శక్తిమంతమైన నవలా ప్రక్రియను నెలనెలా విజయవంతంగా పోషించుకొస్తున్న 'చతుర' తనదైన ఒక విలక్షణ స్థానాన్ని పాఠక హృదయాల్లో ఏర్పరచుకొంది.

జనవరి నెల- ''సంకెళ్లు'' నవల వైవిధ్యభరిత ఇతివృత్తంతో ప్రయోజనకరంగా ఉంది. రచయిత ఎన్నుకొన్న థీమ్ అత్యంత బలమైనదీ, వివేకవంతమైనదీ కూడా.

'అమ్మలు' పాత్ర సృష్టివెనక ఓ ఫ్లారెన్స్ నైటింగేల్- సిస్టర్ నివేదితల స్ఫూర్తి ద్యోతకమయ్యింది. అట్టి స్ఫూర్తిని మధ్యతరగతి తెలుగు కుటుంబ జీవనానికి ఆపాదించడంలో రచయిత కృతకృత్యులయ్యారు.

రమీజా ఒక విలక్షణమైన వ్యక్తిత్వం గల స్త్రీ. తన పుట్టుకే..., తనవాళ్లు భరించలేని దురదృష్టవంతురాలైనప్పటికీ- తదనంతరకాలంలో పెద్దలు పశ్చాత్తాపం ప్రకటించినప్పుడూ, తన పెంపుడు తల్లి నిర్వాకాన్ని తెలుసుకున్నప్పుడూ గొప్ప 'క్షమాగుణాన్ని' ప్రకటిస్తుంది. రచయిత ఈమె అంతర్మథనాన్ని వ్యక్తీకరించడం ద్వారా ఒక ఉదాత్తపాత్రగా మలిచాడు. ఇంత ఉదాత్తమైన స్త్రీ కమాలుద్దీన్, డాక్టర్ కృష్ణారావుల చేతిలో దారుణంగా మోసపోయి విషాద స్మృతిగా మిగిలిపోవడం పాషాణహృదయాలను సైతం కదలించి కన్నీరు తెప్పిస్తుంది.

సమాజంలో మంచి చెడు కలిసి ఉంటాయన్న భావం సర్పంచ్ అతని భార్య పాత్రల చిత్రణ నిరూపిస్తుంది. అలాగే కృతకసంకెళ్ళు మూర్తీభవించిన మానవత్వాన్ని ఎంతోకాలం బంధించలేవనే ఆశావాదం, మానవతా విలువలపట్ల తనకుగల విశ్వాసం ప్రతి మలుపులో రచయిత 'అమ్మలు' విజయాల ద్వారా వ్యక్తీకరిస్తాడు.

ఈ నవల చదివింతర్వాతనైనా ఏ.ఎన్.ఎమ్.లపట్ల గల చులకనభావాన్ని మానుకోలేనివారు క్షమార్హులు కారు. ఏ కొన్ని హృదయాలకైనా సూటిగా ఈ నవల చేరగలదనటంలో సందేహం లేదు.

ఈ వినూత్న ఇతివృత్తం, ఎన్నుకొన్న రచయిత వ్యాపార విలువలకతీతంగా ప్రచురించిన 'చతుర' నిజంగా అభినందనీయులు!

-లింగంపల్లి శంభాజీ
హైదరాబాద్-500 007

## ఆదర్శవంతమైన నవల

*(ఐదవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

నవ్యకాంతులీనుతూ, శోభాయమానమైన ముఖచిత్రంతో వెలువడిన నూతన సంవత్సరపు తొలినవల 'సంకెళ్లు' ఒక చక్కని నవల. ఇంతకుముందు ఎవరూ స్పృశించని 'సబ్జెక్టు'ను ఎంచుకొని కత్తిమీద సాము చేశారు రచయిత. తెలుపురంగు యూనిఫాంతో ముఖాన చిరునవ్వు చిందిస్తూ, వాడవాడలా మొ





క్కవోని దీక్షతో అవిశ్రాంతంగా తిరిగే 'మిడ్‌ వైఫ్‌' అనబడే ఎ.ఎన్‌.ఎం.ల సాధకబాధకాలను, అంతర్మథనాన్ని హృద్యంగా చిత్రించారు.

ప్రభుత్వం 1965కు ముందు ఎ.ఎన్‌.ఎం.లకు 'మిడ్‌వైఫ్‌' పేరుతో శిక్షణ ఇచ్చి, గర్భవతుల, శిశువుల సేవకు వినియోగించటం జరిగేది. దరిమిలా 18 నెలల ఈ కోర్సుస్థానీ ఆక్సులరీ నర్సు మిడ్‌వైఫ్‌ కోర్సును ప్రభుత్వం ప్రవేశపెట్టింది. వీరిని మల్టీపర్పస్‌ ఆరోగ్య కార్యకర్తలుగా కూడా వ్యవహరిస్తారు. కేవలం గర్భవతులకు సేవలందించటమే కాకుండా పిల్లల సంరక్షణ, పోషణతోపాటు, గ్రామీణ స్త్రీలని కుటుంబ నియంత్రణ ఆపరేషన్లకు ఒప్పించడం, గ్రామాల్లో అంటువ్యాధులు ప్రబలకుండా మందులివ్వడం, గ్రామాలలో ఉండే మంత్రసానులకు శిక్షణ ఇవ్వటం మొదలైనపనులన్నీ ఈ ఎ.ఎన్‌.ఎం.ల విధులలోకే వస్తాయి.

ఈ నవలలో అమ్మలు, రమీజా పాత్రలు ఆయువుపట్టులాంటివి. అమ్మలులో మనోనిగ్రహం, ఆత్మనంయమనం కనిపిస్తే, రమీజాలో అనాలోచితం, తొందరపాటు కనిపిస్తాయి. ఆ తొందరపాటు మూలంగానే చపలచిత్తుడైన కమలుద్దీన్‌చే వంచించబడి, జీవితాన్ని చేజేతులా పాడుచేసుకొంది. కమాలుద్దీన్‌ మొదటి భార్య నజ్మాతో ప్రవర్తించిన తీరు, తను నష్టపోయినా నజ్మాకు అన్యాయం జరగకూడదనే తపన రమీజాను ఎంతో ఎత్తుకు తీసుకువెళ్లి కూర్చోపెట్టాయి. వృత్తిపరమైన సమస్యలతోపాటు అత్త నారాయణమ్మతోనూ, భర్త సుదర్శనంవల్ల కూడా సమస్యలు ఎదుర్కొన్న అమ్మలులో వృత్తిధర్మం, గృహస్థజీవితం మధ్య ఊగిసలాట కపిస్తుంది. రావివలస సర్పంచ్‌లో ఒక్కసారిగా వచ్చిన మార్పు విస్మయపరిచినా, కాలం-పరిస్థితులు ఎంతటివారినైనా లొంగదీసుకుంటాయనిపిస్తుంది. అన్నిచోట్లా ఉన్నట్లే రాజకీయభూతం ఇక్కడ కూడా తన పాత్ర నిర్వహించింది.

మన అక్కలు చెల్లెళ్లలాంటి ఈ ఎ.ఎన్‌.ఎం.లను సోదరభావంతోనే చూస్తూ, వీరి విధులలో సహకరించి వారి సేవలను మరింతగా ప్రజలకు అందించేటట్టు సహకరించటం మనందరి బాధ్యత అని ఈ నవల చెప్పకనే చెపుతోంది. కనీసం తెల్ల అమ్మోర్లు, మిడ్‌నైట్‌వైఫ్‌లాంటి పేర్లు పెట్టి, వారిని హేళన చేయకుండా ఉన్నా వారికి మనం పెద్ద సహాయం చేసినట్లే.

-కె. సత్యరాజ్‌,
గొల్లల మామిడాడ-533 344

## మార్గదర్శి

*(ఆరవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

**'సంకెళ్లు'** నవల చదివాక ఒక్కక్షణం మనసు మౌనంగా రోదించింది. అమ్మలు లాంటి శాంతి, సహనాలకు మారుపేరైనవారు కూడా అధికారుల హింసలకు ఎలా గురయ్యేదీ మనసులకు హత్తుకుపోయేలా చిత్రించారు రచయిత ఆ పాత్రని. అన్యాయంగా- మోసానికి బలైపోయిన రమీజా పాత్ర ఓ పక్క సానుభూతిని చూరగొంటూనే మరోపక్క క్షణికావేశాలకూ, ఆకర్షణలకూ లొంగిపోయే అమ్మాయిలకు గుణపాఠంగా కూడా మిగిలిపోతుంది.

'వసంత'లాంటి ఆడపడచు అమ్మలుకే కాదు మాకూ వుంటే ఎంత బావుండేది అనిపించేలా తీర్చిదిద్దారా పాత్రను.

కమాలుద్దీన్‌లాంటి గోముఖవ్యాఘ్రాలు ఎంతకైనా తెగించగలరనే సత్యాన్ని గుండెలు పిండేలా చిత్రించారు.

ప్రేమ నటించి- భార్యను వంచించి- పెళ్లి పేరుతో ఓ అమాయకురాలిని నరకంలోకి నెట్టడమే కాకుండా చివరకు క్రూరంగా చంపగలిగిన ఆ పాత్ర రచయిత సహజ రచనా చాతుర్యానికి ఓ మచ్చుతునక.

సమాజానికి అద్దంపట్టి చూపించి మార్గదర్శకంగా నిల్చిపోగల విధంగా రూపొందించిన ఈ నవల సాహిత్యప్రయోజనాన్ని సంపూర్ణంగా నెరవేర్చగలిగిందనటంలో సందేహంలేదు.

రచయితకు, చతురకూ అభినందనలు.

-స్వాతి
హైదరాబాదు-500 039



# చతుర

సంపుటి: 16 సంచిక: 2 మార్చి: 1993

భర్త తనను వదిలి మరోస్త్రీకి దగ్గరయినా, కొడుకే సర్వస్వం అనుకుని, వాడితోడిదే లోకంగా బతుకుతున్న ఆమె జీవితంలో అనుకోకుండా ప్రవేశించాడు మరోవ్యక్తి.

భర్త స్థానాన్ని భర్తీచేస్తూ మూగబోయిన ఆమె జీవన వీణాతంత్రులని... అతడు మధురంగా మీటబోయిన తరుణంలో...

ఆమెకో సమస్యగా ఎదురు నిలిచాడు కొడుకు.

అమ్మవెంట మరో వ్యక్తి నీడను కూడా సహించలేని ఆ పసివాడి మనోవేదనకి పరిష్కారం ఏమిటి?

భర్తగా ఆ ఉత్తముడందించిన అభయహస్తం విడువలేక, పిల్లవాడిని వదులుకోలేక... తల్లిగా ఆమె తీసుకున్న నిర్ణయం ఏమిటి?

ఓ పసివాడి విచిత్ర మనస్తత్వాన్ని విశ్లేషిస్తూ ఆసక్తికరంగా సాగిన మన్నూభండారీ అనేక ముద్రణలు పొందిన హిందీ నవలకు ఉమాదేవి స్వేచ్ఛానువాదం 'బంటీ' ఈనెల 'చతుర' సమగ్రనవల.



అమ్మ డ్రెస్సింగ్ టేబుల్ ముందు కూర్చుని కాలేజీకి తయారవుతోంది. బంటీ వెనుకగా నుంచుని ఆవిడనే చూస్తున్నాడు. అమ్మ కాలేజికి వెళ్ళడానికి తయారవుతున్నంతసేపూ వాడు రోజూ అలాగే చూస్తాడు. ఎందుకో తెలియదు గానీ, ఆ డ్రెస్సింగ్ టేబుల్ మీదుండే రంగు రంగుల సీసాల్లో ఏదో మంత్రశక్తి వుండే వుంటుందని వాడి నమ్మకం. ఎందుకంటే ఆ సామాన్లు వాడిన మరుక్షణం అమ్మ రూపం పూర్తిగా మారిపోతుంది. ఆవిడ తన అమ్మకాదు, మరెవరో కొత్త మనిషి అనిపించేస్తుంది.

అలంకారం అంతా పూర్తయ్యాక హ్యాండ్ బ్యాగ్ తీసుకుని లేస్తూ "బంటీ! ఎండలోకెళ్లి ఆడద్దునుమా" అని చెప్పింది అమ్మ. తరువాత అత్తయ్యని పిలిచి, "చూడూ బంటీకి ఏవి ఇష్టమయితే అవే వండిపెట్టు తెలిసిందా?" అని ఆదేశించింది.

బయల్దేరే ముందు అమ్మ బంటీ బుగ్గలు పుణికింది. వాడి జుట్టులోకి వేళ్లు జొనిపి ముద్దుగా ఆ జుట్టునిపట్టి తలవూపింది. బంటీ బొమ్మలా అలాగే కదలకుండా నుంచున్నాడు. ఎప్పట్లా అమ్మ చేతులు రెండూ పట్టుకుని ఉయ్యాలలూగలేదు. వచ్చేటప్పుడు ఏం తెస్తావని మారాం చెయ్యలేదు. అమ్మ వాడిని దగ్గరకి తీసుకుని వాటేసుకుంది. అయినా వాడికి ఆమె తనకు చాలా దూరాన వున్నట్టే అనిపించింది. తరువాత కొద్ది క్షణాల్లో ఆమె నిజంగానే దూరంగా వెళ్లిపోయింది. ఆమె చెప్పుల టకటకలు దూరమవుతుంటే బంటీ బయటకి వచ్చి అటే చూస్తూ నుంచున్నాడు. అమ్మ గేటుతీసి, రోడ్డుదాటి సరిగ్గా ఇంటికెదురుగానే వున్న కాలేజీలోకి ప్రవేశించింది. కేవలం అమ్మని చూడ్డమే అప్పుడు వాడి ఉద్దేశం. అమ్మ ఎలాగూ వెనక్కి తిరిగి చూడదని వాడికి బాగా తెలుసు. ఆమె తిన్నగా కాలేజీలోకి వెళ్తుంది. రూమ్ దగ్గరకి వెళ్లేటప్పటికి జవాను సలాం చేస్తాడు. పరుగెత్తుకు వెళ్లి తెరలు తొలగిస్తాడు. అమ్మ గంభీరంగా లోపలకి వెళ్తుంది. పెద్ద టేబుల్‌కి వెనుకనున్న కుర్చీలో కూర్చుంటుంది. టేబుల్ మీద గుట్టగా పడున్న ఫైళ్లు, ఉత్తరాలు ముందుకి లాక్కుని కూర్చుందంటే వాటిలో పూర్తిగా మునిగిపోతుంది. అప్పుడావిడ పూర్తిగా వేరే వ్యక్తిగా మారిపోతుంది. బంటీకి మాత్రం ఆ కుర్చీ మీదుండే అమ్మ అంటే బొత్తిగా నచ్చదు.

ఇదివరకయితే స్కూలుకి శలవులిచ్చినప్పుడు వాడూ అమ్మతో కలిసి కాలేజీకి వెళ్లేవాడు. వాడిని చూడగానే జవాను ఎత్తుకునేటందుకు ముందుకి వచ్చేవాడు. కానీ బంటీ చెయ్యి విదిలించుకుని వెనక్కి జరిగేవాడు. అమ్మ రూమ్‌లోనే వాడి కోసం ఒక చిన్న కుర్చీ, డెస్క్ వేసి వుండేవి. అక్కడ కూర్చుని వాడు డ్రాయింగ్స్ గీసుకునేవాడు. రూమ్‌లోకి వచ్చిన వాళ్లంతా వాడివేపు ఒకసారి ముద్దుగా చూసి ఒక చిరునవ్వు చిందించేవారు. అప్పుడు వాడు అమ్మ వేపు ఓసారి చూసేవాడు. కాని ఆ కుర్చీ మీద కూర్చునే అమ్మ ముఖం ఎందుకలా కఠినంగా కనిపిస్తుందో అంతుపట్టక వాడికి విచిత్రంగా వుండేది. అమ్మ తన అసలు ముఖం మీద మరేదో ముసుగు ధరించినట్టుగా అనిపించేది. నిజంగా అమ్మకి ఇంకో ముఖం వుంది కూడా. ముఖమే కాదు, గొంతుకూడా ఎంత కఠినం! మాట్లాడితే కోప్పడినట్టుంటుంది. అమ్మ బంటీని కోప్పడ్డం అనేది చాలా అరుదైన విషయం. అందుకే మొహం సీరియస్‌గా పెట్టుకుని కఠినంగా మాట్లాడే ప్రిన్సిపాల్ రూపంలోని అమ్మ అంటే వాడికి బొత్తిగా ఇష్టం వుండదు. ఇంట్లో ఒక్కడ్నే వున్నా ఫరవాలేదుగానీ కాలేజీకి మాత్రం వెళ్లకూడదు బాబూ! అనుకున్నాడు. అక్కడ ఎవరున్నారని వెళ్లాలి? అక్కడుండేది అమ్మ కాదు. ఓ ప్రిన్సిపాల్, అంతే.

కొంచెంసేపు అలా గేటు దగ్గరే నుంచుని బంటీ వీధిలో వచ్చేవాళ్లనీ పోయేవాళ్లనీ చూస్తూ నుంచున్నాడు. ఇద్దరబ్బాయిలు సైకిళ్ల మీద కబుర్లు చెప్పుకుంటూ వెళ్తున్నారు. ఇంకొంచెం పెద్దయితే తనూ ఒక సైకిల్ తీసుకోవాలి అనుకున్నాడు. కానీ వాడు వీధిలోకి సైకిల్ వేసుకుని వెళ్తే అమ్మ వూరుకుంటుందా? ఎందుకో వాడు బయటకి వెళ్లాడంటేనే ఏక్సిడెంటవుతుందేమోనని అమ్మకి భయం.

ఇప్పుడు స్కూలుకి శలవులు. ఈ శలవులన్నీ ఎలా గడపాలో బంటీకి అర్థం కావటం లేదు. ఒకసారి తోటంతా తిరిగొచ్చాడు. లోపలకి




వెళ్లి గదిలో అడుగు పెట్టగానే వాడి దృష్టి డ్రెస్సింగ్ టేబుల్ మీద పడింది. అవే రంగు రంగుల సీసాలు, వాటితోబాటు కఠినమైన అమ్మ ముఖం కళ్లముందు కదిలింది. ఆ ముఖం అలా ఎలా మారిపోతుందో...

"ఇక్కడేం చేస్తున్నావు బంటీ? స్నానం చేసి అన్నం తినవూ?" అంటూ చీపురు పట్టుకుని గదిలోకి వచ్చింది అత్తయ్య. ఆవిడ గదిలోకి రాగానే ఆ చీపురు లాక్కుని, ఆవిడ చెయ్యిపట్టుకుని లాక్కెళ్తూ బతిమాలసాగాడు. "అత్తయ్యా! అత్తయ్యా! ఒక కథ చెప్పత్తయ్యా... అదే... ఆ కథ లేదూ... కోసలరాణికథ... రాక్షసే గాని, మాయమంత్రాలతో... మారు వేషంలో రాణీలాగ నటిస్తుందే... అదీ"

"బాగుందయ్యా... ఇది కథలు చెప్పుకుంటూ కూర్చునే సమయమా? గంపెడు పని పడుందక్కడ. నీకు కథ చెప్తూ కూర్చుంటే ఎలా? కథలు చెప్పేది రాత్రుళ్లు, పగలు కాదు"

"అత్తయ్యా! ఆ రాక్షసి రాణిగా ఎలా మారింది? దానికి మాయలు మంత్రాలు తెలుసా?"

"ఏమనుకున్నావ్ మరి? ఎంతయినా రాక్షసికదా! కావల్సినన్ని మంత్రాలు సంపాదించింది. తనకిష్టమయినప్పుడు ఇష్టం వచ్చిన రూపాన్ని దాల్చేది, ఇష్టం వచ్చిన వేషాన్ని మార్చేది"

"అత్తయ్యా! మనుషులు కూడా అలా చెయ్యగలరా?"

"అదెలా కుదురుతుంది బంటీ? మనుషులు ఈ మంత్ర తంత్రాలన్నీ నేర్చుకుందుకు కుదురుతుందా ఏమిటి?"

"అత్తయ్యా, అత్తయ్యా! నువ్వు రాక్షసిని చూశావా? అదెలా వుంటుంది? మనిషి రూపంలో వుందంటే మనమనలు గుర్తుపట్టనేలేం కదా?"

"బాబోయ్, నేనే రాక్షసినీ చూడలేదుగాని నువ్వెళ్లి ముందు స్నానం చేసిరా పద పద"

"ఊహుఁ... నేనిప్పుడు స్నానం చెయ్యనంటే చెయ్యను"

బంటీ మళ్లీ డ్రెస్సింగ్ టేబుల్ ముందు నుంచుని సీసాలన్నీ చేతిలోకి తీసుకుని ఒక్కొక్కటీ చూడసాగాడు. ఒకసారి తనుకూడా అవన్నీ పూసుకుంటే తన మొహం కూడా మమ్మీ మొహంలా మారిపోతుందేమో! చూడాలి!

"ఓహ్! మళ్లీ డ్రెస్సింగ్ టేబుల్ ముందు చేరావా? బాగుంది... ఇలా అయితే ఆడపిల్లవై పోతావంతే!"

అత్తయ్య నవ్వుతూ వేళాకోళం చేసింది.

"నీ పని పడతానుండు, ఎప్పుడూ ఇలాంటి మాటలేనా!"

బంటీ వుడుక్కుంటూ అత్తయ్యని కొట్టడానికి చెయ్యెత్తాడు.

ఈ అత్తయ్యేమిటో అదోరకం! అమ్మ తనని ముద్దులాడుతూ ఒళ్లో కూర్చోబెట్టుకుంటేనో, తన పక్కన పడుకోబెట్టుకుని కథ చెప్తేనో చాలు, ఈవిడ మొదలెట్టేస్తుంది.

"బంటీ... నువ్వింకా అమ్మ ఒళ్లో కూర్చుంటున్నావా చిన్న పిల్లాడిలా? నువ్వేమన్నా ఆడపిల్లవా"

"అమ్మా, చూడమ్మా ఈ అత్తయ్య..."

కానీ అమ్మ కూడా అత్తయ్యనేమీ అనదు. ఊరికే నవ్వి ఊరుకుంటుంది. ఎందుకంటే ఆవిడప్పుడు ప్రిన్సిపాల్ కాదుగా అమ్మగా మారిపోయుంటుంది. పూర్తిగా అమ్మే! కాలేజీలో గనుక ఈ అత్తయ్య ఇలా మాట్లాడిందంటేనా, అప్పుడు తెలిసొస్తుంది

"నాకు కొడుకూ, కూతురూ అన్నీ వీడే" అని నవ్వుతూ అమ్మ మరింత దగ్గరకి లాక్కుంటుంది. అమ్మ చేతిని వదిలించుకుని అన్నింటికీ హాస్యం చేసే అత్తయ్య ఎదుటినుంచి పారిపోవాలనుకునేవాడు బంటీ. కానీ అమ్మ తొడమీద కూర్చోడం అన్నా అమ్మ కౌగిలిలో గువ్వపిట్టలా ఒదిగిపోవటమన్నా వాడికెంతో ఇష్టం. అమ్మ రోజూ వాడికి కథలు చెప్తుంది. రాజు రాణి కథలు, తమ్ముడికోసం, తల్లికోసం ఏడు సముద్రాలు దాటివెళ్లిన రాజకుమారుల కథలు.

కథంతా అయిపోయాక అమ్మ వాడి బుగ్గలు నవరిస్తూ "బంటీ, నువ్వు పెద్దవాడివయ్యాక నా కోసం ఇవన్నీ చేస్తావా? లేక అమ్మ

# మిరుమిట్లు గొలిపే వింత వ్యాను










ఎర్నీస్టెయిన్‌గోల్డ్ అనే ఈ పెద్దమనిషి ఓ మామూలు వ్యాన్ కొని దాంతో చేసిన ప్రయోగాల కారణంగా అందరి దృష్టిలోనూ పడ్డాడు. ఈ వ్యాన్‌మీద ఆరువేల పౌండ్లు విలువచేసే రకరకాల నాణేలను ఓ క్రమబద్ధంలో అతికించాడు గోల్డ్. ఇవికాక మెటల్‌బకుల్స్, చిన్నచిన్న చాకులు, లోహంతో చేసిన జంతువుల బొమ్మలు... ఇలా కనిపించినవన్నీ తెచ్చి కారుకి అతికించేశాడు. వ్యాన్ హెడ్‌లైట్ల స్థానంలో రెండు కుక్కబొమ్మలను పెట్టి వాటికళ్ళలోంచి లైట్లు వెలిగేలా అమర్చాడు. అంతా బాగానేవుందిగానీ పొరపాటున ఈ వ్యాన్ తీసుకుని సరదాగా బయటకు వెళ్ళడానికి కూడా అవకాశం లేదాయనకి. ఎందుకంటే ఈ వింత చూసేవారివలన ట్రాఫిక్ మొత్తం ఆగిపోయి ఏక్సిడెంట్లు జరిగే అవకాశం వుందన్నారట పోలీసులు.

ముసల్దయిందని ఇంట్లోంచి తరిమేస్తావా?'' అనేది.

''ఫో అమ్మా! మా అమ్మను నేనెప్పటికీ అలా చెయ్యను''

అప్పుడు అమ్మ గాఢంగా కౌగలించుకుని బుగ్గల్నిండా బోలెడు ముద్దులు కురిపించేసేది. అప్పుడు బంటీ ఆలోచించేవాడు... మా ఇద్దరికీ మధ్య ఎవరడ్డం? అని కానీ అదెవరో మాత్రం వాడికి అర్థమయ్యేది కాదు. తల్లి ముఖంలో పరచుకున్న ఉదాసీనత చూస్తే వాడి మనసు గిలగిల్లాడేది. ఏం చెయ్యాలో తెలీక ఆవిడని వాటేసుకుని నిద్రపోయేవాడు.

అప్పుడు అత్తయ్య మాటలు గుర్తుకొస్తాయి. హూఁ! ఈ అత్తయ్యొకత్తె కోతలు కోస్తుంటుందెప్పుడూ. అమ్మ దగ్గర ముద్దు చేయించుకున్నంత మాత్రాని ఎవరైనా ఆడపిల్లలై పోతారా ఏమిటి?

''బంటీ నువ్వు స్నానం చేస్తావా లేదా? పోనీ, ఇవాళ నేను స్నానం చేయించనా?''

''ఏం అక్కర్లేదు, నేనే చేసుకోగల్ను''

''సరే అయితే వెళ్లుమరి. ఈ లోగా నేను బట్టలుతీసి వుంచుతాను''

''హూఁ ఇప్పుడే చెయ్యను. నాకు బుద్ధి పుట్టినప్పుడు చేస్తాను''

బంటీ తన బీరువా తెరిచాడు. అమ్మ కొనిచ్చినవీ, నాన్న పంపించినవీ అన్ని ఆట సామాన్లూ బీరువాలో నిండిపోయున్నాయి. వాట్లోంచి తను కొత్తగా కొనుక్కున్న తుపాకీ బయటకి తీశాడు. అది బాగా పెద్దదే. వాకిలి తుడుస్తున్న అత్తయ్య వెనుకగా వెళ్లి వెన్నుకి ఆనించి.

''జాగ్రత్త! ఇంకెప్పుడయినా నన్ను ఆడపిల్లన్నావంటే షూట్ చేసేస్తాను గుర్తుంచుకో!'' అన్నాడు అత్తయ్యతో.

''హూఁ, నువ్వంతటివాడివేలే. గారాం మితి మీరుతోంది'' అందావిడ.

అంతలో బంటీకి గుర్తొచ్చింది, టిటూకి ఇంకా ఇది చూపించనేలేదని. బంటీ దగ్గరున్న ఆట సామానుతో పోలిస్తే టిటూ దగ్గరున్నవి చాలా తక్కువ. అయినా గొప్పగా ఫోజు కొడతాడు వాడు. ఆ రోజు కేరంబోర్డు చూపించి గొప్పలు పోయాడు. ఈసారి అమ్మతో చెప్పి తనూ అలాంటిది కొనిపించుకోవాలి. లేకపోతే నాన్నతో తెప్పించుకోవాలి.

క్రితం సారి నాన్న వచ్చిన రోజే తన రిజల్ట్స్ వచ్చాయి. రిజల్ట్ చూసి నాన్న ఎంత మురిసిపోయారో! బోలెడంత ముద్దు చేశారు. బోలెడన్ని ఆట వస్తువులు కొనిపెట్టారు.

ఈసారి నాన్న ఎప్పుడొస్తారో ఏంటో.

''బంటీ ఎక్కడికి బయల్దేరావు?'' గుమ్మంలో నుంచి అడిగింది అత్తయ్య.

''టిటూ ఇంటికెళ్తున్నాను. ఇప్పుడే వచ్చేస్తాను''

''అక్కడే కూర్చుండిపోకు. త్వరగా వచ్చెయ్యి. స్నానం కూడా చెయ్యకుండా ఇలా తిరుగుతున్నావని మీ అమ్మకి తెలిసిందంటే కోప్పడతారుమరి''

అత్తయ్య ఇంకా చెబుతూనే వుంది. వాడు జవాబన్నా చెప్పకుండా పరుగెట్టుకుపోయాడు. వాడి స్వభావమే అలాంటిది.

టిటూ ఇంటి వరకూ పరుగెత్తుకు వెళ్లి ఒక నిమిషం అక్కడే ఆగాడు. గుమ్మంలో గనుక టిటూ వాళ్లమ్మ కనిపించిందంటే ఇంక అయినట్టే. అబ్బ! ఆవిడెందుకలా మాట్లాడుతుందో! ఒకసారి శలవు రోజు కదా అని బంటీ పొద్దున్నే వాళ్లింటికి వెళ్లాడు. ''వచ్చేశావా? శలవు వచ్చిందంటే చాలు. పొద్దుట్నుంచీ సాయంత్రందాకా నువ్విక్కడే'' అందామె.

అమ్మ ఎప్పుడూ అలా మాట్లాడదు. టిటూ రోజంతా తన ఇంట్లోనే వుండిపోయినా మమ్మీ ఏమీ అనదు. తనకేమో టిటూ ఇంటికింకెప్పుడూ వెళ్లకూడదు బాబూ అనిపించేది. అసలు వాడే హాయిగా ఇక్కడికొచ్చి ఆడుకోవచ్చు. కానీ ఎన్నిసార్లు రమ్మని పిలిచినా వాడు రాడు. వాడికేంటి ఇంట్లో బిందూ వుంది, శన్నూ వుంది.

ఇలా ఆలోచిస్తూండగా టిటూ వాళ్లమ్మ వరండాలో దర్శనమిచ్చింది. లోపలికి వెళ్లనావద్దా అని తటపటాయించాడు వాడు. అంతలో ఆవిడే వాడిని చూసి పిలిచింది.

''ఓ బంటీనా... రా, లోపలికిరా. ఏంటి చాలా

పెద్ద తుపాకీనే పట్టుకొచ్చావే... ఎవరు కొనిపెట్టారు?''

''నాన్న''

''మీ నాన్న వచ్చారా ఏం?''

''లేదు ఎవరో వస్తుంటే పంపించారు''

ఒక్కసారి తుపాకీని టిటూ వాళ్లమ్మ గుండెలకి గురిపెట్టి గుండుతో పేల్చెయ్యాలనిపించింది బంటీకి. ఎప్పుడు చూసినా ఇవే ప్రశ్నలేస్తుంది, మరి!

బంటీ లోపలకి పరిగెత్తుకు వెళ్లాడు.

టిటూ శన్నుతో కేరమ్స్ ఆడుతున్నాడు. బంటీ మెల్లగా వాడి వెనుకగా వెళ్లి వీపుకి తుపాకీ తుదిని ఆనించి హ్యాండ్స్ అప్ అన్నాడు గట్టిగా. టిటూ నిజంగా భయపడిపోయాడు. వాడి భయం చూసి బంటీ గట్టిగా నవ్వేశాడు.

''అరె! ఎంత పెద్ద తుపాకీయో! ఏదీ ఇలా ఇయ్యి చూద్దాం'' టిటూ ఉత్సాహంగా అడిగాడు.

''బయటకి పద, గుళ్లు పేలుద్దాం''

ఏమయినా సరే అంత సులభంగా వీడి చేతికి తుపాకీనివ్వకూడదు. ఆ రోజు కేరం బోర్డు తెచ్చినాడు ఎంత పోజుకొట్టాడు. నీకు ఆట రాదు, దూరంగా కూర్చుని చూడు అన్నాడు.

''ఏయ్ టిటూ, ఆట పూర్తి చేసి వెళ్లరా'' శన్నూ పిలిచింది.

టిటూ కాయిన్స్‌ని చెల్లాచెదురు చేసేసి, 'పోవే, నువ్వే ఆడుకో' అని బయటికి పరిగెత్తాడు.

''ఓడిపోయాడోడిపోయాడోచ్'' అంటూ శన్నూ గేలిచేస్తూ అరిచింది.

తుపాకీని ముగ్ధంగా చెయ్యేసి నిమురుతూ, ''సరిగ్గా చూపించరా'' అని అడిగాడు టిటూ.

''ఊరికే చూస్తే ఏమర్థమవుతుంది? ఇదేమన్నా అర్థరూపాయికొచ్చే డొక్కు తుపాకి అనుకుంటున్నావా?'' బంటీకి తనొక్కడే చాలా గొప్పవాడని అనిపించసాగింది.

''ఇప్పుడే కొన్నావా?''

''లేదు, మా నాన్న పంపించారు'' అని గర్వంగా చెప్పి తుపాకీలో గుళ్లని నింపసాగాడు.

'పోనీలే, మీ నాన్న మీతోబాటు ఇక్కడే వుండకపోయినా నీ కోసం కావల్సినన్ని బొమ్మలు పంపిస్తారు''

''అవునుమరి! ఈసారి మా నాన్న వచ్చేటప్పుడు మెకానో సెట్ తెస్తారు. మమ్మీ కూడా నేనేదడిగినా కాదనకుండా కొనిపెడుతుంది''

ఎంతసేపయినా తుపాకీ తన చేతికివ్వక పోడం చూసి విసుగెత్తిన టిటూ వాడిని కాస్త నొప్పించాలనే అడిగాడు.

''అది కాదురా బంటీ, మీ నాన్నతో వుండాలని నీకనిపించదురా?''

బంటీ మాట్లాడకుండా నుంచుండిపోయాడు.

''పోనీ ఈసారి ఆయనొచ్చినప్పుడు ఆ మాట చెప్పెయ్యకూడదా? అయినా ఇక మీద అదీ కుదరదేమోలే''

బంటీ ప్రశ్నార్థకంగా చూశాడు.

''మీ అమ్మకీ నాన్నకీ డైవోర్సయిపోయిందిట''

ఒద్దనుకుంటూనే బంటీ నోటివెంట ప్రశ్న బయటికొచ్చేసింది ''డైవోర్సా? అంటే ఏమిటి?''

''నీకు తెలీదా? నువ్వో మొద్దువి. అమ్మకి, నాన్నకి దెబ్బలాటయితే దాన్నే డైవోర్స్ అంటారు'' ''నీకెలా తెలును?''

''మా అమ్మా నాన్నా చెప్పుకుంటుంటే విన్నాను''

బంటీకి చాలా అవమానంగా అనిపించింది.

రంయ్, రంయ్‌మని తుపాకి గుళ్లన్నీ గాల్లో కొట్టసాగాడు. టిటూ తన తుపాకీని ముట్టుకునే అవకాశాన్ని ఇవ్వకుండా ఇంటికి పరుగెత్తుకొచ్చేశాడు.

బంటీ మనసు కోపంతో ఉడికిపోయింది. తన తల్లిదండ్రుల సంగతి తనకంటే ముందు టిటూకి తెలిసిందట! అమ్మ, నాన్న కలిసి వుండకపోతే మాత్రం ఏమంట? వాళ్లు మొద





ట్నుంచీ కలిసి లేనేలేరు. తను మొదట్నుంచీ అమ్మ దగ్గరే వున్నాడు. అమ్మ మిగతా వాళ్లందరిలాగా మామూలు మనిషేం కాదు. కాలేజి ప్రిన్సిపాల్! వెళ్తున్నా వస్తున్నా అందరూ ఆవిడకి నమస్కారాలు చేస్తారు. అదే టిటూ వాళ్లమ్మ వెళ్తుంటే ఎవరన్నా పట్టించుకుంటారా, నమస్కారాలు చేస్తారా?

నాన్న దగ్గిర వుండకపోతేనేం? తననెంత ముద్దు చేస్తారు! టిటూ వాళ్ల నాన్న ఎప్పుడూ కోప్పడుతూనే వుంటారు. ఒకరోజు తనముందే వాడి చెవినెలా పిండారో! మొహమంతా ఎర్రగా అయిపోయింది. అలాగే అవాలి వాడికి! వాళ్ల నాన్న దగ్గరే వుండాలి. ఆయన వీడ్ని తిట్టాలి! కొట్టాలి! చెవిపిండాలి.

కానీ అమ్మ ఎందుకిలా చేస్తుంది? నాన్న సంగతెందుకు చెప్పదు? ఎన్నోసార్లు నాన్న సంగతి అడగడానికి ప్రయత్నించాడు. కానీ ఆ సంగతెత్తగానే అమ్మ మొహం ఎలా అయిపోయేదో! అప్పుడు ఆవిడ మొహం చూడాలంటే బలే భయమేస్తుంది. ఆ తరువాత ఒక్క ప్రశ్న అడగడానికయినా నోరు పెగలదు.

ఈసారి నాన్నొచ్చినప్పుడు ఆయనకయినా చెప్పెయ్యాలి. నాన్న తనమాట తప్పకుండా వింటారు. తనడిగిన చోటికల్లా తీసికెళ్తారు. అడిగినదల్లా కొనిపెడతారు. అమ్మతో స్నేహంగా వుండండని తను చెప్తే తప్పకుండా ఒప్పుకుంటారు.

కానీ అమ్మ నాన్న ఎందుకు దెబ్బలాడుకున్నారు? మమ్మీ ఒక్కసారయినా నాన్న మాటెత్తదు. నాన్న వచ్చినప్పుడల్లా సర్క్యూట్‌హౌస్‌లోనే దిగుతారు. అమ్మ గురించి ఏమీ అడగరు, ఏమీ మాట్లాడరు. అసలిలా పెద్దాళ్లు కూడా దెబ్బలాడుకుంటారా? అమ్మకి అసలు నాన్న గుర్తుకే రాడా?

★ ★ ★

సాయంకాలం అమ్మ బయట పచ్చికలో మంచం వేసుకుని పడుకుంది. చల్లటి గాలేస్తోంది. హాయిగా వుంది బయట. అమ్మ గుండెలమీద పుస్తకం వుంది. కానీ ఆవిడ దృష్టి ఎక్కడో ఆకాశంలో వుంది. బంటీ ఉత్సాహంగా చెట్లకి నీళ్లు పోస్తున్నాడు. నైట్‌క్వీన్ సుగంధం చుట్టూ వ్యాపిస్తోంది మెల్లగా.

మొక్కలకి నీళ్ళు పోసిన తరువాత బంటీ ఒక పెద్ద బొండుమల్లె పువ్వుని కోశాడు. ఈ తోటలో పువ్వులు కోసే అధికారం వున్నది వాడొక్కడికే. ఈ తోట వాడిదే. వాడినడక్కుండా అమ్మ కూడా పువ్వులు ముట్టుకోదు.

ఆ పువ్వుని చేతిలో పట్టుకుని వాడు మెల్లగా వచ్చి పడుకున్న అమ్మ జడలో తురిమాడు. అమ్మ మధురంగా నవ్వింది. తరువాత వాడిని తన దగ్గరకి లాక్కుంది.

''అమ్మదొంగా! ఏంటి, అమ్మని తెగ ముద్దు చేస్తున్నావే! ఏం కథ?'' అంటూ లేచి కూర్చుని పువ్వుని సరిగ్గా అమర్చుకుంది.

అప్పుడు అమ్మ ఎంత ముద్దుగా కనపడింది! సాయంత్రం రోజూ ఇంతే. నిజమైన అమ్మలా వుంటుంది. చక్కగా జడ వేసుకుంటుంది. ముఖం మృదువుగా వుంటుంది. మిగతా సమయాల్లోకంటే ఈ సమయంలోనే ఎక్కువ అందంగా కనిపిస్తుంది. అమ్మ గడ్డంమీదుండే పుట్టుమచ్చంటే వాడికెంతో ఇష్టం. రాత్రి మమ్మీపక్కన పడుకుంటే వాడి చేతులెప్పుడు ఆ పుట్టుమచ్చమీదే వుంటాయి.

ఈ రాత్రి ఆ చుక్కతో ఆడుకుంటూ మెల్లగా నాన్న సంగతడగాలి. ఒక్కసారి బంటీకి పొద్దున్న జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. టిటూ ఆడుకుందుకు వచ్చాడు. వాడుండగా, వాడు చూడాలనే అమ్మ మెడపట్టుకుని ఉయ్యాలలూగాడు వీడు. అమ్మ తననెంత ముద్దు చేస్తుందో వాడికి తెలియాలి! వాడు గనుక వాళ్ళమ్మ మెడ పట్టుకుని ఇలా వేళ్ళాడితే ఆవిడ కసిరి దూరంగా నెట్టేస్తుందంతే. నాన్న దగ్గిర లేకపోతేనేం, అమ్మ తనను ఎంత ప్రేమగా చూసుకుంటుందో! టిటూ వాళ్ళమ్మ, నాన్న ఇద్దరూ కలిపినా అందులో సగం కూడా వాడిని ముద్దు చెయ్యరు. బంటీ మనసులో గర్వంతో కూడిన తృప్తి నిండిపోయింది.

''మమ్మీ! ఇవాళ రాత్రి చాలా పెద్ద కథ చెప్పాలి'' అన్నాడు వాడు.

అమ్మ కథ చెప్తోంది. ఏడుగురు అన్నదమ్ముల కథ. సవతితల్లి ఏడుగుర్ని చంపించి ఎలా పూడ్చిపెట్టిందో, ఆ పూడ్చిపెట్టిన చోట్లో

ఒక్కో సంపెంగ చెట్టు ఎలా పెరిగిందో...

"సవతితల్లి అంటే చాలా చెడ్డది కదమ్మా?"

"అవునుమరి, లేకపోతే వాళ్ళందర్నీ చంపించేదా?"

"వాళ్ళ నాన్నెందుకు వూరుకున్నాడు మరి?"

"ఆ సవతి తల్లి, తండ్రికి తెలీకుండా గుట్టుగా చేయించింది"

"పోమ్మా, అదెలా కుదురుతుంది! అన్నీ అబద్ధాలే. ఏడుగురు పిల్లలూ కనిపించ కుండా వుంటే తెలియకుండా ఎలా ఉంటుంది?"

"ఎందుకు జరగదు? ఆ తండ్రేమన్నా అందరిలా మామూలు మనిషా? ఒక దేశానికి రాజు. రాజ్యం చూసుకుందుకే టైము సరిపో దు. ఇవన్నీ ఎక్కడ తెలుస్తాయి? అదీకాక పిల్లల సంగతి చూసుకునేది తల్లేకదా!"

అమ్మ ఒక్కసారిగా మౌనం వహించింది. బంటి అటుకేసి చూశాడు. ఆవిడ యథాప్ర కారం ఆకాశంకేసి చూస్తోంది. ఆకాశంలోనో లేదా ఇంటి పైకప్పులోకో దీక్షగా దృష్టిపెట్టి ఆవిడేం చూస్తుందో! వాడెంత ప్రయత్నించినా వాడికేమీ కనుపించదుమరి. అవునూ... ఇప్పు డు నాన్నసంగతి అడిగితే...

"అమ్మా..."

"ఆఁ?"

బంటి తల్లివేపు చూశాడు. ఇందాకటిలాగే ఆవిడ దృష్టి ఆకాశంలోకి నాటుకుపోయింది. జుట్టు మొహంమీదకి చెదిరివుంది. అమ్మ ఎంత అందంగా వుందో. అకారణంగా తనెందుకు భయపడాలి? ధైర్యం తెచ్చుకున్నా డు బంటి!

"అమ్మా... అమ్మా..."

ఈసారి ఉలిక్కిపడి చూసింది అమ్మ. అప్పు డే వాడి మాట వింటున్నట్టుగా అంది

"పోరా బాబూ, నువ్వెప్పుడూ ఏదో వాదం పెట్టుకుంటావు. నేను నీకు కథ చెప్పను"

"అమ్మా... నాన్న మనతోబాటు ఎందుకు వుండరు?"

అమ్మ మౌనం...

"ఇవాళ టిటూ అంటున్నాడుగదమ్మా..."

అమ్మ కుతూహలంగా, ఆత్రంగా చూసింది.

"మరేం... మరేం... టిటూ అన్నాడు... మీ అమ్మకి నాన్నకి డైవోర్స్ అయింది. ఇక మీ నాన్న మీతో వుండరు... అని"

"బంటీ నువ్వూ, టిటూ ఎప్పుడూ ఇలాంటి మాటలే మాట్లాడుకుంటారా?"

అమ్మ గొంతులో వున్నది కోపమో, దుఃఖమో వాడికి అర్థంకాలేదు

"నేనెప్పుడూ ఇలాంటివి మాట్లాడను మమ్మీ. డైవోర్స్ అంటే ఏమిటో నాకు తెలీదు గదా! వాడే చెప్పాడు. వాళ్ళింట్లో వాళ్ళెప్పుడూ నాన్న సంగతి అడుగుతూనే వుంటారు"

అమ్మ గొంతు ఒక్కసారిగా నీరసపడింది. నిట్టూర్చింది.

"అడగనీలే. ఇలాంటి విషయాలు మాట్లాడ కపోతే వాళ్ళకెలా పొద్దుపోతుంది?" బంటీని దగ్గరకి లాక్కుని, "నాన్న లేకపోతేనేం నీతో నేనున్నాగా"

బంటీ ఇంకేమీ అడగలేకపోయాడు. అమ్మ ఎంత ముద్దుచేసినా వాడికి ఆవిడంటే భయమే. ఇవాళ ఎన్ని సంగతులడగాలని అనుకున్నాడు! కానీ రోజూలాగే ఇవాళ కూడా ఆ మాటలన్నీ మధ్యలోనే ఆగిపోయాయి.

"బాగా చలేస్తోంది, లోపలకి పోదాం పద" అంటూ లేచింది అమ్మ! బంటీ కూడా ఆవిడ వెనకాలే లోపలకి నడిచాడు.



శనివారం అమ్మ భోజనం చేశాక మళ్ళీ కాలేజీ కి వెళ్ళదు.




భోజనం అయ్యాక పడగ్గదిలో కిటికీ తెరల న్నీ వేసేసింది. గదిలో మసక చీకటి కమ్మింది. ఇంకా పెద్ద ఎండలు మొదలవనేలేదు. వేసవి కాలంలో అయితే అమ్మ కిటికీ అద్దాలన్నిటికీ రంగు కాగితాల్ని అంటించేస్తుంది. ఎండాకాలంలో ఆవిడకి వెలుగంటే బొత్తిగా పడదు.

గది చీకటిగా అయిపోతేచాలు, ఇంక పడుకోడమే. రాత్రి ఎలాగూ చీకటే. బంటీ రాత్రంతా పడుకునే వుంటాడు. వాడికి చీకటంటే కొంచెం భయమే. ఇప్పుడు పగలు కూడా గదిని చీకటి చేసేస్తే ఇంక అయినట్టే. కాని అమ్మ ఎవరి మాటన్నా వింటేకదా ''బంటీ, ఇంక పడుకుని నిద్రపో'' అని మంచంమీద పడుకోపెట్టెయ్యడమే.

అమ్మదగ్గర వాదించడం దండగని వాడికీ తెలుసు. అందుకే మమ్మీ కిటికీ తెరలు దింపుతుండగానే గప్‌చిప్‌గా మంచం ఎక్కి పడుకున్నాడు.

అమ్మ నిద్రలో మునిగిపోయింది. ఒక్క క్షణం బంటీ ఆవిడ ముఖాన్నే చూస్తూ వుండిపోయాడు. రెప్పలేం కదలటంలేదు. నిద్రపోతున్న అమ్మ ఎంత అందంగా కనిపిస్తోంది. అమ్మ ఒక్కోసారి ఒక్కోరకంగా ఎలా వుంటుందో! టిటూ వాళ్ళమ్మయినా, అత్తయ్యయినా ఎప్పుడూ ఒకలాగే వుంటారు.

బంటీ మెల్లగా మంచం దిగి చల్లగా గదిబయటకి జారుకున్నాడు. తరువాత పరుగెత్తి తోటలోకి వచ్చి నుంచున్నాడు. అదే సమయంలో గేటు తీసిన చప్పుడయింది. బంటీ వెనక్కి తిరిగి చూశాడు. వకీలు బాబాయి చెమటలు కారుస్తూ, ఆయాసపడుతూ, చేతికర్ర వూపుకుంటూ వస్తున్నారు. బంటీ పరుగున వెళ్ళి ఆయన్ని పట్టుకు వేళ్ళాడాడు.

''ఎప్పుడొచ్చారు బాబాయ్!''

''ఈ ఎండలో ఇక్కడ ఏం చేస్తున్నావు నువ్వు?''

''ఎండా? నాకేం ఎండని అనిపించటంలేదే?'' అని బంటీ అల్లరిగా నవ్వాడు.

''అంతేలే! ఎండెక్కడుంది? ఇది వెన్నెల కదా! అల్లరి పిల్లాడా!... శక్కూ ఇంట్లో వుందా? కాలేజికి వెళ్ళిందా?''

''శనివారం ఒంటిగంటకే కాలేజి అయిపోతుందిగదా! లోపల పడుకుంది. '' అని చెప్పి, ''అమ్మా. వకీలు బాబాయి వచ్చారు''అని అరుచుకుంటూ ఆయన్ని లోపలకి తీసుకెళ్ళాడు.

గాఢనిద్రలో వున్న అమ్మ లేచి కూర్చుంది. ఎదురుగా వకీలుగార్ని చూసి మొహమాటంగా చీర సవరించుకొని అడిగింది, ''ఎప్పుడొచ్చారు మీరు?''

''ఈ బంటీ ఇంత ఎండలో తోటలో ఆడుతున్నాడేం?''

''అమ్మ ఏదో అడుగుతోందిగదా, ముందు ఆ ప్రశ్నకి జవాబు చెప్పండి''

''అహహా! ఈమధ్య చాలా తెలివిమీరిపోయావే!''

బాబాయి టోపీ టేబుల్‌మీద పెట్టి ఫ్యాన్ కింద కూర్చున్నారు.

''ఈ వేళప్పుడు ఇక్కడికొచ్చానంటే సిటీ నుంచి ఇవాళే వచ్చానని అర్థమయిందిగా''

''ఏయ్ బంటీ! ఎండలో ఆడడానికి బయల్దేరావా? నిద్ర రాకపోతే చదువుకుంటూ కూర్చోకూడదూ! పరీక్షలు దగ్గరకొస్తున్నాయనలే. నాక్కాస్త నిద్ర పట్టిందంటేచాలు దాటుకుంటాడు పిల్లాడు'' అంది అమ్మ.

అమ్మకి కోపం వచ్చింది. అయినా బంటీ నవ్వుతూనే వున్నాడు. వకీలు బాబాయ్ కోటగోడలా అడ్డుకున్నంతవరకు అమ్మ కోపం తననేంచేస్తుంది.

''బాబాయ్, ఎండలో వచ్చి అలిసిపోయుంటారు. మీకు బాగా చెమట కూడా పోస్తోంది. చల్లగా ఏమన్నా తాగాలనుంటుంది కదా?! ఏం తెమ్మంటారు చెప్పండి'' అన్నాడు బంటీ.

బాబాయి బంటీవేపు ఆపేక్షగా చూశారు.

''ఫరవాలేదురా బాబూ, బాగానే మర్యాద చేస్తున్నావు! ఈ కొద్దిరోజుల్లోనూ ఎంత పెద్దాడివైపోయావురా! ఎంత బుద్ధిమంతుడివయ్యావూ!''

ఇప్పుడే వస్తానని చెప్పి అమ్మ లోపలకి వెళ్ళింది. మొహం కడుక్కుని, బాబాయికి

డ్రింకేమన్నా తెద్దామని వెళ్ళివుంటుంది.

బంటీ మెల్లగా బాబాయ్ దగ్గరకి జరిగి కూర్చున్నాడు.

''బాబాయ్‌గారూ, ఈసారి నాన్నెప్పుడొస్తారు?''

ఈ ప్రశ్న అడగడంలో నాన్న ఎప్పుడొస్తారు అన్న కుతూహలంతోబాటు, ఆయన తనకోసం ఏమన్నా పంపించి వుంటే అది తీసివ్వమన్న సంకేతం కూడా వుంది.

బాబాయి వాడి ముఖంవేపే దీక్షగా చూశారు. ఒత్తైన కనుబొమలకింద వున్న కళ్ళు కొద్దిగా చెమర్చాయి. చాలా ప్రేమగా వాడి వెన్ను నిమురుతూ

''నాన్న గుర్తొస్తుంటారా బుజ్జీ?'' అనడిగారు.

బంటీ మొహమాటంగా తల ఊపాడు.

బాబాయి నిట్టూర్చారు... ''నాన్న వస్తారుబాబూ, నేను వెళ్ళి ఆయన్ని పంపిస్తాను'' బాబాయి గొంతు క్షీణంగా పలికింది.

''ఈసారి వచ్చేముందు ఆయన్ని చూడ్డానికి వీలవలేదు. లేకపోతే నీకోసం ఏదన్నా తప్పకుండా పంపేవారు''

బాబాయి ఏమీ తీసుకురాలేదన్న సూచనతో బంటీ చిన్నబుచ్చుకున్నాడు. బాబాయే మళ్ళీ అడిగారు.

''నీకోసం తుపాకీ పంపించారుకదా, నీకు నచ్చిందా?''

''ఓ... చాలా నచ్చింది. మీరు దాన్ని చూశారా?'' మళ్ళీ ఉత్సాహం పుంజుకున్నాడు.

''అది కొనడానికి మేమిద్దరం కలిసేవెళ్ళాం'' అన్నారాయన.

గోడమీదున్న బొమ్మల్ని చూసి ''ఈ బొమ్మలన్నీ నువ్వేసినవేనా?''

వాడు వేసిన చిత్రాలన్నీ అమ్మ గోడమీద అతికించింది. మూడు చిత్రాలకి ఫ్రేమ్ కూడా కట్టించి తగిలించింది.

''అవును, నేను వేసినవే'' అన్నాడు బంటీ గర్వంగా. ''స్కూల్లో కూడా నేను వేసిన బొమ్మలు చాలా వున్నాయి. ఆర్ట్ క్లబ్‌కి నేనే చీఫ్‌ని''

''ఓ!'' బాబాయి మెచ్చుకోలుగా వాడి భుజం తట్టారు.

అంతలో అమ్మ చేతిలో ట్రేతో వచ్చింది. బాబాయికొక గ్లాసు అందించి, తనూ ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంది.

''నీ కొడుకు చాలా చురుకైనవాడు. ఈ వయసులోనే ఎంత చక్కగా చిత్రాలు గీస్తాడో చూడు!''

అమ్మ బంటీవేపు ముద్దుగా చూసింది. అమ్మ తనని పొగుడుతుందేమోనని ఎదురు చూశాడు బంటీ. కాని ఆవిడేం మాట్లాడలేదు.

ఎప్పుడూ తెగ కబుర్లు చెప్పే బాబాయి కూడా మౌనంగానే వున్నారు. మమ్మీ సరేసరి. బాబాయి ఎదురుగా ఎక్కువ మాటలే ఆడదు. గదిలో మసకచీకటొకటి! ఒక చిత్రమైన ఉదాసీనత పరచుకుందక్కడ. బాబాయేమో డ్రింక్‌ని ఒక్కొక్క గుటక మెల్లమెల్లగా మింగుతూ ఓసారి బంటీవేపు, మరోసారి కిటికీవేపూ చూస్తూ కూర్చున్నారు. కిటికీ తెరలు వేసేసివున్నాయికదా! అక్కడ చూడ్డానికి ఏముంటుందని! అమ్మ తదేకదీక్షగా నేలనే చూస్తోంది. బంటీ ఒకసారి బాబాయివంక మరోసారి అమ్మవంక చూస్తూ కూర్చున్నాడు.

చివరికి అమ్మే నోరువిప్పింది.

''పిన్నీ పిల్లలూ బాగున్నారా?''

''ఊఁ, అంతా బాగున్నారు. ఈసారి వేసవి శలవులకి నువ్వెక్కడకీ వెళ్ళటంలేదా?''

''లేదు. ఈసారి ఇక్కడే వుండదల్చుకున్నాను''

అమ్మ నాన్న సంగతులేమీ ఎందుకు అడగదో! దెబ్బలాటయితేమాత్రం! ఆయన యోగక్షేమాలు విచారించచ్చుగా!

''కలకత్తాలో ఈపాటికి ఎండలు మొదలై వుంటాయికదా! ఇక్కడ సాయంకాలాలు చల్లగానే వుంటోంది. రాత్రి చలి కూడా వేస్తోంది.

ఇద్దరూ ఏదో ఒకటి మాట్లాడుతున్నారుగాని ఆ స్తబ్దత దూరం కావటంలేదని బంటీకి కూడా అనిపిస్తోంది. అయినా ఇవాళ ఈ బాబాయికేమైంది. ప్రతిసారీ వచ్చినప్పట్నుంచి అమ్మతో ఏదో ఒకటి మాట్లాడుతూనే వుండేవారు. అమ్మ ఏదన్నా పనిబడి లోపలకెళ్తే బంటీతో మొదలెట్టేవారు. ఇంకా ఏమీ తోచకపోతే వాడి తెలివిని




పరీక్షించడం మొదలెట్టేవారు. ప్రశ్నలు, ఎక్కాలు, స్పెల్లింగులు... ఇలా ఏదో ఒకటి! ఒక్కక్షణమైనా ఆయన నోరు మూతపడేది కాదు. ఆయనలా ఆపకుండా మాట్లాడ్డం చూస్తుంటే బంటీకి అనిపించేది - 'ఈయనేగనుక ఒకవేళ మా క్లాసులో వుంటేనా! గో...విం...దా... రోజంతా బెంచీ ఎక్కాల్సిందే... నోటిమీద వేలేసుకోవాల్సిందే.

క్రితంసారి బంటీ ఈ మాట వాళ్ళమ్మతో అంటే ఆవిడ నవ్వేసి వాడి చెవి మెలేసింది.

''తుంటరివాడా! పెద్దవాళ్ళ గురించి ఇలాగేనా మాట్లాడ్డం?''

ఆ తరువాత చాలాసేపటి వరకూ నవ్వుతూనేవుంది. నోటిమీద వేలు వేసుకుని బెంచి ఎక్కి నుంచున్న బాబాయిని, గోడకుర్చీ వేసిన బాబాయిని ఊహించుకుని బంటీ కూడా పడి పడి నవ్వి అలిసిపోయాడు.

అలాంటి బాబాయి ఈరోజు ఇలా నిశ్శబ్దంగా వుండడం ఏమిటి? అంతేకాదు కొంచెం దిగులుగా కూడా వున్నారు.

''మీరిక్కడెన్నాళ్ళుంటారు?''

''ఎల్లుండి వెళ్ళిపోవాలి'' ... ఒకక్షణం ఆగి ఆయనన్నారు ''నీతో కొంచెం మాట్లాడాల్సింది వుంది. ఒకరోజు అవసరం అయితే ఆగి మాట్లాడే వెళ్దామని ముందే అనుకుని వచ్చాను''

అమ్మ దృష్టి బాబాయి మొహంలోకే సూటిగా కేంద్రీకరించి వుంది. అందులో వెయ్యి ప్రశ్నలు! ముఖం గంభీరంగా వుంది. బంటీకి భయంగా అనిపించింది.

మొదట్లో బంటీకి ఏమీ అర్థమయ్యేది కాదు. అర్థం చేసుకోవాలనే ఆసక్తి వుండేదికాదు. కాని ఇప్పుడిప్పుడర్థం అవుతోంది. ఇంకా తెలుసుకోవాలనే కుతూహలం కూడా పెరుగుతోంది. బాబాయి నాన్నని చూసే వస్తారని తెలుసు. ఈ రావడం కూడా నాన్న విషయాలు అమ్మతో మాట్లాడ్డానికే వస్తారనీ తెలుసు. కాని, వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకుంటారో వాడికి తెలియదు. వాడెప్పుడూ వాళ్ళేం మాట్లాడుకుంటారో వినలేదు. కాని ఈసారి వాళ్ళ మాటలు వినితీరాల్సిందే.

ఒక్క విషయం మాత్రం వాడికి స్పష్టంగా తెలుసును. బాబాయివచ్చి ఒకటి రెండు రోజులుండి వెళ్తే అమ్మ పది పదిహేను రోజులవరకూ అదోలా వుంటుంది. బంటీతో కూడా సరిగా మాట్లాడదు.

క్రితంసారి వచ్చినప్పుడు మాత్రం అమ్మ చాలా ఆనందంగా కనపడింది. బంటీని మాటిమాటికి దగ్గరకి తీసుకుని ముద్దులాడింది.

బంటీకి ఒక చిన్న అనుమానం. 'ఈ బాబాయి చేతికర్రలో ఏదన్నా మంత్రశక్తి వుందేమో!' అని. అందుకే ఆయన వచ్చి వెళ్తే చాలు అమ్మ అదోలా మారిపోతుంది. ఒకసారి రహస్యంగా ఆయన చేతికర్రని తీసుకుని తన ముందు తిప్పుకుని చూశాడు. అత్తయ్యే చుట్టూ తిప్పి చూశాడు. అయినా తనలోగాని, అత్తయ్యలోగాని ఏమార్పూ రాలేదు. అంటే మంత్రశక్తి ఆ కర్రలో లేదు. బాబాయి మాటల్లో వుండి వుంటుంది.

ఇవాళ ఆయనేం మాట్లాడతారో, మమ్మీ ఆ తరువాత సంతోషంగా వుంటుందో, మౌనంగా, గంభీరంగా వుంటుందో చూడాలి.

బంటీ అమ్మవేపు తిరిగి చూశాడు. ఆవిడ ఇందాకటిలాగే బాబాయి ముఖంలోకి సూటిగా చూస్తోంది. ఆ మొహంలో వంద ప్రశ్నలు. కాని బాబాయి ఏమీ మాట్లాడటం లేదు. ఆయనైనా ఏమన్నా మాట్లాడరాదూ! దృష్టితిప్పకుండా దీక్షగా చూడ్డానికి ఆ కిటికీ తెరలో ఏముందని?

''శకూ'' ఆఖరికి కష్టపడి అన్నట్టుగా అన్నారాయన గొంతు ఎక్కడో నూతిలోంచి వచ్చినట్టుగా ధ్వనించింది. అమ్మ రాతి బొమ్మలా కూర్చుంది.

''అంతా చట్టప్రకారం జరిగిపోవాలి అంటున్నాడమ్మా అతను.''

బాబాయి మాటకి అర్థం ఏమిటి? 'అతను' అంటే నాన్న విషయం.నాన్నకి సంబంధించినదే. కాని ఆ మాటకి అర్థం ఏమిటి?

''ఓ! అందుకేనా మిమ్మల్నిక్కడికి పంపించారు''

అమ్మ ముఖమేకాదు, మాటకూడా కఠినంగా మారిపోయింది. అదే... ప్రిన్సిపాల్‌గా వుండే అప్పుడు కనుపించే ఆ ముఖమే ఇది!

"లేదు, లేదు అతనేమీ నన్ను పంపలేదు. నేను ఏదో పనిబడి ఇటొస్తున్నానని చెప్తే, సరే, ఈ కబురూ చెప్పేసెయ్యి అన్నాడు. నేనిప్పుడు వచ్చే పనిలేకపోతే అతనే వచ్చి నీతో మాట్లాడే వాడేమో"

అంటే బాబాయి నాన్నని చూసే వచ్చారన్న మాట. ఇంతకు ముందేగా నాన్నని చూసిరావడానికి వీలవలేదని అన్నారు! ఇంత పెద్దాళ్ళయ్యుండి కూడా అబద్ధాలు చెప్పచ్చా?

ఈ కాస్త మాట్లాడి, చాలా అలిసిపోయిన ట్టుగా కుర్చీలో వెనక్కి వాలారాయన.

'ఇంతే?...!' మాటలయిపోయాయి. ఈ కాస్త చెప్పడానికి బాబాయి అంత దూరంనుంచి వచ్చారా?

"మీరు కొంచెం విశ్రాంతి తీసుకోండి.



రాత్రంతా ప్రయాణంచేసి వచ్చి బాగా అలిసిపోయింటారు. సాయంకాలం మాట్లాడుకుంటే సరి! ఎప్పుడూ వుండేదే, కొత్త విషయాలేం కావుగా!"

అనేసి బాబాయి జవాబు చెప్పేలోగా లేచి బీరువాలోంచి ఒక బెడ్‌షీట్ తీసి డ్రాయింగ్ రూమ్‌లో మంచం మీద పరచి, అమ్మ 'పదండి, పడుకోండి కాసేపు' అంది.

ఆయన ఇంకొక్క మాటకూడా మాట్లాడ కుండా లేచి వెళ్ళారు.

"నువ్వేం చేస్తున్నావు? మేం మాట్లాడుకునే వన్నీ వింటూ కూర్చున్నావా? ఇంత ఎండలో కూడా నీకు నిద్రన్నది రాదా?"

బంటీ మంచంమీద దొర్లుతూ అమ్మకేసి చూసి "బాబాయి ఏం చెప్పారు మమ్మీ?" అని అడిగాడు.

అమ్మ తీక్షణంగా చూసింది. భయంవేసి వాడు కళ్ళు గట్టిగా మూసేసుకున్నాడు. అయినా తల్లిచూపు గుచ్చుకున్నట్టే అనిపించ సాగింది. తరువాత అమ్మ వచ్చి పక్కనే పడు కున్న సంగతీ తెలిసింది.

బాబాయి చెప్పినమాట అంత చెడ్డదా!? అని ఆలోచించసాగాడు వాడు. ఉన్నట్టుండి అమ్మ చేతివేళ్ళు వాడి జుట్టులో కదలసా గాయి. ఆ వేళ్ళద్వారా అమ్మ ఆప్యాయత వాడి నరనరాల్లోనూ ప్రవహించింది. కొద్దిసేపటి క్రితం వాడిలో వ్యాపించిన భయం దూర మైంది.

బంటీ మెల్లగా కళ్ళు తెరిచాడు. అమ్మ ఎప్పటిలాగే ఇంటి పైకప్పువేపు దీక్షగా చూ స్తోంది. అప్పటికే కళ్ళనుంచి నీళ్ళు ప్రవ హించి చెంపల్ని చెవుల్ని తడిపాయి. అమ్మ కంట్లో నీళ్ళా!? అమ్మ విసుగ్గా వుండటం, దిగులుగా వుండటం చూశాడు. కోపంగా మందలించడమూ చూశాడు. కాని ఇలా ఏడ వడం ఎప్పుడూ చూడలేదు.

బాబాయి తప్పకుండా ఏదో చెడ్డవార్తే చెప్పి వుండాలి. బాబాయంటే ఒళ్ళు మండిపో యింది వాడికి. మొదటిసారిగా ఏమీ తేకుండా వుట్టిచేతుల్తో వచ్చారు. తరువాత అబద్ధాలు చెప్పారు. అవన్నీ నరే అనుకుంటే, ఇప్పుడు అమ్మకేవో చెడ్డ విషయాలు చెప్పి ఏడిపిస్తున్నా రు.

అమ్మ చాలా దుఃఖంలో వుంది. ఏం చేసైనా సరే, ఆవిడ దుఃఖాన్ని దూరం చెయ్యాలి. తనకి అన్ని సంగతులూ వివరంగా చెబితే తనేమయినా చెయ్యొచ్చు మరి. లేకపోతే తనే ఎలాగో అలా ప్రయత్నించి కారణం తెలుసుకో వాలి. తల్లి దుఃఖాన్ని పోగొట్టడానికి రాజకుమా రుడెన్నెన్ని సాహసాలు చేశాడూ!

అమ్మకి మరికాస్త దగ్గరగా జరిగి పడుకున్నా డు. తన బుల్లి చేతుల్ని ఆవిడ మెడచుట్టూ వేసి ముద్దుగా అడిగాడు. "అమ్మా నాకూ చెప్పు అమ్మా! బాబాయి ఏం చెప్పారు?"

"నువ్వు పడుకుంటావా లేదా బంటీ" అమ్మ గట్టిగా కోప్పడింది. బంటీ కళ్ళు మూసు కుని పడుకున్నాడు.

ఎండ తగ్గుముఖం పట్టింది. అమ్మ, బాబాయి లాన్‌లో కూర్చున్నారు. నిద్రలేచినప్ప ట్నుంచి బంటీ వాళ్ళ చుట్టుప్రక్కలే తిరుగు తున్నాడు. ఇవాళేమయినా నరే అన్ని విషయా లు తెలుసుకోవల్సిందేనన్న పట్టుదల వచ్చింది వాడికి. కాని బాబాయి ఇప్పుడా సంగతులేమీ మాట్లాడటంలేదు. వాడి స్కూలు గురించీ, ప్రపంచంలోని మిగతా ఏవేవో విష యాల గురించీ మాట్లాడుతున్నారేతప్ప, ఆయన ఏం మాట్లాడ్డానికి వచ్చారో ఆ విషయం మాత్రం మాట్లాడటంలేదు. బహుశా బంటీ అక్కడే వున్నాడన్న కారణం వల్ల కావ చ్చు. రాత్రి కళ్ళు మూసుకుని నిద్రపోతున్నట్టు నటించి అయినా నరే, ఇవాళ వాళ్ళ మాటలు వినిపించుకోవలసిందే.

"బంటీ సాయంత్రం నువ్వు ఆడుకుందుకి ఎక్కడికీ వెళ్ళవా? నీకేమేం ఆటలిష్టం?"

ఇదొక నెపం. ఇక్కడ్నుంచి అవతలికి ఫో! అని సూటిగా ఎందుకు చెప్పకూడదు? పోన్లే నేనిక్కడ్నుంచి వెళ్ళిపోతాను. నాకేమన్నా చె ప్పడం వీళ్ళకిష్టం లేనప్పుడింక ఎందుకు? అమ్మ కూడా తనెప్పుడు అవతలకి పోతానా అనే ఎదురుచూస్తున్నట్టుందే అనిపించింది వాడికి.

బంటీ బాబాయి మాటలకి జవాబయినా చెప్పకుండా లోపలకి వచ్చేశాడు. కాని వాడి మనను మాత్రం అక్కడేవుంది. ఎలాగైనా వాళ్ళ మాటలు వినాల్సిందే. గోరింటాకు చెట్టు పక్కనుంచి పిల్లిలా నక్కినక్కి మళ్ళీ అక్కడికి వచ్చాడు. బాబాయి కూర్చున్న కుర్చీ వెనుకగా వున్న పొదచాటున ముడుచుక్కూర్చున్నాడు. అమ్మో, బాబాయి తనని చూసేస్తే!. అన్న భయం వెయ్యకపోలేదు. కాని ఏం చెయ్యగల డు! ఆ మాటలు వింటే తప్ప అమ్మ దుఃఖాన్ని




దూరం చెయ్యడానికి కుదరదు!

అమ్మ ఏదో మాట్లాడుతున్నట్టయింది. అబ్బ! ఎంతమెల్లగా మాట్లాడుతోంది బాబూ! ఒక్కమాట కూడా వినపడ్డంలేదు.

"శక్కూ..." బాబాయి మాటలు స్పష్టంగానే వినపడుతున్నాయి. కాని ఈయన పూర్తిగా మాట్లాడకుండా మధ్యలో ఆపేస్తారెందుకని?"

"శక్కూ జీవితంలో కేవలం ఇష్టపడ్డంత మాత్రాన ఏమీ జరగదు..." అంటూనే ఆయనా గొంతు తగ్గించేశారు. సరిగ్గా ఏమీ వినపడటం లేదు. మాటిమాటికీ జీవితం... జీవితం...అంటారేమిటో... నాన్న మాటేమీ ఎత్తడం లేదు.

బంటీ ఇంకొంచెం ముందుకి జరిగాడు. ఈసారి అమ్మ మాట్లాడుతున్నట్టుంది. ఫరవాలేదు, అమ్మ మాట్లాడేది ఈసారి సరిగ్గా వినిపిస్తోంది. "ఆవిడ గురించిన ప్రశ్నే లేదు బాబాయ్. ఇదివరకూలేదు, ఇప్పుడూ లేదు"

మధ్యమధ్యలో ఏమిటేమిటో మాట్లాడేస్తారు. ఏమీ అర్థంకాదు. టిటూని తోడు తీసుకొచ్చినా బాగుండేదేమో! వాడికన్నీ అర్థం కావచ్చు. కాని అది మంచి పని కాదు. మనింటి విషయాలు మిగతా వాళ్ళకెందుకు తెలియాలి.

"మీరాతో అతను చాలా సుఖంగానే వున్నాడు. నీకు తెలును కదా! షి యీజ్..."

మధ్యలో ఇంకెవరెవరి సంగతులో దూర్చేస్తారు. ఈ బాబాయికి తిన్నగా మాటాడడంరాదా?

అంతలో అమ్మగొంతు వినిపించింది. ఆవిడ ఏం మాట్లాడిందో అర్థంకాకపోయినా గొంతు తీవ్రంగా వుందని తెలిసింది. అంతే ఆవిడ ముఖం కూడా కఠినంగా వుండే వుంటుంది. ఒకసారి ఆవిడ ముఖాన్ని చూద్దామా అనిపించింది వాడికి.

బాబాయి చెప్తున్నారు...

"అజయ్ సంతకం పెట్టిచ్చాడు. రేపు నువ్వూ సంతకం చేసిచ్చేసెయ్యి. నేను దాన్ని కోర్టుకిచ్చేసి, వీలైనంత త్వరగా ఒక తారీఖుని నిర్ణయించమని చెబుతాను"

తరువాతింకేమాటలూ వినపడలేదు. ఇద్దరూ మూగవాళ్ళలా కూర్చున్నారు. అక్కడ్నుంచీ వెళ్ళిపోదాం అనిపించింది బంటీకి.

"ఏం చెయ్యాలో తోచకుండా వుంది. ఒక సారి ఏద్రైనా చిక్కుపడడం మొదలైతే జీవిత మంతా చిక్కుచిక్కుగా అయిపోతుందేమో..." మాట్లాడుతూ మాట్లాడుతూ చేతులు వెనక్కి చాచిన బాబాయిచేతికి బంటీ తలకాయి ఠక్కున తగిలింది. వెనుకగా కూర్చున్న బంటీ ఒక్కసారిగా తత్తరపడ్డాడు.

"అరే... ఇదేమిటి? బంటీ! నువ్విక్కడేం చేస్తున్నావు?"

బంటీ ముఖం ఒక్కసారిగా పాలిపోయింది.

"చాటుగా కూర్చుని మా మాటలు వింటున్నావా ఏమిటి?"

బంటీ తల వంచుకున్నాడు. అమ్మ కోపంగా చూస్తోంది వుంటుంది. కళ్ళెత్తి ఆవిడవేపు చూడ్డానిక్కూడా వాడికి ధైర్యం చాల్లేదు. కాని అమ్మ అలా అంటోందేమిటి?

"పోనీలే బాబాయ్, మంచిదే... వాడూ అన్ని విషయాలూ తెలుసుకోడమే మంచిది. ఈమధ్య వాడూ ఈ విషయాల గురించే ఆలోచిస్తున్నాడు కాబోలు..."

బంటీ కొంచెం తేరుకున్నాడు. ఈ మాటల్తో ప్రాణం లేచొచ్చింది. వెళ్ళి అమ్మ మెడచుట్టూ చేతులేసి వాటేసుకోవాలనిపించింది.

"తెలుసుకోకూడదని ఎవరంటారు? కాని సరి అయిన పద్ధతిలో తెలుసుకోవాలి. ఇలా చాటుమాటుగా వినడమా!"

తరువాత వీలైనంత సౌమ్యంగా అన్నారు బాబాయి. "వెళ్ళి ఆడుకో. మంచి పిల్లలు అలా పెద్దవాళ్ళ చుట్టూ తిరుగుతూ కాలక్షేపం చెయ్యకూడదు. నువ్వెంత బుద్ధిమంతుడివి! క్లాసులో ఎంత చక్కటి మార్కులొస్తాయి! బొమ్మలెంత బాగా వేస్తావు..."

బంటీ అమ్మవేపు చూశాడు. ఆవిడ పిలిచి దగ్గర కూర్చోబెట్టుకుంటుందని ఎదురు చూశాడు.

"వెళ్ళి కాసేపు టిటూతో ఆడుకో బంటీ" అని ఆదేశించింది అమ్మ.

బంటీ అవమానం పొందినవాడిలా అక్కడ్నుంచి పారిపోయాడు.

★ ★ ★

ఎన్నో సంవత్సరాలనుంచి కాలం స్తంభించిపోయినట్లుగా అనిపించింది శకుంతలకి. గడియారం ముళ్లు ముందుముందుకి కదుల్తున్నాయి. ప్రతిరోజూ ఇంటి వెనుకనుంచి సూర్యోదయమై పెరటిమార్గాన ఇంటిలోకి వ్యాపించే ఎండ ఇంటిలో వెలుగు నింపి, మధ్యాహ్నం లాన్‌లోకి విస్తరించి, విశ్రమించి, సాయంత్రానికి పర్వతాల చాటున మాయమవుతుంది.

అయినా ఆమెకి కాలం కదలకుండా గడ్డకట్టినట్టుంది. ఈ ఘనీభవించిన ఎండ కరిగే సూచనలేమీ కనపడ్డంలేదు. కరిగిపోతున్నదల్లా ఆమే.

సుదీర్ఘమైన శలవులొస్తే ఇదో బాధ. కాలం గడవడమే ఒక సమస్య. కాలేజీ రోజుల్లోనయితే కాలేజికి సంబంధించిన అనేక సమస్యలని పరిష్కరించడంలో ఆమె మనసు నిమగ్నమై వుంటుంది. పొద్దుపోదనే బెంగ ఎప్పుడూ వుండదు. లేకపోతే ఆమె బతుకులో సంతోషాన్నిచ్చే విషయాలేమున్నాయి గనుక! బంటీ ఒకడుండబట్టి జీవితంలో కాస్తైనా ఆసక్తి మిగిలింది. కాని వాడేదయినా ఒక విషయంమీద మొండికెత్తినా, లేదా వాడి వయసుకి మించిన ప్రశ్నలడిగినా ఆమె ఆసక్తికాస్తా అశాంతిగా మారిపోతుంది.

క్రితంరోజు బాబాయి ఆమెకొక సూచన చేశారు. అదే సంగతినారోజు ఆమెతో మాట్లాడ్డానికి రాబోతున్నారు. అదే ఆమె మనసుని కలవరపరుస్తోంది. అలాగని అదేమీ కొత్త సంగతి కాదు... ఒక గతించిన కథని తిరిగి స్మరించుకోవడం మాత్రమే. అయినా... అయినా దాన్ని సహజంగా స్వీకరించడం ఆమెకి కష్టంగా వుంది.

వకీలు బాబాయి వచ్చినపుడల్లా ఆమె మనసిలాగే కలవరపడుతుంది. బయటికి చూడ్డానికి ఆమెలో అంతగా మార్పేమీ కనపడదు. కాని లోపలమాత్రం పెనుగాలులు చెలరేగుతూ వుంటాయి.

తన భర్త అజయ్ మరో స్త్రీతో సంబంధం పెట్టుకున్న సంగతీ, ఆమెతో సంసారం పెట్టాడన్న సంగతీ విన్నప్పుడు ఆమె మనసు ఉద్విగ్నమయింది. ఒకరకమైన ఒంటరిభావన ఉదయించి, తననెవరో ఘోరావమానం చేసినట్టనిపించింది.

ఏడాదిక్రితమే బాబాయి ఈ సంగతి అన్నారు. తనకు ఏం చెప్పాలో తెలియడంలేదని...! బంటీ విషయంలోమటుకు ఆయన మనసులో ఎంతో ఆపేక్ష వుందన్నారాయన.

ఇది విన్నప్పుడు శకుంతల మనసులో ఒక క్రూరమైన సంతోషం కలిగింది. దానితోబాటు అస్పష్టంగా ఒక ఆశాకిరణం కూడా కనిపించింది. ఎవరికి తెలుసు, బంటీవల్లే మళ్ళీ తామిద్దరూ...

బాబాయి బంటీకోసం ఆటబొమ్మల్ని తెచ్చి ఇచ్చినప్పుడల్లా అజయ్ ఆ బొమ్మల్ని కేవలం బంటీకోసం మాత్రమేకాదు, ఆ నెపంతో తనకే పంపించాడని అనిపించేది. తరువాత ఒకసారి అజయ్ తనే స్వయంగా వచ్చాడు. ఎప్పటిలాగే మరెక్కడో బస చేశాడు. తనని కలుసుకోనేలేదు. అయినా అతను తన సాంగత్యంలోనే వున్నట్టు ఊహించుకునేది. ఆరోజు బంటీ అజయ్‌ని చూసి వచ్చాక ఎంతోసేపు వాడినే ముద్దులాడుతూ, వాడి జుట్టు సవరిస్తూ వుండిపోయింది. బంటీ తనతోపాటు వాళ్ళ నాన్నని కూడా తీసుకొచ్చినట్టనిపించిందామెకి.

రానురాను ఈ భ్రమ కూడా దూరమైంది. ఇక భర్తపట్ల ఆశ పెట్టుకోడం వ్యర్థం అని తెలిసిపోయింది. తరువాత తన పాలిటికి అన్నీ ముగిసినట్టే అని అర్థమయింది. ఆరోజు నుంచీ ఆమెకి కాలం ఘనీభవించినట్లయిపోయింది.

క్రితంరోజు బాబాయి, "ఇంకేమీ ఆశ మిగల్లేదమ్మా" అన్నారు.

ఆ మాటన్నప్పుడు శకుంతలకి అనిపించింది - ఇంకేమీ ఆశ లేదని అర్థమై చాలారోజులయిపోయింది అని. అజయ్‌తో సంసారం చెయ్యడానికి ఇప్పుడు ఆమె మనసు కూడా సిద్ధంగా లేదు. అసలు తామిద్దరూ ఏనాడూ కూడా నిజమైన ప్రేమతో మెలగనేలేదేమోనని ఆమెకి అనిపించింది.

కలిసి వున్నప్పుడు కూడా తామేం సుఖంగా లేరు. రోజురోజుకీ ఇద్దరిమధ్యా అగాధం పెద్దదవుతూ వచ్చింది. దాన్ని నింపడానికి బంటీ




కూడా చాలలేదు.

విడివిడిగా వున్నా వాళ్ళిద్దరి మధ్య ఈ ప్రచ్ఛన్న యుద్ధం జరుగుతూనేవుంది.

ఈ ఏడు సంవత్సరాల్లోనూ శకుంతలకి ప్రిన్సిపాల్‌గా ప్రమోషన్ వచ్చింది. తను గొప్ప వ్యక్తి కావాలనే కోరికకన్నా అజయ్‌స్థానం తక్కువ అని నిరూపించాలన్నదే ఆమె ధ్యేయం అన్నట్టుండేది అప్పట్లో. ఒక అదృశ్యమైన, అస్పష్టమైన పోటీ ఎప్పుడూ ఆమె కళ్ళముందు కదుల్తూ వుండేది. పోరాడుతూనే అభివృద్ధి సాధిస్తున్నాననుకునేది.

ఇంత జరిగినా ఎదుటి వ్యక్తి లొంగటంలేదంటే తన సాధనంతా నిరర్ధకమేనని ఆమెకి అనిపించేది.

నిన్న మొట్టమొదటిసారిగా ఆమెకి అనిపించింది - ఇన్నేళ్ళూ తన దృష్టిని, ధ్యేయాన్ని అజయ్‌మీద వుంచుకుని తనింత సాధించేబదులు, తనపైనే దృష్టి వుంచుకుని తన అభివృద్ధే తన గురిగా అనుకుని ఇదంతా సాధించి వుంటే ఈ యాతనంతా వుండేది కాదేమో. తన సాధనపట్ల తనకి కాస్త గర్వమేనా మిగిలివుండేదేమో.

టేబుల్‌మధ్య సంతకం చేసిన కాగితం, అటుపక్క బాబాయి, ఇటుపక్క శకుంతల కూర్చుని ఉన్నారు.

ఎన్నాళ్ళ తరువాతనో శకుంతల అజయ్ చేతివ్రాతని చూస్తోంది. దాన్ని చూస్తుంటే ఆమె మనసులో 'ఇదీ' అని చెప్పలేని విచిత్ర భావనొకటి తలెత్తింది.

అంతం కావల్సివున్న ఒక అధ్యాయం పూర్తయిపోయింది. పదేళ్ళ ఆ వైవాహిక జీవితం ఒక చీకటి సొరంగంలో ప్రయాణించిన అనుభవంలాంటిది. ఇప్పుడొక్కసారిగా ఆ సొరంగపు తుదికి వచ్చినట్టుంది. ఇక మళ్ళీ యాత్ర ప్రారంభించాలి. మళ్ళీ అదే ఒంటరితనం మరోరకం చీకటి.

ఆ కాగితం శకుంతలకీ బాబాయికి మధ్యన బృహదాకారం దాల్చిన లోయలా భయంకరంగా వుంది. బాబాయి తన స్వభావానికి విరుద్ధంగా మౌనంగా వున్నారు.

వారిద్దరిమధ్య అసహజంగా పరుచుకున్న ఈ నిశ్శబ్దం పరిస్థితిని మరింత జటిలం చేసింది. శకుంతల కాగితం చేతికి తీసుకుని మడిచి బాబాయి చేతికిస్తూ

"తీసుకోండి... ఎందుకలా బాధపడతారు?" అంది. మాట్లాడాక తనపట్ల తనే ఆశ్చర్యపోయింది. ఇలాంటి స్థితిలోకూడా ఇంత యథాలాపంగా వుండగలిగే సామర్ధ్యం తనలో వుందా?

ఎంతోసేపట్నుంచి ఊపిరి కూడా తీసుకోలేదేమో అనిపించేలా బాబాయి దీర్ఘంగా నిట్టూర్చారు.

"ఈ పని నేనే చెయ్యాల్సొచ్చిందే అని. అంతా భార్యాభర్తల్ని కలుపుతారు. నేను విడదీయాల్సొచ్చింది. నువ్వు నాగురించి ఏమనుకుంటున్నావో ఏమో"

ఆయన స్వరంలోని వ్యథ శకుంతలకి దేహంనిండా వ్యాపించినట్లయింది. ఏమన్నా మాట్లాడి ఆయన్ని ఓదార్చాలనిపించింది.

"నీదగ్గర ఏవేవో చాలా చెప్పాలనుకుని వచ్చానిక్కడికి. కాని ఏం చెప్పాలో తోచడంలేదు..."

ఆయన గొంతు గద్గదమయింది. సూటిగా, సహజంగా మనస్సు లోపల్నుంచి వచ్చిన ఈ మాటలు కేవలం మర్యాదకోసం కాదని ఆమెకీ స్పష్టంగా తెలుసు.

"మీరెందుకింత బాధపడతారు?! ఇదేం కొత్తసంగతి కాదుకదా, జరిగిపోయినదానికి చట్టబద్ధమైన రూపాన్నిచ్చినట్లయిందంతే"

ఈ మాటలు చెబుతూ శకుంతల అనుకుంది, 'దేవుడా ఇలాగే నా మనసుని నేనూ సమాధానపరచుకోగలిగితే ఎంత బాగుంటుంది?' అని.

ఇద్దరిమధ్యా మౌనం నెలకొంది. చుట్టూ వాతావరణం స్తబ్ధమైపోయింది. దగ్గరే మంచంమీద పడుకున్న బంటీ అటు, ఇటు దొర్లడం మాత్రం వినిపిస్తూంది.

మళ్ళీ బాబాయి ఏ ఉపోద్ఘాతమూ లేకుండానే నేరుగా ప్రారంభించారు.

"నేను నిన్న చెప్పిన సంగతులు విని నీకు బాధ కలిగి వుండొచ్చు. రాత్రంతా నేను ఆ

విషయమే ఆలోచించాను. నువ్వు బంటీని హాస్టల్లో చేర్పడమే మంచిదనిపిస్తోంది''

శకుంతల మనసు సంశయించింది. బంటీని హాస్టల్లో పెట్టాలనే ఆలోచన బాబాయిది కాదు. ఆయన దాన్ని కలకత్తానుంచి తలలో నింపుకుని వచ్చారని ఆమెకి తెలుసు. అది సలహారూపంలోవున్న ఆజ్ఞ అనీ ఆమెకి తెలుసు. అందుకే ఆమె కటువుగా మారిపోయింది.

''ఈ ఏడేళ్లూ నేను ఒంటరిగానే బంటీని పెంచాను. వాడి ఇష్టాయిష్టాలు, కష్టసుఖాలు నాకంటే బయటివాళ్లకి తెలుస్తుందని అనుకోను''

''అంటే నన్నూ బయటివాళ్ల కోవకి కట్టేశావన్న మాట. నేను అజయ్‌కి స్నేహితుడిని, కలకత్తా వాసిని అన్నమాట నిజమే. కాని నువ్వన్నా నాకెంతో ప్రేమాభిమానాలున్నాయి. నేను మీ ఇద్దరి విషయంలో ఎవరిపట్లా పక్షపాతం చూపనన్న విషయం నీకు బాగా తెలుసు''

ఒక్కక్షణం శకుంతలకి సిగ్గుగా అనిపించింది. ''అహఁ, నా అభిప్రాయం అలా అని కాదు...'' అంటూ నసిగింది.

''పోన్లే... అదలావుంచు. కానీ అజయ్ మాత్రమే అలా అనుకుంటున్నాడనుకోకు. నాక్కూడా అలాగే అనిపిస్తోంది. బంటీని హాస్టల్‌కి పంపించడమే మంచిది.''

శకుంతల మౌనం దాల్చింది.

**''నేను సూటిగా స్పష్టంగా మాట్లాడతాననే** సంగతి నీకు తెలుసు. నువ్వే ఆలోచించు, స్కూలు నుంచి రాగానే బంటీ పూర్తిగా నీతోనే ఉంటాడు. లేకపోతే ఆ అత్తయ్యతో వుంటాడు. మీ ఇంటికి వచ్చేపోయే వాళ్లెవరన్నా వుంటే వాళ్లూ ఆడవాళ్లే. బంటీకి తగిన తోడెవరున్నారు. ఇకవున్నదల్లా ఇరుగుపొరుగునుండే ఒకరిద్దరు కుర్రాళ్లు. వాడు మగపిల్లల సహవాసంలో వుండాలి. హి షుడ్ గ్రో లైక్ ఎ బాయ్, లైక్ ఎ మ్యాన్''

శకుంతల బాబాయి ముఖాన్నే చూస్తూ కూర్చుంది. ఇందులో బాబాయి స్వంత మాటలెన్ని, కలకత్తానుంచి తీసుకొచ్చినవెన్ని అని పరీక్షిస్తున్నట్టుంది.

ఉన్నట్టుండి అజయ్‌కి బంటీని హాస్టల్లో చేర్చాలనే ఆలోచన ఎందుకొచ్చినట్టు! ఇందులో విచిత్రమైన ఉద్దేశ్యమేదో కనిపించింది. అజయ్ ముందు తనే దూరమయ్యాడు. ఇప్పుడు బహుశా బంటీని కూడా ఆమెనుంచి దూరం చెయ్యాలని పథకం వేస్తున్నాడు కాబోలు. ఆమె రక్తంలో చేదు నిండినట్టయింది.

''నేను చెప్తున్నది అబద్ధమంటావా? నువ్వే చెప్పు. ఇప్పుడు వాడు నిన్నంటి పెట్టుకునే తిరుగుతూ వుంటాడనుకో అది నార్మల్ అంటావా? వాడిప్పుడు వాడి వయసు పిల్లలతో వుండాలి, తిరగాలి. ఈ ఇంట్లో అది జరిగే పనేనా? వాడు పెరుగుతున్న పద్ధతి సరిఅయినదేనని నీకనిపిస్తోందా?'' ఆమె జవాబు చెప్పి తీరాలన్నట్టుగా మౌనంగా చూస్తూ నుంచున్నాడాయన.

''నా చేతనైనంత వరకూ వాడిని సరిగ్గానే పెంచుతున్నాను. కాలేజి సమయం తప్పిస్తే, మిగిలిన సమయం అంతా వాడితోనే గడుపుతున్నాను. ఇంకేం చెయ్యమంటారో చెప్పండి''

''... నువ్వు వాడిని సరిగ్గా పెంచట్లేదని అనటం లేదు నేను. నువ్వు వాడికి చేస్తున్న సేవలు ఎక్కువే! కానీ ఎన్ని చెప్పినా నువ్వు వాడితోటి పిల్లలిచ్చే వాతావరణాన్నివ్వలేవు కదా!''

మాటలాపి ఆయన శకుంతల ముఖాన్నే చూస్తూ నుంచున్నారు. తనసలు జవాబే చెప్పకూడదు. ఆయన చెప్పేదంతా చెప్పనీ, తను మౌనంగా వుంటేసరి. ఏం మాట్లాడతారో చూద్దాం. ఈయన సలహాలన్నీ పాటించి తీరాలన్న బలవంతమేముంది? బంటీ గురించి నిర్ణయాన్ని తీసుకునే హక్కు తనొక్కతెదే అనుకుందామె, ఓ క్షణం పాటు.

''ఏమంటావు?''

''బంటీని హాస్టల్లో చేర్పెయ్యి అని మీరు సులువుగా చెప్పేశారు. వాడినక్కడ చేరిస్తే నేనేమవుతానో మీరేమన్నా ఆలోచించారా?''

ఉన్నట్టుండి ఆమె గొంతు జీరపోయింది.




# ఏరిన ముత్యాలు

★ మూర్ఖులవల్ల వివేకులకు లాభమే. మూర్ఖులు చేసే తప్పులు తాముచేయకుండా వారు జాగ్రత్తపడతారు.

— మార్కస్‌కీటో

★ పరమమూర్ఖుడు కూడా మౌనముద్ర వహించినప్పుడు మహాజ్ఞానివలె భావిస్తాడు.

— ఓల్డ్‌టెస్ట్‌మెంట్

★ మూర్ఖుడు పిలవకముందే లోపలికి వస్తాడు. అవసరం లేనిదే మాట్లాడతాడు. విశ్వసించకూడని విషయాన్ని విశ్వసిస్తాడు.

— మహాభారతం

★ ప్రపంచంలో ఏ మూలనైనాసరే పేదరికం, లేమి ఉన్నంతకాలం ఈ ప్రపంచం ఆరోగ్యవంతమైనది కాదు.

— నెహ్రూ

★ అన్నమో రామచంద్రా- అనేవారిపైనే విరుచుకు పడతారు. మేకల్ని బలిఇస్తారు. కాని సింహాల్నిపులుల్ని ఇవ్వలేరుగా!

— అంబేద్కర్

★ ఉదారబుద్ధుల్ని కృంగదీసి, కృషిని నిర్వీర్యం చేసి దృఢనిర్ణయాన్ని నిస్పృహగా మార్చేది పేదరికం.

— ఎడిసన్

★ తక్కువ ఉన్నవాడు పేదవాడుకాదు. ఎక్కువకోరుకొనేవాడు పేదవాడు.

— బైబిల్

★ దారిద్ర్య రక్కసి పాదాల కింద అణగారిపోయిన వారి నైపుణ్యాలు అంత సునాయాసంగా సముజ్వలించవు.

— జువెనల్

★ మనిషి మాటలు కావు- అతని నడవడే అతని నిజాయితీకి కొలబద్ద.

— జూనియస్

★ దరిద్రం ద్వారం నుండి ప్రవేశిస్తే ప్రేమ కిటికీ నుండి పారిపోతుంది.

— ఆంగ్ల సామెత

★ నువ్వేదైనా పొందాలనుకున్నప్పుడు ఇవ్వడం కూడా నేర్చుకో.

★ దుఃఖం ఒకరు పంపితే మీవద్దకు వచ్చేదికాదు, మీరే స్వయంగా ఆహ్వానిస్తారు.

— వివేకానంద

★ దుఃఖం అనే కిరీటాన్ని ధరించి సుఖం మనిషి ఎదుట ప్రత్యక్షమవుతుంది. సుఖాన్ని ఆహ్వానించేవారు తప్పకుండా దుఃఖాన్ని కూడా ఆహ్వానించాలి.

— వివేకానంద

★ రాత్రి నక్షత్రాల్ని చూపెట్టినట్లు, దుఃఖం నిజాల్ని చూపెడుతుంది.

— జపాన్ సామెత

సేకరణ: **నలబెల్లి శ్రీమన్నారాయణ**

తన మనసులోని దుర్బలతని బయటపడనీ కూడదని ఆమె ఎంత ప్రయత్నించినా కంఠ నాళాలు ఉబికి వచ్చాయి.

బాబాయి ఆవిడనే సూటిగా చూస్తున్నారు. ఆయన ఆమెని పరీక్షిస్తున్నట్టుగా వుంది. శకుంతల అశాంతికి లోనైంది. మనసు ఆక్రోశించింది. బంటీమీద అధికారం తనదే! ఆ అధికారాన్ని తనెవ్వరికీ వదలదు. ఆమె దృష్టిలో ఆ బాబాయి పెద్ద లూటీదారులా కనిపించారు. ఆయన్నెదిరించడానికి ఆమె మానసికంగా సిద్ధపడసాగింది.

''శకుంతలా తప్పుగా భావించకు. నీ ఒంటరితనం పోగొట్టుకునే ప్రయత్నంలో వాడి భవిష్యత్తుని పాడుచేస్తావేమోనని భయంగా వుంది నాకు. నీ అతి ప్రేమ వాడి పెరుగుదలని క్రుంగదీస్తుందేమోననిపిస్తోంది''

శకుంతలకి ఒళ్లు మండిపోయింది. అయినా ఆమె నోటివెంట ఒక్కమాట కూడా వెలువడలేదు.

బాబాయి నిదానంగా, జాగ్రత్తగా ఒక్కొక్క మాట తూచి తూచి మాట్లాడుతున్నారు. ఆమె ముఖంలో వస్తున్న మార్పులు ఆ పరిస్థితిలో వున్న సున్నితస్థితీ ఆయనకర్థమయ్యాయి.

''శకుంతలా! పరిస్థితుల్ని సరిగ్గా అర్థం చేసుకో. నా మాటల్లో నీకేవేవో అర్థాలు గోచరించవచ్చు. నువ్వున్న పరిస్థితిలో అది సహజమే. ఒకడివల్ల మోసపోయాక మన చుట్టూ మోసమే కనిపిస్తుంది. కానీ ఆ అభిప్రాయం సదా సరయినదికాదు...''

శకుంతల కాలిగోటితో నేలని గీరుతోంది. బాబాయి ఏం చెప్పినా జవాబు చెప్పకూడదని ఆమె నిశ్చయించుకుంది.

''ఇందువల్ల బంటీకి మంచి జరుగుతుంది. ఎందుకిలా చెప్తున్నానా అని ఆశ్చర్యపోకు. ప్రస్తుతం నా తలలో వుండేవన్నీ నీ ఆలోచనలే''

ఉలిక్కిపడింది శకుంతల! ఏదో కొత్త ఎత్తు వేస్తున్నట్టున్నాడే! చీకట్లో ఆయన మొహం స్పష్టంగా కనపడలేదుగాని, ఆయన స్వరంలో ఆ ఛాయలేమీ లేవు. ఎంతయినా వకీలు కదా!

''మరో పదేళ్ల తర్వాత ఏమవుతుంది? నువ్వే ఆలోచించు శకుంతలా. బంటీ పెద్దవాడవుతాడు. వాడి స్వంత ఆలోచనలు, భావాలు, స్నేహసంబంధాలు పెరుగుతాయి. అప్పుడు వాడి జీవితంలో నీ అవసరం ఎంతుంటుంది చెప్పు?''

బాబాయి ఒకక్షణం ఆగారు. తన మాటల్లోని సారం ఆమెకి అవగాహనకానీ అన్నట్టుగా ఆగారు.

''అప్పుడేమవుతుంది. నువ్వేవాడి ఆశల్ని ఆశయాలనీ చల్లబరచి, వాడిని నీ చేతిలో కీలుబొమ్మగా చేసుకోవాలని ప్రయత్నిస్తావు. లేదా నువ్వే తిరస్కృతగా ఊహించుకుని దుఃఖపడతావు. ఎవరికోసం ఈ జీవితాన్ని త్యాగం చేశాననుకుంటావో వాడు నిన్ను ఉపేక్షించి తన స్వార్థాన్ని తను చూసుకుంటున్నాడనిపిస్తుంది నీకప్పుడు. ఈ రోజు అజయ్ విషయంలో ఎలాంటి తిరస్కార భావన వున్నదో, బంటీ విషయంలోనూ అదే తిరస్కారభావం పెరుగుతుంది. అదింకా పదింతలవచ్చు.

ఎవరో చాలా జాగ్రత్తగా తన హృదయాన్ని చీలుస్తున్నట్టుగా అనిపించింది శకుంతలకి. ఒక కటువైన సత్యాన్ని బాబాయి తనముందు విప్పి చూపిస్తున్నారు. కానీ అదంతా ఆమెకి తెలియదా? అవన్నీ అబద్ధాలు. వారాలు, నెలల తరబడి ఆమె అవన్నీ ఆలోచించింది. ఎన్నో రాత్రుళ్ళు మేలుక్కూర్చుని మరీ ఆలోచించింది.

కానీ ఆ ఆలోచనలకి ఒక తీరం లేదు. ఆలోచించే కొద్దీ ఆమె దాని అగాథాల్లో మునిగిపోతుంది.

ఒక్కక్షణం ఆమెకి బాబాయి కనపడలేదు. ఆయన మాటా వినపడలేదు.

ఆయన చెబుతూనే వున్నారింకా...

''జరగాల్సిందేదో జరిగిపోయింది. అంతా మంచికే జరిగిందొకవిధంగా జీవితమంతా అశాంతిగా గడిపేబదులు ఆ జీవితంనుంచి విముక్తి పొందటమే మంచిది. మరో విషయం ఆలోచించడానికి అవకాశమన్నా దొరుకుతుంది'' అన్నారు.

కాసేపు వూరుకుని మళ్లీ అన్నారు




''ఇకనైనా ఆలోచించు శకుంతలా! వాస్తవికంగా ఆలోచించు''

శకుంతల కళ్లలో నిరాశా భావం నిండింది. ''ఇంకా ఆలోచించడానికి ఏం మిగిలింది గనుక!''

''నువ్వు నన్ను దుర్మార్గుడనుకుంటున్నావు కదూ! మొదట ఈ పేపర్లమీద సంతకం చేయించుకున్నాను. తరువాత మెల్లగా బంటీని దూరం చేయడానికి ప్రయత్నిస్తున్నాను''

''లేదు లేదు నేనలాగేం అనుకోటం లేదు'' ఆమె స్వరం కంపించింది.

''ఒకవేళ నువ్వలా అనుకున్నా అందులో తప్పేంలేదనుకో. అయినా నీకు కష్టమైనా బంటీని దూరం చేసుకో అని నేను చెప్పటం లేదు. బంటీ నీ దగ్గరేవున్నా నీ భవిష్యత్తు గురించి కూడా నువ్వు ఆలోచించుకోవాలన్నదే నా అభిప్రాయం. ఒక్కమాట స్పష్టంగా చెబుతాను విను. నువ్వు కేవలం తల్లిగానే మిగిలిపోవద్దు. శకుంతలగా కూడా బతకడం అలవాటు చేసుకో''

బాబాయి అభిప్రాయం ఆమెకి అర్థమయ్యీ కానట్టుగా వుంది.

''ఇప్పుడు జరిగింది సంతోషకర సంఘటనేం కాదు. కానీ అదే నీకూ జీవితార్థమూ, జీవితమంతానూ కాదు. తల్లిగా మిగిలిపోడమే నీ జీవితానికి ఆఖరి ఘట్టం కాకూడదు, కొత్త జీవితాన్ని ఏర్పరుచుకోడం అజయ్‌కి సాధ్యమయినప్పుడు నీకు మాత్రం ఎందుకు సాధ్యం కాకూడదు? నీకు నువ్వే ఎందుకు బంధనాలు వేసుకుంటావు? ప్రిన్సిపాల్ కావడంవల్ల నీకు సమాజంలో ఎంతమందితోనో పరిచయం వున్నది కదా''

బాబాయి మాటలు విని శకుంతల ఉలిక్కిపడింది. ఈ మాటలాడేటప్పుడు బాబాయి మనసులో డాక్టర్ జోషి గురించిన ఉద్దేశ్యమేమన్నా వుందేమో. కానీ ఆయన గురించి తన మనసులో తనే ఎటువంటి ఆలోచనల్లనీ పెంచుకోడం లేదు. మరి బాబాయికెలా తెలుస్తుంది. అయినా ఆమె చెవులు నిక్కపొడుచుకున్నాయి. బాబాయి చెప్తూనే ఉన్నారు.

''నీకేం తక్కువని? చదువుంది, తెలివుంది,

రుంది''

ఒక్క క్షణం ఆగి, తేలికయిన స్వరంతో ఆయన అన్నారు.

''పరిస్థితులు ఎంత వ్యతిరేకంగావున్నా వాటి ప్రభావం నీ వయసు మీదేమీ పడ్డట్టులేదు.

రియల్లీ యూ సీమ్ టు బీ ఏజ్‌ప్రూఫ్''

బాబాయి అన్న ఈ మాటల్లో ఇంతవరకూ వాతావరణంలో వున్న గాంభీర్యం సడలినట్లయింది. ఇప్పటిదాకా ఆయన చెప్పినదానికి సారాంశం అన్నట్టుగా.

''జరిగింది మర్చిపో. జరిగిపోయిందాన్నే గుర్తు చేసుకుంటూ కాలం గడపడం ముసలివాళ్ల స్వభావం. కానీ నువ్వు...''

మంచం మీద పడుకున్న బంటీ దొర్లాడు. వాడు మంచం చివరకి వచ్చేశాడు. ఇంకాస్తుంటే పడేలా వున్నాడు. శకుంతల చటుక్కున లేచి వాడిని సర్దింది.

''అబ్బబ్బ! తెగ పొర్లుతాడు. రెండు పక్కలా దిళ్లు అడ్డుపెట్టకపోతే పదిసార్లయినా పడతాడేమో'' అని శకుంతల వాడిని ప్రేమగా నిమరసాగింది.

బాబాయి టేబుల్ మీదున్న టోపీని తీసి తలమీద పెట్టుకున్నారు. ''పడితే పడనీ పడ్డంత మాత్రాన ఏమీ అయిపోదు. పిల్లలు పెద్దాళ్లయేది అలాగే'' అంటూ లేచి నుంచున్నారు.

''నాకో సంగతి గుర్తొస్తోంది శకుంతలా. అమెరికన్ ఒకడు ఈ దేశం వచ్చి కొద్ది నెలలున్నాడు. ఇక్కడి కుటుంబ జీవనం చూసి, ఒక రోజు అతనేమన్నాడో తెలుసా... భారతదేశంలో ప్రజలు పిల్లలపైన చూపించేది ప్రేమకాదు.. మోహం... గుడ్డి మోహం... అని. అతనలా అన్నప్పుడు నాకు చాలా కోపం వచ్చింది. కానీ స్థిమితంగా ఆలోచిస్తే అతనన్నది నిజమేననిపిస్తుంది. మన దేశంలో ప్రజలకి పిల్లల్ని సహజమైన పద్ధతిలో పెంచడం చేతకాదు. ప్రేమ పేరుతో తల్లి దండ్రులు తమ పిల్లల్ని ఎంత కట్టుబాట్లలో

వుంచుతారంటే వాళ్లు కష్టాలనెదిరించడం, సరిగ్గా పెరగడం... దేనికీ అవకాశం వుండదు''

అనేసి ఆయన తన చేతికర్ర తీసుకుని బయల్దేరారు. ఆయన నీడ ఆయనకంటే పొడుగ్గా లాన్‌మీద పరచుకుంది.

''ఇదేమిటి ఉన్నట్టుండి బయల్దేరుతున్నారు?''

''ఇంకేం చెయ్యను? అప్పుడే పదిన్నరయింది''

''అవును, రేపేనా ప్రయాణం?''

''తప్పదుకదా, చాలా పనులున్నాయి''

''మళ్లీ ఎప్పుడొస్తారు?''

''తెలునుగా, కేసున్నప్పుడొస్తాను. మళ్లీ కేసు ఎప్పటికి పడుతుందో చూడాలి''

ఆయన్తో బాటే వెళ్లి గేటు తీసింది శకుంతల. బాబాయి ఒక్క నిమిషం అక్కడే నుంచున్నారు. ''శకుంతలా! నేను చెప్పిన విషయాన్ని సీరియస్‌గా ఆలోచించు... ఐ మీన్ ఇట్'' అనేసి ఆమె భుజం మీద స్నేహంగా ఒకసారి తట్టారు. ఆమె హృదయం ఆర్ద్రమయిపోయింది.

''ఇంకొక రోజెప్పుడో అజయ్ రావాల్సొస్తుంది. అప్పుడు ఒక పది నిమిషాలు నువ్వూ కోర్టుకి రావాల్సొస్తుంది. ఆ పని కూడా అవగొట్టేస్తే మంచిది. వెళ్ళొస్తాను మరి''

అని చెప్పి బాబాయి బయల్దేరారు. వడివడిగా నడుస్తున్న ఆయన ఆకారం రానురాను అదృశ్యమయ్యింది. శకుంతల మాత్రం ఉన్నచోటే ఎంతో సేపునుంచుండిపోయింది.

బాబాయితో సాన్నిహిత్యం, ఆయన ఆత్మీయత వలన ఆమె మనసులోవున్న సందేహాలన్నీ దూరమయ్యాయి. మంత్రముగ్ధురాలిలా ఆమె ఆయన మాటలన్నీ నమ్మింది. అంతా అయ్యాక ఆయనాడిన ఆఖరి మాట ఈ నమ్మకాన్నంతా వమ్ము చేసింది.

బాబాయి తనచేత సంతకం చేయించుకోడానికి వచ్చారు. తనేమన్నా పెట్టను అని పట్టుపట్టివుంటే అజయ్‌ని బాగా ఇబ్బంది పెట్టినట్లయి వుండేది. మీరా గర్భవతి అన్నారు బాబాయి. అయితే అందుకోసమే ఈ వ్యూహమంతా! బిడ్డ పుట్టేందుకు ముందే సమస్యలన్నీ తీరిపోవాలికదా!

తను మళ్లీ మోసపోయింది. మళ్లీ ఫూల్ చేయబడింది. ఆమె ఒంట్లో అణువణువునా అగ్ని ప్రజ్వరిల్లింది.

బంటీని హాస్టల్‌కి పంపించాలట. మెల్లగా వాడిని తమ వశం చేసుకోవాలనేమో. ఏమన్నా జరగనీ, వాడిని మాత్రం హాస్టల్‌కి పంపేదిలేదు. అజయ్‌కి బంటీ అంటే చాలా ఇష్టం. ఇకమీదట అతను బంటీని చూడ్డానికి కూడా అవకాశం ఇవ్వకూడదు. బంటీని చూడలేకపోవడంవల్ల అజయ్ అనుభవించబోయే హింసని తల్చుకుంటేనే ఆమెకి అదోరకమైన ఆనందం కలిగింది.

చచ్చుబడ్డట్టనిపిస్తున్న కాళ్లనీడ్చుకుంటూ మంచం దగ్గరకొచ్చింది. మంచం మీద ఏ ఆలోచనలూ లేకుండా బంటీ నిశ్చింతగా నిద్రపోతున్నాడు. రాజా రాణీల్నో అప్సరసలనో కలలో చూస్తూండివుండాలి. రోజూ కథలు వింటాడు, చదువుతాడు. తరువాత ఇలాంటి కలలేవో కంటూంటాడు.

శకుంతల వంగి వాడి నుదుటిమీద ముద్దు పెట్టుకుంది. నుదుటిమీదపడ్డ జుట్టుని వెనక్కి నవరించింది. వాడి ఒళ్లు చల్లగా వున్నట్టనిపించింది. తన గొడవలోపడి ఆమె ఇంతసేపూ వాడిని పట్టించుకోనేలేదు. గబగబ వాడినెత్తుకుని లోపలకి నడిచింది. వాడికి నిద్రాభంగం కాకుండా మెల్లగా మంచం మీద పడుకోపెట్టింది. అప్పుడామె మనసులో ఒక భావం ఉదయించింది. బంటీ తనకి కొడుకు మాత్రమే కాదు, ఒక ఆయుధం కూడా. ఆ ఆయుధంతో తను తల్చుకుంటే అజయ్‌ని ఒక దెబ్బకొట్టొచ్చు. అలాగే చేస్తుంది కూడా.

మంచం మీద వాలగానే ఆమె కళ్లముందు డాక్టర్ జోషి ముఖం కదిలింది. ఇదివరకు ఆ ముఖం మాటిమాటికి ఆమె జ్ఞాపకాలలో కదిలేది. కానీ ఈమధ్య ప్రయత్నపూర్వకంగా ఆమె ఆ జ్ఞాపకాలని దూరంగా నెట్టేసింది.

జోషి ఊళ్లో పెద్ద డాక్టరు. ఒకసారి విపరీతమైన జలుబు, దగ్గు వచ్చినప్పుడు ఆయన పరిచయమయింది. క్రితం సంవత్సరం బంటీకి జ్వరం వచ్చినప్పుడు ఆయనెంతో ఆసీ





యంగా చూసుకున్నారు. అంతేకాదు, కొడుకు జ్వరంతో అధైర్యపడిన ఆమెకీ ధైర్యం చెప్పారు.

ఇలా మొదలయిన పరిచయం సాన్నిహిత్యంగా మారింది. శకుంతల భర్తకి దూరంగా వంటరిగా ఉందన్న సంగతి ఇంచుమించు అందరికీ తెలుసు. అందుకే డాక్టర్ కూడా బంటీ తండ్రి గురించి ఎప్పుడూ అడగలేదు. తన భార్య గతించిందన్న సంగతి మాత్రం తెలియబరచారంతే, ఆ కాస్తలోనే ఆయన ఎన్నో సంగతుల్ని చెప్పినట్టుగా అయింది.

బంటీ ఆరోగ్యం గురించి పలుకరించే నెపంతో ఆయన శకుంతల ఇంటికి వస్తూనే వుండేవారు. టీ తాగుతూ కబుర్లతో కాలక్షేపమూ జరిగేది. కానీ ఆమె ప్రోత్సాహం బొత్తిగా లేకపోడం వల్ల ఆ పరిచయం అక్కడికే పరిసమాప్తం అయింది.

ఇప్పుడు జోషిగారు జ్ఞాపకం రాగానే శకుంతల అజయ్‌తో పోల్చుకుని చూసింది. దానితోటే మీరా గుర్తొచ్చింది. తను మీరానెప్పుడూ చూడలేదు. ఆమె పాలిటికి మీరా ఒక పేరు మాత్రమే. అయినా జోషిగారితోబాటు మీరా ఎందుకు గుర్తు రావాలి? ఆమెకి స్పష్టంగా అర్థమయింది. ఏనాటికయినా తను ఎవరినైనా ఒప్పుకుని జీవితంలోకి రానిస్తే అది కేవలం తనకోసమే కాదు, తనని ఇష్టపడేవాళ్ళూ వున్నారని అజయ్‌కి నిరూపించాలి. అదే ఆమె ధ్యేయం.

ఇవాళ జోషీగారితోబాటు అజయ్, మీరా కూడా ఆమె ఊహల్లోకొచ్చి నిలబడ్డారు. ఆమె ఇంకా అప్పుడేకదా విడాకుల పత్రంలో సంతకం చేసింది. ఇకముందు ఇలాంటి భ్రమలకి, బంధాలకి స్వస్తి చెప్పాలి. బాబాయిగారన్నట్టు ఇలాంటి భ్రమల్నుంచీ బంధాల్నుంచీ బయటపడి కొత్త జీవితాన్ని ఆరంభించాలి. కొత్త జీవితాన్నారంభించి తనే మీ అజయ్‌కంటే తీసిపోనని అతనికి చూపించాలి. కానీ అంతలోనే అనుకుంది, తను ఇవన్నీ చెయ్యాల్సింది మరొకరికి చూపించడం కోసంకాదు, తనకోసం తను బతకడం నేర్చుకోవాలి. ఆ ఆలోచనరాగానే అజయ్ ముఖాన్ని తన మనసునుంచి దూరంగా తోసేసింది.

జోషిగారి ముఖం ఎంతోసేపు అలాగే నిలచిపోయింది.



ఇవాళ నాన్న వస్తారు. పది గంటలకి సర్క్యూట్ హౌస్‌దగ్గరకి రమ్మని బంటీకి ఉత్తరం కూడా వచ్చింది. కానీ అమ్మ ముఖం ఎర్రగా చేసుకుని తిరుగుతోంది. ఈసారి వకీలు బాబాయి వచ్చి వెళ్ళినప్పట్నుంచీ అమ్మ అలాగే వుంది. ఈ వకీలు బాబాయి కూడా విచిత్రమైన మనిషి. తనేమో వచ్చినప్పట్నుంచి వెళ్ళేవరకూ మాట్లాడుతూనే వుంటారు. ఈ అమ్మేమో మూగదానిలాగ అయిపోతుంది. ఈ అమ్మకేమవుతుందో అర్థంకాదు.

ఆరోజు రాత్రి బంటీకి మధ్యల్లో మెలకువ వచ్చింది. టైమెంతయిందో తెలీదు. వాడు కళ్ళు తెరిచేసరికి అంత దూరాన చెట్టుకింద ఎవరో నుంచున్నట్టనిపించింది. భయంతో గట్టిగా అరవాలనుకున్నాడు. కాని వాడి గొంతులోంచి శబ్దం పెగల్లేదు. అంతలో తెలిసింది అక్కడున్నది అమ్మ అని. అమ్మ వాడి దగ్గరకొచ్చి ఎంతసేపో జోకొట్టింది. అయినా వాడి భయం అంత త్వరగా పోలేదు. ఇంత అర్థరాత్రివేళ ఎవరన్నా కాంపౌండ్‌లో నుంచుంటారా? బాబాయి భయంకర విషయం ఏదో చెప్పి వుంటారు. ఏదో గందరగోళం జరిగింది. కాని ఇప్పుడు తనేమి చెయ్యగలడు? అమ్మ ఎప్పుడూ ఇలా వుండదసలు. ఆమె సరిగ్గా మాట్లాడకపోతే వాడికి బొత్తిగా ఉత్సాహం వుండదు.

మొన్ననే నాన్నదగ్గర్నుంచి ఉత్తరం







వచ్చింది. కవర్‌మీద అమ్మ పేరే వుంది. ఇదివరకు ఉత్తరం వస్తే కవర్‌మీద కూడా వాడిపేరే వుండేది. కవర్లో రెండు కాగితాలు న్నాయి. ఒకటి వాడి చేతికిచ్చి ఇంకొకటి తను చదవడం మొదలెట్టింది.

నాన్న అమ్మకి కూడా ఉత్తరం రాశారు. అంటే అమ్మకి, నాన్నకి స్నేహం కుదిరిందనేగా అర్థం? బంటీ తన ఉత్తరం చదువుకొని తల్లి కేసి తదేకంగా చూస్తున్నాడు. ఆమె ముఖంలో సంతోషమే ఉందో, దుఃఖమే ఉందో వాడికి అర్థంకాలేదు. వాడికొచ్చిన ఉత్తరాన్ని కూడా అడిగి చదవలేదు. క్రితంసారి వాడికొక్కడికే ఉత్తరం వచ్చింది. దాన్ని చదివి అమ్మ ఎంత ఆనందపడిపోయిందో! నాన్న దగ్గరకి పంపేట ప్పుడు కూడా వాడు మళ్ళీ తిరిగి రాడేమోన న్నంత పిచ్చిగా ముద్దులాడింది. నాన్నతో గడిపి తిరిగి వచ్చాక దగ్గరకి లాక్కుని ఎన్ని ప్రశ్నల్ని వర్షంలా కురిపించిందో!

ఈ ఉత్తరం వచ్చినరోజూ పడుకునేటప్పుడు ఎప్పటిలాగే మమ్మీ ముద్దులాడుతుందని ఎదురుచూశాడు బంటీ. కాని ఆవిడ నీరసంగా ప్రశ్నించింది. ''నాన్నని చూడ్డానికి వెళ్తావా బంటీ?'' ఆ ప్రశ్న అడగాలా అసలు? నాన్నొస్తే చూడకుండా వుండటం ఎలా కుదురుతుందీ? అసలెందుకు చూడకుండా వుండాలి?

పోనీఅంటే, మమ్మీ ఏం చిరాకుల్లో లేదు కూడా. ఆమె దిగులుగా వుంటే ఏడవకపోయినా కళ్ళెర్రబారి వుంటాయిగదా!

ఆవిడ మాట్లాడకపోతే పోన్లే, అలాగే మూగదాన్లా కూర్చోనీ. నాన్న వచ్చినప్పుడయినా కనీసం ఆయన్తో హాయిగా తిరిగి, కాలక్షేపం చేసిరావాలి. కావల్సిన సామానంతా కొనిపించుకోవాలి.

బంటీ త్వరత్వరగా సిద్ధం కాసాగాడు. తను నాన్నకి చెప్పి కొనిపించుకోవలసిన ఆటవస్తువుల లిస్టు తయారుచేసుకుంటున్నాడు. కేరమ్బోర్డు కొనిపించుకోవాలి. ఒక వ్యూమాస్టర్ కూడా...

"బంటీ, పాలు తాగి మరీ వెళ్ళు నాయనా"

ఈ అత్తయ్యొకతె మొహం ముటముటలాడించుకుంటూ తిరుగుతుంది. క్రితంసారి నాన్న వచ్చినప్పుడు కూడా అంతే చిరచిరలాడుతూనే వుంది. చూస్తే అసలు నాన్నతో తగువు ఈవిడకేనేమో అనిపిస్తుందెవరికయినా!

"నేను పాలు తాగను. రోజూ ఈ దరిద్రపు పాలు తాగడమంటే నాకు చిరాకు!"

"బంటీ" అమ్మ కోపంగా గద్దించింది.

వాడు లోపల్లోపలే బెదిరాడు. తరువాత మెల్లగా అన్నాడు

"నాకు పాలు నచ్చవు" అని.

"ఎందుకని? ఒక్కరోజు పాలు లేకపోతే నానా రాద్ధాంతం చేస్తావు, ఇవాళేమయింది నీకు?"

"ఇష్టమయినంతమాత్రాన రోజూ తాగాలా ఏం? నాకొద్దు?"

"హుఁ నేనూ చూస్తూనే వున్నాను. పెద్దవాడి వయ్యేకొద్దీ మొండితనం ఎక్కువవుతోందే! ఇంకోరిదగ్గర నా మర్యాద మంటగలిపేలా వున్నావు"

అమ్మ ఎలాంటి మాటలంటోంది! ఇందులో అమ్మ మర్యాదని పాడుచేసేలాంటిదేముందని? ఇవాళ పాలు తాగనే తాగను. ఏం చేస్తుందో చూద్దాం అనుకున్నాడు వాడు.

సరిగ్గా తొమ్మిది గంటలకి రమ్మని ముందు రోజే హీరాలాల్కి చెప్పడమయింది. అయినా తొమ్మిదిన్నరయినా వాడెందుకు రాలేదో! బంటీ అశాంతిగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. మమ్మీమాత్రం నిశ్చింతగా పుస్తకం ఏదో చదువుకుంటూ కూర్చుంది.

వాడికిప్పుడన్నీ అర్థమవుతాయి. తనిప్పుడు నాన్నదగ్గరకి వెళ్ళడం మమ్మీకి ఇష్టంలేదు. అయితే తనేమీ నాన్నతో దెబ్బలాడలేదే! అంతలో హీరాలాల్ చిన్న కూతురు వచ్చింది. "మా నాన్నకి చాలా జ్వరంగా వుంది. రావడానికి కుదరదని చెప్పమన్నాడు" అంది.

"ఏమయిందే..." అని అడిగింది అమ్మ తాపీగా. అమ్మ గొంతులో ఎక్కడా కంగారు, బెంగ లేనేలేవు. అయినా ఆవిడకేం నష్టం! తను నాన్నదగ్గరకి వెళ్ళకుండా వుంటేనే ఆవిడకిష్టం.

"మా అయ్యకి చాలా తల్నొప్పి, చలి, జ్వరం కూడా. కంబళి కప్పుకు పడుకున్నాడు. నన్నెళ్ళి చెప్పిరమ్మన్నాడు"

అమ్మ ఒకక్షణం వూరుకుంది. అత్తయ్యని పిలిచి బంటీని తీసికెళ్ళి దింపిరమ్మంది. అత్తయ్య అయిష్టంగా మొహంపెట్టి

"నేనక్కడికి వెళ్ళనమ్మా" అంది.

బంటీ అత్తయ్య చెయ్యిపట్టి లాగుతూ "రా అత్తయ్యా! నువ్వే నన్ను దింపిరా" అని బతిమాలాడు.

అత్తయ్యొక్కసారి ఖంయ్యిమంది.

"నేను రాను. ఆయనకి నిన్ను చూడాలని వుంటే ఆయనే వస్తాడు. ఈ ఇంట్లో కాలుపెడితే ఆయన మర్యాదకేం తక్కువవదు. మీకెంత కోపం వచ్చినా సరేనమ్మా. వెళ్ళడం నావల్ల కాదు..." అనేసి ఏవేవో గొణుగుతూ అక్కడ్నుంచి లోపలికెళ్ళిపోయింది.

ఆశ్చర్యం! మమ్మీ ఆవిడనేమీ అనలేదు. అదే తనవనయితేనా! బంటీ ఏడుస్తూ నుంచున్నాడు.

"ఎందుకురా ఏడుస్తావు. కాసేపు వూరుకో... కాలేజీ తోటమాలిని పిలుస్తాను" అని

మమ్మీ తోటమాలిని పిలిచి చెప్పింది.

"చూడూ! వీడినితీసికెళ్ళినర్స్యాటహౌస్దగ్గర దింపేసిరా... రాత్రి ఎనిమిది గంటలకి





మళ్ళీ వచ్చి నేనే తీసికెళ్తానని ముందుగానే చెప్పేసెయ్. ఎక్కడ తిరిగినా సరిగ్గా ఎనిమిది గంటలకి అక్కడికి తిరిగివస్తే సరి. ఏం బంటీ, నువ్వూ చెప్పు. ఎనిమిదికంటే ఆలస్యం కాకూడదని... సరేనా?''

'అబ్బ ఎలా ఆర్డర్ చేస్తుందో! అచ్చు ప్రిన్సిపాల్‌లా!'

నాన్నదగ్గర ఎన్నో ప్రశ్నలడగాలని బంటీ మనసులోనే ఆలోచించుకున్నాడు. అమ్మకి నాన్నకి మధ్య అసలేం జరిగింది, ఎందుకు దెబ్బలాటయ్యింది. వకీలు బాబాయొచ్చి ఏమేమో ఎందుకు చెప్తారు... ఏదో గొడవ జరిగింది... తనకెవరూ ఏమీ చెప్పటంలేదు. అన్నీ అడగాల్సిందే. అసలు నాన్నయినా అమ్మ సంగతి మాట్లాడతారో లేదో... ఒకమాట మాత్రం ఖచ్చితంగా అడిగేసెయ్యాలి. 'అసలెప్పటికయినా అమ్మా నాన్నా కలిసే వీలే లేదా?' అని. నాన్న కూడా తమతో ఉంటే ఎంత బాగుంటుంది? కాని ఇలాంటి ప్రశ్నలకి జవాబిచ్చేందుకు బదులు ఆయన కూడా తనని కసిరితే...!

నాన్న బయటే నుంచుని వున్నారు. బంటీ కనపడగానే పరుగెత్తుకొచ్చాడు. వాడినెత్తుకుని దగ్గరకి అదుముకుని రెండు బుగ్గల్నిండా ముద్దులు పెట్టేసుకున్నారు.

''ఎందుకింత ఆలస్యం చేశావు? నీకోసం ఎంతసేపట్నుంచి ఎదురుచూస్తున్నానో తెలుసా?''

''హీరాలాల్‌కి జ్వరమట. తీసుకురాడానికి ఎవరూలేరు. మళ్ళీ ఎనిమిదిగంటలకి తీసుకొచ్చెయ్యమన్నారు అమ్మగారు''

మాలి మాటలు విని నాన్న నిర్లక్ష్యంగా ''సరే... వెళ్ళు, ఎనిమిదిగంటలకి రా''

అనేసి బంటీనెత్తుకుని లోపలకి వెళ్ళారు.

కొన్ని కథల పుస్తకాలు, మెకానోసెట్, ఒక చాక్లెట్ డబ్బీ అన్నీ వాడిముందు పరచారు.

''తీసుకో... ఇవన్నీ నీకే...! నచ్చాయా?''

''నాకు కేరంబోర్డూను, ఇంకా... వ్యూమాస్టర్ లేవు...''

బంటీ ఎంతో మొహమాటంగా అడిగాడు

''అయ్యో...! నాకు ఉత్తరం రాయకపోయావా? నువ్వేమో నాకు ఉత్తరాలే రాయవు

మరి. పోన్లే, ఇంకోసారి వచ్చినప్పుడు కొంటాలే... సరేనా?''

'ఇప్పుడే కొనిపెట్టండి...' అని అడుగుదామా అనిపించిందిగాని వాడి నోటివెంట మాటే బయటికి రాలేదు. అమ్మదగ్గరయితే పేచీ పెట్టి కొనిపించుకోవచ్చు.

''ఈసారి నువ్వు చాలా పెద్దవాడిలా కనిపిస్తున్నావు'' అన్నారు వాడినే పరీక్షగా చూస్తూ బంటీకి సిగ్గుగా అనిపించింది.

''ఎలా చదువుతున్నావు? మార్కులు బాగా వస్తున్నాయా?''

''నిన్న మా స్కూలుకి ఇన్‌స్పెక్టర్‌గారొచ్చారు. నేను అందరికంటే బాగా ఆన్సర్లు చెప్పాను. ఇన్‌స్పెక్టర్‌గారూ, మాస్టారూ కూడా నన్నెంతో మెచ్చుకున్నారు.

''శభాష్! నేనూ మెచ్చుకుంటున్నాను'' అని వాడి వీపు తట్టారు.

నువ్వు ఏమేం ఆటలు ఆడగలవు?

''చెస్, లూడో, కేరమ్స్...''

''ఏమిటి? చెస్, లూడో, కేరమ్సూనా...? ఛీ... ఇవన్నీ ఆడపిల్లలాడే ఆటలు. నువ్వు హాకీ ఆడాలి, క్రికెట్ ఆడాలి. కబాడి ఆడాలి. ఇంట్లోంచి బయటకెళ్ళి ఆటలాడాలిగాని, ఆడపిల్లలా ఇంట్లో కూర్చుని ఆడే ఆటలు ఆడతారా? పోనీ, చెట్టెక్కడం వచ్చా?''

''... లేదు, పడిపోతావని అమ్మ కోప్పడుతుంది''

''ఈత నేర్చుకున్నావా? దగ్గర్లో స్విమ్మింగ్ పూలుందా?''

''తెలీదు''

''రెండుచక్రాల సైకిల్ తొక్కడం వచ్చా?''

''పదేళ్ళు నిండగానే కొనిపెడతానంది మమ్మీ''

''నీకెంతమంది ఫ్రెండ్సున్నారు?''

''టిటూ''

''టిటూ ఎవరూ?''

''పక్కింటి అబ్బాయి. వాడూ మాస్కూల్లోనే చదువుతున్నాడు. నాకంటే ఒక క్లాసెక్కువ.

ఇంకొక ఫ్రెండు కునీ్న''

''కునీ్న ఎవరు?''

''శర్మగారమ్మాయి. నా స్నేహితురాలు. వాళ్ళి ల్లూ దగ్గరే. ఇంటి వెనుకనుంచి వెళ్ళి పక్కకి తిరగాలి. అక్కడ్నుంచి కొంచెం ముందుకి వెళ్తే అక్కడే వాళ్ళిల్లు''

బంటీ ఎంతో చక్కగా చెప్పాడు. అయినా నాన్నకి నవ్వాగలేదు. ఎంతసేపో నవ్వుతూనే వున్నారు.

''ఇంకా... ఇంకా ఎవరెవరున్నారు?''

''ఇంకెవరూ లేరు''

''ఇద్దరేనా అయితే?''

''స్కూల్లో ఇంకా బోల్డుమందున్నారుగాని, వాళ్ళందరిళ్ళూ దూరం''

''రోజంతా ఎలా గడుపుతావు? ఒక్కడికే విసుగ్గా వుండదా? పిల్లలకి ఎక్కువమంది ఫ్రెడ్సుండాలి. బాగా ఆటలాడాలి''

''నాకు బోరేం కొట్టదు. మమ్మీ బోలెడు కథలు చెప్తుంది. నాతో చెస్ ఆడుతుంది. నేనూ పుస్తకాలు చదువుతాను. డ్రాయింగ్స్ వేస్తాను. బోలెడు బొమ్మలేశాను. బాగున్న చాలా బొమ్మ ల్ని మమ్మీ డ్రాయింగ్‌రూమ్‌లో తగిలించింది''

''అలాగా? ఈసారి నాకోసం ఒక బొమ్మ గీసిపెట్టు నేనూ నా రూమ్‌లో తగిలించు కుంటాను''

బంటీ ఒక్కక్షణం వాళ్ళనాన్న ముఖంలోకి గుచ్చిచూశాడు. మాతోపాటే వుండు అని ఎందుకడక్కూడదు? నాన్న ఎక్కడో వేరుగా ఎందుకుండాలి? ''మనమంతా ఒకే ఇంట్లో ఉండకూడదా నాన్నా?'' అనడిగాడు.

''ఈసారి శలవుల్లో నాతోబాటు కలకత్తా వస్తావా...?''

బంటీ కళ్ళు విప్పార్చి అనుమానంగా తండ్రివేపు చూశాడు. ఆయన ఇదివరకెప్పు డూ వాడినలా రమ్మని పిలవలేదు.

''సరదాగా గడపచ్చు. హాయిగా వూరంతా తిరిగి రావచ్చు. వస్తావా?''

''అమ్మ వస్తే వస్తాను''

''ఛీ... ఛీ... ఇంత పెద్దవాడివయ్యిండీ అమ్మనొదిలి వుండలేవా? ఇక మీదట నువ్వు మమ్మీని వదిలిపెట్టి వుండటం అలవాటు చేసుకోవాలి. ఎప్పుడూ అమ్మనే అంటిపెట్టు కుని వుండటానికి నువ్వేమన్నా ఆడపిల్లవా?''

బంటీకి చాలా సిగ్గేసింది. లోపల్లోపల కోపం కూడా వచ్చింది. అత్తయ్యేమన్నా ఇలా మాట్లా డివుంటే ఆవిడకి బాగా బుద్ధొచ్చేటట్టు చేసేవా డు. నాన్నని ఎలా అనడం? అయినా నాన్న కూడా ఇలాంటి మాటలెందుకాడతారు? తనూ మమ్మీతోపాటుండరు. మళ్ళీ నన్నూ దూరం చేద్దామనుకుంటున్నారు. చాలా గడుసైనవారే అనుకున్నాడు వాడు. ఒక్కసారిగా వాడి మన సులో తండ్రిమీద కోపం సెగలుగక్కింది.

'అమ్మనెందుకు పిలవరు?' అని అడిగే ద్దామా అనిపించింది. కాని తన మాటలవల్ల నాన్నకి కోపం వస్తే...? ఎంతయినా ఆయన స్వభావం తనకి అంతగా తెలియదు. అదే మమ్మీ అయితే ఆ సంగతి వేరు.

''ఏమంటావు బంటీ! ఈసారి శలవులకి కలకత్తా తీసికెళ్ళే ప్రోగ్రాం వెయ్యమంటావా? శలవులు అయిపోగానే తిరిగి వచ్చేద్దువుగాని. అక్కడ విక్టోరియా మెమోరియల్ వుంది. బొటానికల్ గార్డెన్స్, లేక్స్, జూ... అన్నీ వున్నాయి. నీకిష్టమైనవన్నీ చూడచ్చు. అన్నిచో ట్ల తిరిగి రావచ్చు'' అని.

వాటన్నింటి గురించి వివరంగా చెప్పసాగా రు. పెద్దపెద్ద కట్టడాలు.... కొంచెంసేపటిక్రితం వున్న భయం, అనుమానం దూరమై, సంతో షంగా ఈ మాటల్లో మునిగిపోయాడు వాడు. కళ్ళెదురుగా రంగురంగుల చిత్రాలు అలము కున్నాయి. మనసు ఉత్సాహంతో గంతులే సింది.

''అక్కడంతా బెంగాలీలో మాట్లాడితే నేనెలా జవాబివ్వాలి?'

అక్కడంతా చేపలు తింటారటకదా... ఊరంతా చేపల వాసన నిండిపో యుంటుందేమో

పదమూడు, పధ్నాలుగు అంతస్థులుండే ఆ కట్టడాలు ఎలా వుంటాయో!

హుగ్లీ నదిలో ఓడలు తిరుగుతుంటా యట నేను లోపలకెళ్ళి చూడచ్చా?




పి.సి.సర్కార్ అక్కడే వుంటారటకదా? మీరు ఆయన చేసే ఇంద్రజాలం చూశారా? పి.సి.సర్కార్ ఎలా వుంటారు? అవును నాన్నా అక్కడి మంత్రగత్తెలు మనుషుల్ని గొరెల్లా మార్చేస్తారటగా? వాళ్ళనెప్పుడైనా మీరు చూశారా?''

నాన్న ఇచ్చే ఒక్కొక్క జవాబు వింటూంటే వాడి మనోలోకంలో ఒక కుతూహల భరిత చిత్రం పరచుకుంది. వాడు ముగ్ధంగా తండ్రి మాటలన్నీ వింటూ కల్పనానేత్రాలతో ఏవేవో చూస్తున్నాడు.

కాని నాన్న మాటిమాటికీ కలకత్తా వస్తావా అని అడుగుతుంటే వాడి కళ్ళముందు ఏర్పడ్డ మాయాలోకం మాయమయిపోతోంది. లేదు, లాభంలేదు. అమ్మనొదిలేసి వెళ్ళడం సాధ్యమయ్యే సంగతి కాదు.

భోజనం చేశాక -

''ఇప్పుడు కొంచెంసేపు నిద్రపోదాం. సాయంత్రం అలా బయట తిరిగొద్దాం. మధ్యాహ్నం పడుకోడం అలవాటుందా?'' అని అడిగారు.

బంటీ ''ఊఁ'' అనగానే నాన్న వాడిని మంచంమీద పడుకోబెట్టి ఆయన కింద పడుకున్నారు. అమ్మే అయ్యింటే పక్కనే పడుకునేది. పడుకోగానే నాన్నకి నిద్రపట్టేసింది. బంటీకిమాత్రం ఏం చేసినా నిద్ర రాలేదు. పడుకున్నచోటే కలకత్తా దృశ్యాల్ని చూడసాగాడు. ఒకసారి ఇల్లు గుర్తొచ్చింది. పొద్దున్నే రాకుండా సాయంత్రం వచ్చినా సరిపోయేదే మోననిపించింది వాడికి.

నాన్న గురక ప్రారంభించారు కూడా. నాన్న ముఖాన్నే దీక్షగా చూడసాగాడు బంటీ. కళ్ళజోడు లేకపోతే నాన్న ఎలా వుంటారా అని చూస్తున్నాడు. అసలింతవరకు ఆయన్ని ఎప్పుడైనా సరిగ్గా గమనించానా అనే అనుమానం వచ్చింది.

మమ్మీ మొహంలో వుండే ప్రతి గీతా వాడికి తెలుసు. అంత దగ్గరతనం మమ్మీతో. నాన్న తెచ్చిన పుస్తకాలు తిరగెయ్యడం మొదలుపెట్టాడు.

సాయంత్రం నాన్న బంటీని టాంగాలో తిప్పి తీసుకొచ్చారు. ఐస్‌క్రీం ఇప్పించారు. చిరుతిళ్ళు తినిపించారు. చెరకురసం తాగించారు. వూరంతా తిప్పి చీకటి పడుతుంటే వెనక్కి తిరిగారు. టాంగా దిగి లోపలకి వెళ్తున్నవాడు తండ్రి అరుపులు విని వెనక్కి తిరిగాడు. నాన్న టాంగావాడిని కోప్పడుతున్నారు.

''అబద్ధాలు చెబుతున్నావా? టాంగా ఎక్కే ముందు నేను టైము చూసుకునే ఎక్కాను. ఒక్క పైసా కూడా ఎక్కువివ్వను''

బంటీ భయంగా అక్కడే నుంచుండిపోయాడు. బండివాడేదో అని బండినుంచి కిందకి దూకాడు. నాన్న అరుస్తూ మాట్లాడుతున్నారు.

''షటప్! ఒళ్ళు దగ్గరపెట్టుకుని మాట్లాడు. అయ్యోపాపం అని చూస్తే మీరంతా నెత్తికెక్కేరకాలు. మిమ్మల్ని చెప్పుతో పలుకరించాలనలు...''

కోపంతో ఆయన ముఖం ఎర్రగా అయిపోయింది. కళ్లు నిప్పులు కక్కుతున్నాయి. బంటీకి ఊపిరాడనట్టయిపోయింది. వాచ్‌మేన్, జవాను కలిసి టాంగావాడికి నర్దిచెప్పి పంపేశారు.

నాన్న కోపంతో సెగలు కక్కుతూనే వున్నారు. బంటీ భయంతో బిత్తరపోయి నుంచున్నాడు. వాడికి మమ్మీ గుర్తొస్తోంది. ఇప్పుడు వెంటనే తను మమ్మీ దగ్గరకి వెళ్ళాల్సిందే. తోటమాలి వచ్చాడో లేదో...?

ఆ సమయంలోనే జవాను చెప్పాడు.

''బాబుని తీసికెళ్లడానికి మనిషొచ్చాడు. అరగంటపైనే కాచుకుని కూర్చున్నాడు. ఇప్పుడే, కొద్ది సేపటిక్రితం వెళ్లిపోయాడు''

బంటీ కళ్ళల్లో నీళ్లొచ్చాయి. వాటిని ఎంతో కష్టపడి దిగమింగుకుని, తండ్రివేపు నిస్సహాయంగా చూశాడు.

నాన్న ఒకసారి గడియారంవంక చూశారు. ''అప్పుడే వచ్చి వెళ్లిపోయాడు కూడానా? బాగుంది వరస! గడియారం చూసుకుంటూ కూర్చుంటే పనులవుతాయా? ఆర్డర్ వేసిన టైముకి షికారు పూర్తిచేసుకునివచ్చెయ్యాలన్న మాట. నాన్సెన్స్''

బంటీ కళ్లల్లో నీళ్లు పొంగిపొర్లాయి. తోట మాలి వెళ్లిపోయాడనో, తండ్రి కోపం చూసో వాడికే తెలియదు. రెండురోజుల్నుంచి నాన్న వస్తారని విన్నప్పట్నుంచీ గుండెల్లో నిండిన ఉత్సాహం అంతా ఒకసారిగా ఇంకిపోయింది.

ఎదురుగా వున్న నాన్న ఎవరో అపరిచితుడిలా అనిపించారు.

"అరె, నువ్వెందుకేడుస్తున్నావు? ఏడవడానికి ఇప్పుడేమయిందని?"

"తోటమాలి వెళ్లిపోయాడు, ఇప్పుడు నేను ఇంటికెలా వెళ్లాలి?" అని వెక్కుతూ అన్నాడు.

"పిచ్చీ, నువ్వేమన్నా అడవిలో వున్నావా ఇప్పుడు? లేకపోతే ఒంటరిగా వున్నావా? నేను లేనా ఏం?"

"నేను అమ్మ దగ్గరకెలా వెళ్ళాలి...? మాలి వెళ్లిపోయాడుగా..."

"వెళ్తే వెళ్లాడులే నేనే నిన్ను దింపివస్తాను"

నమ్మలేనట్టుగా తండ్రికేసి చూశాడు బంటీ. తను ఏడుపాపాలని ఇలా అనటంలేదుకదా?

★ ★ ★

నాన్న దగ్గరకొచ్చి తన తలని, చెంపల్నీ నిమిరాక దూరమైన నమ్మకం, విశ్వాసం మళ్ళీ తిరిగి వచ్చినట్టయ్యాయి. నాన్న మళ్ళీ 'తన మనిషి' అనిపించారు.

"పిచ్చినాగన్నా! ఇంత పెద్దవాడివై ఉండీ అమ్మ కావాలీ అని ఏడుస్తున్నావా?" అన్నాడాయన.

నీళ్లునిండిన కళ్లతో ముగ్ధంగా నవ్వాడు వాడు. లోలోపల కొంచెం సిగ్గుపడ్డాడు కూడా

నాన్నతో టాంగాలో కూర్చోగానే బంటీ మనసు తేలికయింది. ఇంక ఏవేవో ఊహలు మొదలయ్యాయి. నాన్నని చూసి అమ్మ ఏమనుకుంటుంది? ఎంతో సంతోషించవచ్చు. నాన్నని లోపలకి లాక్కునివెళ్లాలి. అమ్మ చేతిని నాన్న చేతిలో పెట్టాలి. అప్పుడింక తప్పకుండా కలిసేవుంటారు. తరువాత తను నాన్ననింక వెళ్లనిస్తేగా... అసలు ఆరోజు నాన్నతో అమ్మ సంగతి మాట్లాడాలని ఎన్నిసార్లో అనుకున్నాడు... ఇప్పుడిహ నాన్నని తీసికెళ్లి అమ్మతో కలపాలని తలచుకుంటేనే బంటీ మనసు ఆనందంతో గంతులేస్తోంది.

అదే సంతోషంలో బంటీ నాన్నవేపు తిరిగాడు. నాన్న మౌనంగా కూర్చున్నారు. చీకట్లో ఆయన మొహం సరిగ్గా కనపడటంలేదు. ఆయనేదన్నా మాట్లాడితే బాగుండునని గిజగిజలాడింది వాడి మనసు.

అయినా నాన్న మౌనంగానే వున్నారు.

"ఇదే... ఇదే ఇల్లు, ఎడం పక్కది" బండి కాలేజి దగ్గరకొచ్చి ఆగింది.

బంటీ నాన్నచేతిని గట్టిగా పట్టుకునే కిందకి దిగాడు. ఆయన్ని లాక్కుంటూ తీసికెళ్లినట్టే గేటువరకూ నడిచాడు. ఏమాత్రం వదులుగా పట్టుకున్నా ఆయన పారిపోతారేమో అని భయపడ్డాడు. ఇంకా రోడ్డుమీదుండగానే గట్టిగా అరిచాడు.

"అమ్మా, నాన్నొచ్చారు"

లాన్లో కూర్చున్న అమ్మ లేచి గబగబ వచ్చి గేటు తీసింది. ఎదురుగా వున్న అమ్మని చూడగానే బంటీ ఉత్సాహం మరింత ఎక్కువయింది. నాన్న చేతిని బలంగా లాగుతూ...

"లోపలికి రండి నాన్నగారూ. నా తోట చూపిస్తాను. ఎన్నిపూలు పూశాయో తెలుసా" అంటూ హడావుడి పడుతున్నాడు.

కాని అమ్మ, నాన్న కూడా ఎక్కడివాళ్ళక్కడే మూగవాళ్ళలా, నిశ్చేష్టుల్లా నుంచుండిపోయారు.

"నేను తోటమాలిని పంపించాను. మీరు రావడం ఆలస్యం అయినట్టుంది. వాడు తిరిగి వచ్చేశాడు. మీరు ఇబ్బంది పడాల్సొచ్చింది"

"ఫరవాలేదు" ఆయన గొంతు అదోలా ధ్వనించింది. ఆ గొంతువిని బంటీ ఉలిక్కిపడ్డాడు. ఆ స్వరంలో వున్న తేడా ఏమిటోమరి, బంటి చెయ్యి కొంచెం వదులయింది.

"నాన్నా లోపలిలకి రండి నాన్నా. అమ్మా నువ్వు రమ్మని చెప్పు" బంటి ఏడుపు నిండిన స్వరంతో అడిగాడు.

"కొంచెంసేపు లోపలికొచ్చి కూర్చోండి. పిల్లాడికి కాస్త తృప్తిగా అనిపిస్తుంది..."

నాన్న లోపలకొచ్చారు. లాన్లో వేసిన కుర్చీల్లో ఎదురెదురుగా కూర్చున్నారు. బంటి ఆనంద





పడిపోయాడు. ఏంచెయ్యాలో దారి-తెన్నూ తోచ నంత ఆనందం.

''రేపు పదిగంటలకల్లా వచ్చేసెయ్యి మనది రెండోనంబరు పదిహేను ఇరవైనిమిషాల్లో మన టర్న్ వచ్చేస్తుంది.

''అలాగే వస్తాను''

చీకట్లో వాళ్ళిద్దరి ముఖాలూ కనపడటంలే దు. కాని వాళ్ళ గొంతుల్లో ఎంత మార్పు! అమ్మని ఎక్కడకి రమ్మంటున్నారు. అడిగె య్యనా పోనీ... ఉహూఁ అమ్మ నాన్న మాట్లాడు కుంటుంటే మధ్యలో మాట్లాడకూడదు.

బంటీ మొక్కల దగ్గరకి పరుగెత్తాడు. రాత్రి చెట్లు నిద్రపోతాయి. వాటిని ముట్టుకోకూడదని తెలిసినా వాడూరుకోలేకపోయాడు. నాలుగా కుల మధ్య మూడు మల్లెలు విరిసాయన్న సంగతి వాడు పొద్దున్నే చూశాడు. పొడుగయిన తొడిమతోసహా వాటిని కోశాడు.

''ఎక్కడ పెట్టను? బుష్ షర్టుకి పూవు పెట్టచ్చా?''

నాన్నకి ఎలా మర్యాద చెయ్యాలో వాడికి తెలియలేదు.

''నా చేతికిచ్చెయ్యి'' అంటూ నాన్న లేచా రు.

''ఈ పువ్వు నేను పెంచిన చెట్టుదే, రోజూ ఈ మొక్కకి నేనే నీళ్లు పోస్తాను''

బంటీ మళ్ళీ నాన్న చెయ్యిపట్టుకున్నాడు. నాన్నని పంపించడం వాడికి ఇష్టంలేదు. అమ్మ సాగనంపడానికి కదిలింది. గేటుదాకా వచ్చి నాన్న బంటి తలనిమిరారు. ఒకసారి వీపుమీద తట్టి చెయ్యి విడిపించుకుని వెళ్లి టాంగాలో కూర్చున్నారు. టాంగా బయల్దే రింది.

అమ్మ టాంగా వెళ్ళిన దిక్కునే చూస్తూ నుంచుంది. తరువాత బంటీవేపుకి తిరిగి...

''పద, బట్టలు మార్చుకో''

అమ్మ గొంతు నిర్జీవంగా వుంది.

అమ్మకి కోపం వచ్చిందేమో! పొద్దుట్నుంచి మనసు మనసులో లేకుండా వున్న అమ్మ ముఖం వాడికి మాటిమాటికీ గుర్తొస్తోంది.

కుర్చీమీద పెట్టిన చాక్లెట్ డబ్బీని, పుస్తకా లని తీసుకుని బంటీ మమ్మీతోబాటు లోపలికి నడిచాడు. గదిలో దీపం వెయ్యగానే చూశాడు. అమ్మ కళ్ళు ఎర్రగా వున్నాయి. అంటే అమ్మ ఏడ్చిందన్నమాట. బాగానే ఏడ్చివుండాలి... అది చూసి వాడికీ ఏడుపొచ్చినట్టయింది. తప్పు చేసినట్టుగా ఫీలయ్యాడు. అమ్మని వది లిపెట్టి వెళ్ళకుండా వుండాల్సింది. ఎంత తప్పు చేశాను అనుకున్నాడు.

అమ్మ ఒక్కమాట కూడా మాట్లాడలేదు. మౌనంగా బట్టలు తీసిచ్చింది. బంటీవేపు సరిగ్గా చూడ్డానికి కూడా ఇష్టపడుతున్నట్టులే దు.

కిటికీలోంచి బయటకి చూస్తూ అడిగింది, ''బట్టలు మార్చావా? స్కూలు పుస్తకాలన్నీ ఇప్పుడే సర్దిపెట్టేసుకో, పొద్దున్నే లేవలేకపోతే ఆలస్యం అయిపోతుంది''

''రేపు స్కూలుకి సెలవుకదా?''

ఓహ్! మర్చిపోయాను.

అమ్మ వెంటనే దీపం ఆర్పి వాడిని తీసు కుని లోపలకొచ్చింది. పడకగదిలో బంటీ మంచం. అమ్మ మంచం పక్కపక్కనే వుంటాయి. అయినా వాడు అమ్మ మంచంమీ దే పడుకుంటాడు. అమ్మ వాడికి కథ చెప్తుంది. తరువాత ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటారు. ఆ తరువాత వాడు తన మంచంమీదకెళ్ళి పడు కుంటాడు. ఒక్కోసారి కథ వింటూవింటూ అమ్మ మంచంమీదే నిద్రపోతాడు. తరువాత అమ్మ వాడిని వాడి మంచంమీద పడుకోపెడు తుంది.

ఇవాళ ఎక్కడ పడుకోడమా అని బంటీ ఒక్కక్షణం ఆలోచించాడు. తరువాత తన మంచం ఎక్కి నిద్రపోయాడు. అమ్మ పిలు స్తుందేమోనని ఆశపడ్డాడు. కాని అమ్మమాటే ఆడలేదు.

అమ్మకి బాగా కోపం వచ్చివుంటుంది. వస్తే తనని కోప్పడచ్చుగా. ఇలా మాట్లాడకుండా వుండటంకంటే అదే నయం.

బంటీ అమ్మకీ, నాన్నకీ స్నేహం కలపాలను కున్నాడు. కాని ఇప్పుడు మమ్మీ తన జట్టే పచ్చికొట్టేసింది. వాడికి కళ్లల్లో నీళ్లునిండాయి. అయినా అమ్మకి తనమీద కోపం ఎందుకు రావాలి? ఎందుకు? ఆలోచనల భారంతోనే

రోజంతా తిరిగి తిరిగి అలసిపోయిన బంటీకి కనురెప్పలు వాలిపోయాయి. నిద్రాదేవి వాడిని వశపరచుకుంది. చెంపలమీదకి కారిన కన్నీళ్లు మెల్లగా ఎండిపోయాయి.

పొద్దున్నే పక్షుల కలకలారావంతో మెలకువ వొచ్చింది బంటికి. కళ్లు మూసుకునే పక్కకి దొర్లాడు. నిన్నటి సంఘటనలే వాడి కళ్ల ముందు కదిలాయి. నిన్న నాన్నతో గడిపాడు. ఆ జ్ఞాపకంతోపాటు విషాదంగా వున్న అమ్మ ముఖం కూడా గుర్తొచ్చింది. అవును, అమ్మ ఎందుకలా వుంది? ఒకమాట- మంతీలేదు. నవ్వులేదు. ఏమయివుంటుంది మమ్మీకి.

ముందునాటి జ్ఞాపకాలతో లేచాడివ్వాళ. పక్కకి దొర్లి మెల్లగా కళ్లు సగం తెరచి అమ్మ వంక చూశాడు. మంచం ఖాళీగా వుంది. అంటే అమ్మ అప్పుడే లేచి వెళ్లిపోయిందన్న మాట! వాడు నిశ్చింతగా నిట్టూర్చాడు. లేకపోతే నిద్రలేవగానే అమ్మని ఎదుర్కోవాలంటే ఎంత కష్టంగా వుండేదో. నిన్న నాన్నతో హాయిగా వూరంతా తిరిగొచ్చిన తరువాత ఏదో తప్పుచేసిన భావం వాడినావరించి బాధ పెట్టింది. అమ్మకి తనని పంపడం ఇష్టం లేకపోతే ఒద్దని చెప్పెయ్యాల్సింది. అలా కాకుండా తీరా ఇంటికొచ్చాక అలిగి, ఏడవాల్సినంత అగత్యం ఏముంది?

ఇవాళ కూడా అమ్మ తనతో మాట్లాడకపోతే? అమ్మ మాట్లాడకపోతే ఎలా వుండటం? పరీక్షలు కూడా దగ్గరకి వస్తున్నాయి. పాఠాలెవరు చెబుతారు?

బంటీ నిదానంగా లేచాడు. ఇంటివెనుక పెరట్లోకి తిన్నగా పరుగెత్తుకుని వెళ్ళాడు. అమ్మ పత్రికేదో చదువుతోంది. అటుతిరిగి కూర్చోడంవల్ల మొహం కనపడ్డంలేదు. మంచిదేలే అనుకుని బంటీ మామూలు అలవాటు ప్రకారం వెనుకగావెళ్లి వీపుమీదపడి మెడచుట్టూ చేతులు వేశాడు.

"లేచావ్రుట్రా?" అంటూ అమ్మ వాడిని వెనక్కి జరిపి, "పళ్ళు తోముకుని రా నాన్నా అత్త పాలుకాచి రెడీగా వుంచింది" అంది! అమ్మ గొంతు ఎప్పటిలా మృదువుగా ధ్వనించడంతో బంటికి కాస్త నిశ్చింతగా అనిపించింది. వాడు బాత్‌రూంవేపు పరుగెత్తాడు.

తిరిగి వచ్చేసరికి టేబుల్‌మీద ఒక కప్పు టీ, ఒక కప్పు పాలు సిద్ధంగా వున్నాయి. అమ్మ వాడి ముందుకి పాలకప్పుని జరిపింది,

"మమ్మీ..." ఎంతో ధైర్యం తెచ్చుకుని అన్నాడు.

"ఏంటి...?" పత్రికలోంచి తలెత్తకుండానే అడిగింది.

"నీకు నామీద కోపంగా వుందా అమ్మా!" వాడు ఏడుపు స్వరంతో అడిగాడు.

అమ్మ పత్రికని కిందపెట్టి వాడివేపు చూసింది. ఆమె కళ్ళు, ముఖం అన్నీ కరుణతో మృదువుగా వున్నట్టు అనిపించాయి.

"పిచ్చీ! నీమీద నాకు కోపం వచ్చిందని ఎవరు చెప్పారు?"

ఆమె కళ్ళనిండా ప్రేమ!

ఆ మాటనేసి ఆవిడ మళ్లీ పత్రిక చదువుకోడం మొదలుపెట్టేసింది. ఆమె ముఖం మళ్ళీ ఆలోచనలతో దిగులుగా కనుపించింది.

అమ్మ దిగులుగా వుంటే ఇల్లంతా దిగులుగా అయిపోతుంది. అత్తయ్య కూడా మూగదానిలా అయిపోతుంది.

అమ్మ హీరాలాల్‌ని పిలిచి, "హీరాలాల్ ఇవ్వాళ కాలేజికి రావడానికి కుదరదు. కొంచెం అన్నీ చూసుకోమని మిసెస్ కౌశిక్‌కి చెప్పు" అంది.

"అలాగే అమ్మగారూ" అంటూ హీరాలాల్ సలాంకొట్టి వెళ్లిపోయాడు.

అమ్మ బయటకి వెళ్లడానికి తయారవుతూ వుండటం చూసి బంటీ అడిగాడు, "మమ్మీ ఎక్కడకి వెళ్తున్నావు? కుంకుమ పెట్టుకుంటున్న అమ్మ చెయ్యి ఒక్కక్షణం అక్కడే ఆగింది. కనుబొమ్మలు ముడివడ్డాయి. ముఖం అప్రసన్నంగా అయింది. తరువాత మెల్లగా అంది.

"కొంచెం పనుంది"

పదిగంటలకల్లా వచ్చెయ్యమని నాన్న అమ్మతో చెప్పారుకదా! అంటే ఎక్కడకి? అమ్మ నాన్న దగ్గరకి వెళ్ళేటట్టయితే తననీ తీసుకువెళ్ళచ్చుకదా?

"నాన్న దగ్గరకెళ్తున్నావా మమ్మీ?"




అమ్మ మళ్ళీ ఒకక్షణం ఆగింది. తరువాత కొంచెం కర్కశంగా అంది, "చెప్పానుకదా, కొంచెం పనుందని"

తనని తీసికెళ్ళకపోతే పోనీలే, కాని ఈ అబద్ధాలెందుకు చెప్పాలి?

పొద్దున్న లేచినప్పట్నుంచి కాస్త భయం, మరికాస్త తప్పుచేసిన భావం ఇలాంటి మిశ్రిత భావాలు నిండిన మనసులో క్రమంగా కోపం చోటు చేసుకోసాగింది. ఎవరూ ఏం చెప్పక పోతే...! పోనీలే నాకేం... నేనూ ఎవర్నీ ఏమీ అడగను. పరీక్షలయ్యాక ఎలా రాశానో నేనూ చెప్పను. అప్పుడు బుద్ధొస్తుంది. వీళ్ళకి... అను కున్నాడు.

అత్తయ్యతో ఏవో చెప్పి అమ్మ వెళ్ళిపో యింది. బంటీ ఆమెవేపు చూడనుకూడా చూ డలేదు. వెళ్ళేముందు తననోసారి దగ్గరకి పిలుస్తుందని ఎదురుచూశాడు. కాని అమ్మ తనతో ఒక్కమాటయినా అనకుండా వెళ్ళి టాంగా ఎక్కి కూర్చుని వెళ్ళిపోయింది.

బుసలు కొడుతూ వెళ్ళి అత్తయ్యనడిగాడు.

"అత్తయ్యా అమ్మెక్కడికెళ్లింది"

"ఏట్లో దూకిచావడానికి..."

బంటీ ఆ జవాబుకి తెల్లబోయాడు.

"ఏమంటున్నావత్తయ్యా?!"

"బంటీ, కాసేపవతలకిపో నువ్వు. నాకసలే ఒళ్లుమండిపోతోంది. కట్టుకున్న పెళ్ళాన్ని కోర్టు కీడవడమే ఈ మొగాళ్ళ బుద్ధి. కలిసుండి కాపురం చక్కదిద్దుకోడం చేతకాకపోతే ఇంతక న్న ఏం చేస్తారులే. ఏదో మాటా మాటా వచ్చి నంతమాత్రాన! ఆమాత్రం పొరపొచ్చాలు ఎవ రికి రాకుండా వుంటాయి? అంతమాత్రానికి తాళికట్టిన భార్యని ఒదిలేస్తారా ఏం? ఏం మగాళ్ళో!"

"ఏంటత్తయ్యా! అమ్మెక్కడికెళ్ళిందని అడి గితే వటవటమని ఏదోదే మాట్లాడుతావేంటి?"

"నాకేం తెలుసు? నువ్వే అడగాల్సింది. ఊరికే ప్రాణం విసిగించక అవతలకి పోరా దూ? లేకపోతే నా నోటివెంట ఏమేం మాటలు వస్తాయో"

"చెప్పకపోతే ఫో, ఎవరూ ఏమీ చెప్పక్కర్లే దులే" కోపంగా అని బుసలుగొడుతూ తన గదిలోకి వెళ్లిపోయాడు బంటీ.

'తాళికట్టిన భార్యని' అన్నంతవరకు అర్థ మయింది వాడికి. కాని కోర్టు-గీర్టు ఏమిటి? ఒకసారి వకీలుబాబాయి అన్నమాటలు వాడికి గుర్తొచ్చాయి. ఇదంతా వకీలు బాబాయి చేసిన వ్యవహారమే. ఈ వకీళ్ళంతా ఇంతే. కోర్టులో పోలీసులు అమ్మనేమన్నా బాధపెడితే? అక్కడే వుంచేసుకుంటే ఈ ఊహతోటే వాడి ఒళ్ళంతా వణికిపోయింది.

"బంటీ రావయ్యా, వచ్చి టిఫిన్ తిను" అత్తయ్య గొంతువిని-

"అరె! ఈ అత్తయ్య కూడా ఏడ్చినట్టుందే! బాగుంది. అంతా ఏడుస్తూ కూర్చుంటారు, నాకు మాత్రం చెప్పరు. ఇంతకీ ఆ 'మగాడె'వ రు?"

టేబుల్‌మీద పాలు, పప్పు, యాపిల్‌ముక్క లు వున్నాయి. అది చూడగానే వాడికి మళ్ళీ తిక్కరేగింది. మళ్ళీ పాలు, పప్పు! రోజూ నాకిది వద్దని చెప్పలేదా? అంటూ బంటీ పళ్ళాన్ని విసిరికొట్టాడు. అవన్నీ ఇల్లంతా విరజిమ్మినట్టు పడ్డాయి.

"విసిరెయ్యి, ఇంట్లోవున్న సామానంతా విసిరికొట్టు. నువ్వేమన్నా తక్కువ తిన్నావా? మీ అమ్మేమో ప్రాణాలన్నీ నీమీదే పెట్టుకుని బ్రతుకుతోంది. నువ్వు చూస్తే ఇలా... ఆవిడ రానీ చెప్తాను! అంతవరకు ఇవన్నీ ఇలాగే పడుండనీ. ఇప్పుడే ఇలా వున్నావు, ఇంక పెద్దవాడివయితే మీ అమ్మని బాగానే చూసు కుంటావులే..."

బంటీ తన తుపాకీ పట్టుకుని తోటలోకి పరుగెట్టాడు. ఠాంయ్.. ఠాం...య్ అంటూ తుపా కీని పేల్చసాగాడు. ఆ చప్పుడుకి చెట్లమీదున్న పక్షులన్నీ ఎగిరిపోయాయి.

★ ★ ★

గదిలో ఒక మూల అమ్మ నుంచుంది. మరో పక్క బంటీ, మధ్యలో అత్తయ్య.

పొద్దున్నే వాడు పారేసిన పాలు, పప్పు, ఏపిల్‌ముక్కలు... ఒకపక్కన ప్లేటు, కప్పు బోర్లా పడున్నాయి.

"బంటీ!"

బంటి నేలచూపులు చూస్తూ బిక్కమొహం పెట్టి రాయిలా నుంచున్నాడు.

''బంటీ...'' అమ్మ గొంతు తీవ్రంగా లేదు.

బంటీ కదల్లేదు. అమ్మ వాడి దగ్గరకొచ్చింది. వచ్చినవెంటనే లాగి లెంపకాయ యిస్తుందని అనుకున్నాడు. అమ్మ కోపాన్నుంచి తనని సదా రక్షించే అత్తయ్య ఇవాళ తనమీద చాడీలు చెప్పిందంటే ఇంక తన్నులు తప్పవుకదా!

బంటీ ఇంకా మౌనంగానే వున్నాడు.

''నా మాట నీకు వినిపిస్తోందా కన్నా'' అమ్మ చెయ్యి బంటీ వీపుని నవరించింది. అనుకోకుండా దొరికిన ఈ సాన్నిహిత్యంతో వాడు కరగిపోయాడు. ఇంతసేపట్నుంచీ వాడి హృదయంలో కరడుగట్టిన కోపం, దుఃఖం అన్నీ కరిగి కన్నీరయ్యాయి.

''రోజూ ఈ పాలు, పళ్ళూ, పప్పు అంటే నేను తినలేను. అంతేకాకుండా అత్తయ్య ఏవేవో పిచ్చిమాటలన్నీ మాట్లాడుతోంది. అంత అసహ్యంగా మాట్లాడినా నువ్వు అత్తనేమీ అనవు'' బంటీ ఏడుపుగొంతుతో అన్నాడు.

అమ్మ ప్రేమగా వాడిని దగ్గరకి లాక్కుంది. బంటీ ఏడుస్తూనే వున్నాడు.

''నిన్ననే వాడు నాకు పాలు, పప్పు ఇష్టంలేదని చెప్పాడుకదా, మళ్ళీ అవే ఎందుకు వేశావు అత్తా?''

''వీడినంత తలకెక్కించుకోకండమ్మా. ఇప్పుడే చెప్తున్నాను తరువాత బాధలు పడాల్సొస్తుందంతే''

''చూశావా మమ్మీ! నువ్వెళ్ళినప్పట్నుంచీ ఇలా తిడుతూనే వుంది''

అమ్మ వాడి కళ్ళు తుడిచింది. అమ్మ వచ్చాక మొదటిసారి ఆవిడని సరిగ్గా పరిశీలించి చూశాడు. మమ్మీ కోర్టుకి వెళ్ళొచ్చిన సంగతి చటుక్కున గుర్తొచ్చింది. అక్కడేమయిందో! తను తప్పుచేస్తున్నా ముద్దుచేసే అమ్మని చూస్తే బంటికి ప్రేమ పొంగిపొరలింది.

అమ్మ చాలా అశాంతిగా, దుఃఖంతో కనపడింది. ఆవిడ బాత్రూంకి వెళ్తే వాడు గదిలోకి వెళ్ళాడు.

అమ్మ తలస్నానం చేసొచ్చినట్టుంది. తీరువగా జడ అల్లుకుంది.

''బయట చాలా ఉక్కగా వుందిబాబూ'' అనుకుంటూ మంచంమీద వాలింది. చేతులు రెండూ కళ్ళమీద పెట్టుకుని పడుకుంది.

ఎందుకో నిన్నట్నుంచీ అమ్మ చాలా దిగులుగా వుంది. అమ్మకి తను ఏం చేయగలడు? ఏం చెయ్యాలో తోచటంలేదు.

అవును, అమ్మకి షరబత్ చేసిస్తే! వెంటనే వంటింట్లోకి పరిగెత్తాడు. అత్తయ్యకేం చెప్పకూడదు. పొద్దుట్నుంచీ దెయ్యం పట్టినట్టు ఆడుతోంది... తనే అంతా చేసుకెళ్ళాలి. చాలా ఉత్సాహంగా స్టూలెక్కి పంచదార డబ్బా తీసుకున్నాడు. నిమ్మకాయ కోసుకున్నాడు. థర్మాస్‌లో వున్న ఐస్ముక్కలు వేసుకున్నాడు. షరబత్ సిద్ధమైంది. అత్తయ్య మింగేసేలా వాడినే చూస్తోంది.

''మమ్మీ'' తియ్యని గొంతుతో మధురంగా పిలిచాడు.

అమ్మ మౌనంగా పడుకుంది. నిద్రపోయిందా ఏమిటి?

''మమ్మీ, ఈ షర్బత్ తాగు. నేనే చేసుకొచ్చాను'' అమ్మ కళ్ళమీద చేతుల్ని తొలగించాడు.

''మమ్మీ! ఈ షర్బత్ తాగు మమ్మీ'' బలవంతం చేశాడు. అమ్మ లేచి కూర్చుంది. వాడి చేతిలోవున్న గ్లాసు తీసుకుని ''మమ్మీకోసం షర్బత్ చేసుకొచ్చావా రాజాబేటా'' అని గ్లాసులోవున్న షర్బత్ తాగేసి గ్లాసు కిందపెట్టింది. బంటీని దగ్గరకి లాక్కుని రెండు బుగ్గలకీ ముద్దులు పెట్టింది. బంటీ మనసు తేలికయింది. తనని ఆమె పక్కన పడుకోపెట్టుకుని జరిగిందంతా చెబుతుందని ఎదురుచూశాడు.

కాని అమ్మ - ''నీకు యిష్టమయినదేదో అత్తయ్యచేత చేయించుకుని భోంచెయ్యి నాన్నా నేను కొంచెంసేపు పడుకుంటాను'' అనేసి పడుకుంది.

బంటీ కాసేపు అక్కడే నుంచున్నాడు. అవమానితుడిలా... తిరస్కృతుడిలా... ఏమయిందో అమ్మ తనకెందుకు చెప్పదు?

రాత్రి కాళ్ళు, చేతులు కడుక్కుని, నైట్




సూట్ వేసుకుని, అసలు మారాం చేయకుండా ఒక్కసారైనా వద్దనకుండా పాలుతాగేసి బంగారుతండ్రిలా వాడు అమ్మదగ్గరకెళ్ళాడు. అయినా అమ్మ, 'రా, నా దగ్గర పడుకో అని వాడిని పిలవలేదు. కొంచెంసేపు ఊరికే నుంచున్నాడు. తరువాత అమ్మ పిలవకపోతే నేంలే అని వెళ్ళి మంచంమీద ఆమె పక్కనే పడుకున్నాడు. అమ్మ గడ్డంమీదున్న పుట్టుమచ్చని తాకాలనిపించింది. కాని అలా చెయ్యకుండా ఆమె ముఖాన్నే చూస్తూ పడుకున్నాడు.

"బంటీ" అని అమ్మ వాడివేపు తిరిగి వాడు జుట్టులో వేళ్ళతో నిమరసాగింది.

"మీ నాన్నతో ఏం మాట్లాడావు కన్నా?"

క్రితంరోజు జరిగిన మాటల్లో ఏది చెప్పాలి, ఏది చెప్పకూడదు అని ఒకక్షణం ఆలోచించాడు.

"ఏమీ లేదు. ముందు నా చదువుగురించి, ఆటలగురించి ఏవేవే అడిగారు. తరువాత షికారు తీసుకెళ్ళి తిప్పి తీసుకొచ్చారు. బొమ్మలు, తినడానికి ఏవేవో ఇప్పించారు... అంతేమమ్మీ" ఇందులో మమ్మీకి కోపం వచ్చేలాంటి విషయాలేమీ లేవని స్పష్టపరుస్తున్నట్టుగా చెప్పాడు.

"నీ దగ్గర మీ నాన్న ఏమేం మాట్లాడారు?"

"అదే... చెప్పాగా... స్కూలు గురించి, ఫ్రెండ్స్ గురించీ, కలకత్తా గురించీ... ఏవేవో..." అంటూండగా బంటీకి చటుక్కున గుర్తొచ్చింది. "ఆఁ... 'ఈసారి శలవుల్లో కలకత్తా వస్తావా?' అన్నారు. 'ఊరంతా తిప్పి చూపిస్తా. శలవులవగానే మళ్ళీ తీసుకొచ్చి దింపేస్తా'నన్నారు"

అమ్మకి తన మాటల్లో కుతూహలం పుట్టిందన్న సంగతి ఆవిడ ముఖంచూసి గ్రహించాడు.

"సరే, అందుకు నువ్వేం చెప్పావు?"

"ఏం చేప్తాను. రాను అని చెప్పాను. మమ్మీ లేకుండా నేనెక్కడికీ రాను అని చేప్పేశాను"

బంటీకి ఉత్సాహం ఎక్కువైపోయింది. నాన్నని చూడ్డానికి వెళ్ళినా వాడు అమ్మనొదిలేసి వెళ్ళిపోడు. తనెంతయినా అమ్మకొడుకే అన్న సంగతి ఇవాళ ఆవిడకి అర్థమయ్యేలా చెప్పాలి - అనుకున్నాడు.

"మంచిపని చేశావు" అందావిడ.

"నేనెందుకెళ్తాను? నిన్నొదిలి నేనెక్కడికీ వెళ్ళను"

"బంటీ నువ్వెప్పటికీ నాతోనే వుందువుగాని" అంటూ అమ్మ వాడి తల నిమరసాగింది.

నాన్న తననెక్కడికి తీసికెళ్ళిపోతారో అనే భయం వుండి వుంటుంది అమ్మకి. అందుకే నిన్నట్నుంచీ కోపంగా వుంది. అయినా నాన్న తననిప్పుడు ఎందుకు తీసుకెళ్తారు? తను మొదట్నుంచీ అమ్మదగ్గరేగా వున్నాడు! ఈ అమ్మ-నాన్నల తగువు తమాషాగా వుందే!

ఎంతయినా తను అమ్మకొడుకు. నాన్నని చూస్తే తనకిష్టమేగాని, అయినా నాన్న తననెందుకు తీసికెళ్ళాలి? తను రానని చెప్పినందుకు ఆయనేం కోపం తెచ్చుకోలేదు. మాట్లాడకుండా ఇంటికి తీసుకొచ్చి దింపేసి వెళ్ళిపోయారు. ఇంటికొచ్చినప్పుడు కూడా వీళ్ళిద్దరూ ఏమీ దెబ్బలాడుకోలేదు.

ఇవాళ పొద్దున్నే చూసినప్పుడు నాన్న అమ్మతో ఏమన్నా అన్నారేమో. ఒకసారి అమ్మ వేపు చూశాడు వాడు. తరువాత ధైర్యం తెచ్చుకుని ప్రశ్నించాడు.

"మమ్మీ! ఇవాళ పొద్దున్న నువ్వు నాన్నదగ్గరకి వెళ్ళావుకదా, అక్కడేమయింది?"

"అవడానికింకేం మిగిలింది నాన్నా! నువ్వు ఇకమీదట నా కొడుకువి మాత్రమే. నాన్న సంగతి మర్చిపో"

అమ్మ గొంతు వణుకుతోంది. తరువాత ఒక్కమాట కూడా మాట్లాడలేదు.

అమ్మ స్వరంలో కలిసిన ఏడుపు, నీళ్ళు నిండిన ఆమె కళ్ళు బంటీ అంతరంగాన్ని కలచివేశాయి. మమ్మీపట్ల ప్రేమ, ఆమె దుఃఖంలో భాగం పంచుకోవాలనే తపన ఉన్నప్పటికి నాన్నని మర్చిపోడం ఎలా? నాన్నంటే వాడికి చాలా ఇష్టం.

ఉన్నట్టుండి అమ్మ వెక్కివెక్కి ఏడవడం మొదలెట్టింది. తలగడలో ముఖం దూర్చి ఏడవసాగింది. పొద్దుట్నుంచీ తట్టుకున్న దుఃఖమంతా కట్టలు తెంచుకుని ప్రవ

హించింది. బంటీ తికమకపడ్డాడు. మమ్మీ ఏడవడాన్ని ఎన్నిసార్లో చూశాడు. కాని వాడి ముందు ఆమె ఎప్పుడూ ఇలా ఏడవలేదు.

బంటీకి ఏం చెయ్యాలో తోచలేదు. మమ్మీని ఎలా ఓదార్చాలో తెలియలేదు. ఏం చెయ్యాలో, ఎలా ఓదార్చాలో తెలీక గిజగిజలాడిపోయాడు. చివరికి మమ్మీ మెడచుట్టూ చేతులు వేసి వాటేసుకుని తనూ వెక్కివెక్కి ఏడవసాగాడు. మధ్యలో ఏడవకమ్మా... ఏడవకమ్మా... అంటూ గొణిగాడు.



మమ్మీ పరిస్థితి బంటీని ఒక్కసారిగా పెద్దవాడిని చేసేసింది. దానితోపాటు బుద్ధిమంతుడు కూడా అయ్యాడు. అమ్మనాన్నలకి తగువయింది. ఇంక వారిమధ్య స్నేహం కుదిరే అవకాశమే లేదు. అందువల్ల బంటీయే అమ్మకి సర్వస్వం.

దానితో అమ్మకి ఏకైక ఆధారమైన వాడు తనే అనే భావం వాడిమీద పెద్ద కొండలా కూర్చుంది. ఇప్పుడు తాను అమ్మనెప్పుడూ ప్రసన్నంగా వుండేలా చూసుకోవాలి. అన్నిపనుల్లోనూ సాయం చెయ్యాలి. ఆమెని బాధపెట్టే పనులేమీ చెయ్యకూడదు. ఇవన్నీ ఎలాగోలా చెయ్యచ్చుగాని, నాన్నని మర్చిపోడం అనేదిమటుకు అసాధ్యం. మాటిమాటికి ఆయన జ్ఞాపకం వస్తూనే వుంటాడు. మమ్మీకి నచ్చదేమోనని ఆయన తెచ్చిపెట్టిన బొమ్మల్తో ఆడుకోడం మానేశాడు. ర్యాక్‌మీదుండిన ఒకే ఒక్క నాన్న ఫొటో తన ఆటవస్తువులుండే బీరువాలో దాచిపెట్టేశాడు. అమ్మని ఏడిపించినందుకు, బాధపెట్టినందుకు, కోపం తెప్పించినందుకు ఇదే సరి అయిన శిక్ష ఆయనకి అనుకున్నాడు. అలా ఫొటో లోపల పెట్టేసి అమ్మకి తృప్తికలిగించి వుంటాననుకున్నాడు వాడు.

ఖాళీ రాక్‌ని చూసి అమ్మ బంటీకేసి రెప్పవాల్చకుండా చూసింది. ఆవిడకి ఒకటే ఆశ్చర్యం! బంటీ తలవంచుకుని నుంచున్నాడు. తరువాత వాడిని దగ్గరకి లాక్కుని ముద్దుచేసింది. మృదువుగా నవ్వింది కూడా. వాడి తెలివికి మెప్పుదలగా నవ్విందేమో అనుకున్నాడు. కాని ఆ కళ్ళలో మెప్పులేదు. ఆ కళ్ళలో నవ్వులేదు. మొదటికంటే మరింత ఉదాసీనమయ్యాయి. ఒకక్షణం తను చేసిన పని తప్పో, ఒప్పో వాడికే తెలియలేదు. ఫొటోనలా తీసెయ్యడంవల్ల అమ్మకి సంతోషం కలిగిందో దుఃఖం కలిగిందో వాడికి అర్థంకాలేదు. ఎందుకంటే ఆవిడ పెదవులు నవ్వుతున్నాయి. కళ్ళు వాడిపోయి వున్నాయి.

ఫరవాలేదు మెల్లగా వాడే అన్నీ అర్థం చేసుకుంటాడు. ఇప్పుడు అర్థం చేసుకున్నదే మీ తక్కువకాదు!

ఉత్తరం రాయమని చెప్పారు నాన్న. రాస్తానని ఒప్పుకున్నాడు తను. కాని అమ్మకి నాన్నకి మధ్య ఇంత పెద్ద దెబ్బలాటయిందని తనకి తెలియదు. అది తెలిశాక కూడా ఇంక ఉత్తరం రాయడం ఎలా? కాని అమ్మ లేనప్పుడు అప్పుడప్పుడు నాన్న ఎడ్రస్ రాసిపెట్టుకున్న కవర్‌కేసే చూసేవాడు. ఇప్పుడైతే వాడికి నాన్న అడ్రస్ కంఠస్థం అయిపోయింది. 8.ఎ, ఎల్గిన్ రోడ్. అడ్రస్‌తోపాటు నాన్న వర్ణించిన కలకత్తా చిత్రం కూడా కళ్ళముందు కదిలేది. హౌరా బ్రిడ్జి, జూ, బొటానికల్ గార్డెన్, పెద్ద రావిచెట్టు, పి.సి.సర్కార్ ఇంద్రజాలం... కాని ఇవన్నీ అణగారిపోయేలా విచక్షణ వచ్చి అడ్డునిలుస్తోంది... ఊహూ... తను ఇవన్నీ ఆలోచించనే కూడదు అని మనసులోనే ప్రతిజ్ఞ చేసుకున్నాడు.

వాడంత బుద్ధిమంతుడిలా వుండడంవల్లనో ఏమో అమ్మ కూడా ఇదివరకటిలా ఉదాసీనంగా వుండటంలేదు. పెద్దవాడయ్యాక తనింక బుద్ధిమంతుడైపోతాడు. అప్పుడు అమ్మ ఇంకా ఆనందంగా వుంటుంది. ఈమ




ధ్య ఆమె సాయంకాలాలు కాసేపు బయటకి వెళ్ళొస్తోంది. అప్పుడు వాడేమీ పేచీ పెట్టడు. అప్పుడు అమ్మే వాడిని,

''బంటీ, ఏం చీర కట్టుకోను?'' అని పెద్దవాళ్ళని అడిగినట్టడుగుతుంది. అప్పుడు వాడు చీరలన్నీ తడిమి తనకిష్టమయిన ఒక చీరని తీసిస్తాడు. ఆవిడ ఆ చీరే కట్టుకుని బయటకొచ్చిందంటే వాడికి తనపట్ల తనకే ఎంతో గర్వం. మమ్మీకి సాయం చేశానన్న సంతోషంతో పొంగిపోయేవాడు.

మమ్మీపక్కన పడుకుని ఆకాశంవంక చూస్తూ కాలం గడుపుతాడు. ఆకాశంలో నక్షత్రాలు మెరిసిపోతుంటాయి. సప్తర్షిమండలం, పాల పుంత, ఆఁ... ధ్రువనక్షత్రం... ధ్రువనక్షత్రం చూపించి మమ్మీ ధ్రువుడి కథ చెప్పింది.

ఐదేళ్ళబాబు తపస్సు చేశాడట. ఎంత శ్రద్ధగా తపస్సు చేశాడంటే, దేవుడు ప్రత్యక్షం అయ్యాడట. బంటీ మమ్మీని అడిగాడు...

''మమ్మీ! తపస్సంటే ఏమిటి?''

''ఎందుకు?''

''చెప్పు మమ్మీ''

''మనసుని అధీనంలో వుంచుకోడమే తపస్సు''

''అంత చిన్నబాబు, ధ్రువుడు అడవుల్లోకి వెళ్ళి తపస్సు చేశాడా?''

''చేసుండొచ్చు'' అనేసి ఇక మాటలు పెంచడం ఇష్టంలేనట్టుగా దిండులో ముఖం దాచుకుంది.

మనసుని అదుపులో వుంచుకోడమే తపస్సట! అయితే ఈమధ్య తను మనసునెంతగా బిగపట్టుకున్నాడు! అయితే అదే తపస్సా?

''మమ్మీ'' మెల్లగా పిలిచాడు.

''ఊఁ...''

''తపస్సు చేస్తే అమ్మ-నాన్నల తగువు తీరిపోయి వాళ్ళు కలిసి వుండటానికి వీలవుతుందా?''

అమ్మ చివాల్న తల ఎత్తింది. ఒక్కక్షణం వాడి ముఖంలోకే చూసింది. ఆ తరువాత వాడిని తన బాహువుల్లో ఇముడ్చుకుంది.

బంటీ ఆలోచించాడు. నాన్న పేరెత్తి తనేమీ తప్పు చెయ్యలేదుకదా!

''బంటీ! నీకు నాన్నతో వుండాలనిపిస్తోందా?''

''లేదుమమ్మీ నాకేం నాన్నదగ్గరకి వెళ్ళాలని లేదు''

''నాన్నే ఇక్కడుండాలని అనిపిస్తుందా బంటీ?''

ఒకక్షణం బంటీ మనసు సందిగ్ధంలో ఊగిసలాడింది. 'ఊఁ' అంటే అమ్మకి కోపం రావచ్చు. అబద్ధం చెబితే తపస్సు చెడిపోతుంది కదా, అందుకే మెల్లగా ''ఊఁ'' అన్నాడు.

మమ్మీ ఎంతోసేపు వాడి జుట్టులో వేళ్ళు జొనిపి నిమురుతూనేవుంది. 'నీకు నాన్న ఎలాగో అలా దొరుకుతారు' అనే హామీ ఇస్తున్నట్టో... లేకపోతే 'నాన్న నీకింక దొరకరురా' అని ఓదారుస్తున్నట్టో తెలీదు.

ఆరోజు మమ్మీకి కాలేజి మొదలైంది. చాలా సంతోషంగా కాలేజీకి వెళ్ళింది. ఆవిడ మొహంలో దిగులంతా మాయమయింది. శలవుల్లో బంటీ రోజంతా అమ్మతోనే గడిపేవాడు. వాడి స్కూలు తెరవడానికి ఇంకా నాలుగు రోజులున్నాయి.

కాలేజికి వెళ్ళేముందు అమ్మ ''నాలుగు గంటలకల్లా అంతా టీకి వస్తారు. పెరుగుగారెలు, బజ్జీలు చేసివుంచు. స్వీట్ బజార్నుంచి తెప్పిస్తాను. నాలుగ్గంటలకన్నీ రెడీగా వుండాలి'' అంది అత్తయ్యతో.

''నేనన్నీ చూసుకుంటాలే అమ్మా. నువ్వు వెళ్ళు. నేను అత్తయ్యకి సాయంచేస్తాలే''

''ఎంతయినా నువ్వు నా రాజాబేటావికదా!'' అని ముద్దుగా వాడి బుగ్గమీద తట్టి అమ్మ వెళ్ళిపోయింది.

''నీకేం సాయం చెయ్యమంటావత్తయ్యా?''

''బాగుంది, ఇప్పట్నుంచీ ఏం చెయ్యాలి. నువ్వెళ్ళి ఆడుకో, ముందు నేను ఇల్లు శుభ్రం చేస్తాను''

ఇవాళ మమ్మీ టీచర్స్‌కి పార్టీ వుంది. ఇవాళ చాలా పని చెయ్యాలనే ఉద్దేశంతో ఇల్లు సర్దడానికి అత్తయ్యకి సాయం చేశాడు. అత్తయ్యంది కూడా - ''ఈమధ్య నువ్వు మరీ బంగారు

తంత్రివయిపోయావే. మునుపటిలా తగువులాడవు. మొండితనం మానేశావు. ఇంత బుద్ధి అసలెలా వచ్చింది''

''ఎందుకు రాకూడదు. నేనేమన్నా చిన్న పాపాయినా?''

తన మంచిగుణం గురించి అత్తయ్య పొగడ్తల్ని విని వాడు మనసులోనే మురిసిపోయాడు.

అటు, ఇటు తిరిగి బంటీ టేబుల్స్ అవీ సర్దాడు. తరువాత గుమ్మంలో నుంచుని తల్లి రాకకోసం ఎదురుచూడసాగాడు. కాలేజీ లెక్చరర్లందర్నీ వెంటపెట్టుకుని అమ్మ నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూ వచ్చింది.

''హలో బంటీ హౌఆర్‌యూ?'' అంటూ అనేక స్వరాలు ఒక్కసారిగా పలుకరించాయి.

''కొంచెం పొడుగయినట్టున్నాడే'' అన్నారెవరో.

''కాదు, పెద్దవాడినయ్యాను''

అందరికంటే వెనుకగా దీపా ఆంటీ వుంది. అవకాశం దొరగ్గానే బంటీ ఆవిడ చేతులు గట్టిగా పట్టేసుకున్నాడు. మిగతావాళ్ళందరి కంటే వాడికి దీపా ఆంటీ అంటే ఎక్కువ ఇష్టం.

''శలవుల్లో ఒక్కసారయినా మా ఇంటికెందుకు రాలేదాంటీ?''

''శలవుల్లో నేనీ వూళ్ళోనే లేను. ఎలా రాను?''

తను వేసిన మొక్కల్ని చూపించాలని ఆవిడని తోటలోకి లాక్కెళ్ళాడు.

''మీరే వూరెళ్ళారు ఆంటీ?''

''కలకత్తా''

''కలకత్తానా?'' బంటీ ఒక్కక్షణం మురిసిపోయాడు. ''కలకత్తాలో ఏమేం చూశారు ఆంటీ? ఎలావుంది కలకత్తా?''

''చాలా పెద్దది. కాని చాలా మురికిగా వుంటుంది ఆ ఊరు''

''అక్కడ మీరు ఎల్గిన్ రోడ్ చూశారా?''

''లేదే!?''

''ఎల్గిన్ రోడ్డే చూడలేదా?''

''నేనేమన్నా అక్కడ వీధులు చూడ్డానికి వెళ్ళానా. ఏముందా వీధిలో?''

''ఏంలేదు. ఊరికే అడిగాను''

నాన్న సంగతెవరికీ చెప్పడు వాడు. వాడికిప్పుడు అన్నీ తెలుస్తున్నాయి.

దీప లోపలకి వెళ్ళబోయింది. వెంటనే వాడు రెండు మల్లెపూలున్న రెమ్మని కోసి అన్నాడు, ''కిందకి వంగండి ఆంటీ తలలో పెడతాను''

నవ్వుతూ వంగి ''పెట్టడం వచ్చా?'' అనడిగింది దీప.

''ఓ! ఎందుకు రాదు? మా అమ్మకి రోజా పూలు నేనే పెడతాగా? ఈ మొక్కలన్నీ నేనే పెంచాను తెలుసా?'' తన మొక్కల గురించి ఎవరికన్నా చెప్పుకోడం వాడికి చాలా ఇష్టం. గర్వంకూడా.

అబ్బ! ఈ ఆడవాళ్ళు ఎంత మాట్లాడతారు బాబూ! బంటీకి తన స్కూల్లో మాస్టారు కోప్పడుతూండటం గుర్తొచ్చింది. ''ఇదేమిటి? చేపల బజారనుకుంటున్నారా? ఎంత గోల చేస్తున్నారు?'' అని.

బంటీ చేపల బజారెప్పుడూ చూడలేదు. బహుశః చాలా గోలగా వుండే చోటయ్యుంటుంది అది. లెక్చరర్ల మాటలు బంటీ వేపు తిరిగాయి.

''బంటీ ఈమధ్య చాలా బుద్ధిమంతుడైపోయాడే''

''ఎంత బాగా పనిచేస్తాడో చూడండి!''

''మా పింకీ ఆడపిల్లయినా దానిచేత ఒక్క పనీ చేయించలేం. ఒక మాటకి పది జవాబులు చెప్తుంది''

''బంటీ ఎవరికొడుకంటారు? అందుకే అంత తెలివి''

అంతా అమ్మకి మస్కా కొట్టడానికే! వీళ్ళు నిజంగా తనని పొగట్టంలేదు. మమ్మీకి వెన్న పూస్తున్నారు. తనకంతమాత్రం తెలీదా ఏమిటి? వీళ్ళందర్లోకీ దీపా ఆంటీ ఒక్కతే మంచిది. అతిగా పొగడదు. వెనక్కి తిరగ్గానే తిట్టదు. అనుకున్నాడు బంటీ.

టిఫిన్, టీ పూర్తయ్యాక అంతా హాల్లోకి




వెళ్ళారు. బంటీ దీపా ఆంటీని ఆనుకునే కూర్చున్నాడు. అమ్మ ర్యాక్‌లోంచి ఓ ఫైల్‌ని తీసి అందులోని పేపర్లన్నీ టేబుల్‌మీద పర చింది.

''దీపా ఆంటీ ఒక పాట పాడరా?''

''చూడు బాబూ ఇప్పుడు మమ్మీ మీటింగ్ కండక్ట్ చేస్తారు. తెలిసిందా?''

''అమ్మా, దీపా ఆంటీని పాట పాడమను అమ్మా'' అన్నాడు.

''బంటీ... మాకిప్పుడు కొంచెం కాలేజ్ పని వుంది. నువ్వు బయటికెళ్ళి ఆడుకోపో'' అంది.

అమ్మ మాటలవల్ల బంటీ మనసుకి దెబ్బ తగిలింది. తనని బయటకి వెళ్ళమని అమ్మే చెప్పడం వాడికి అవమానంగా అనిపించింది. తరువాత వాడు మెల్లగా లేచి, అవమానితుడిలా తలవంచుకుని బయటకి వచ్చేశాడు. కాలేజీ పనిని కాలేజిలోనే పూర్తిచేసేసి రావాలబ్బా. ఈ అమ్మ ఇంట్లోనయినా తన మాటప్రకారం చెయ్యొచ్చుగా. దీపా ఆంటీ వస్తే ఆవిడతో ఎంతో మాట్లాడాలనుకున్నాడు. ఆవిడచేత పాట పాడించి వినాలని పొద్దుట్నుంచీ ప్లాన్ వేసుకున్నాడు. అమ్మ ఇలా చెయ్యకుండా వుంటే బాగుండేది. వాడికి అమ్మమీద చెప్పలేనంత కోపం వచ్చింది. అంతలో వివేకం వాడిని హెచ్చరించింది. అవును, అమ్మ ఎంతయినా ప్రిన్సిపాల్, బోలెడు పనులుంటాయి. అమ్మమీద నేను కోపం తెచ్చుకోకూడదు... అని సర్దుకున్నాడు.

అందర్నీ పంపించేసి అమ్మ హడావుడిగా టవల్ తీసుకుని బాత్‌రూంలోకి వెళ్ళిపోయింది.

ఇంక బంటీ హాయిగా అమ్మతో ఆటలు ఆడచ్చు. రాత్రికి కథ చెప్పించుకోవచ్చు. ఇవాళ తను బోలెడు పని చేశాడు. అమ్మ గదిలోంచి వెళ్ళిపొమ్మని చెప్పగానే బంగారు తండ్రిలా బయటకొచ్చేశాడు. ఇప్పుడింక కాలేజీలేదు. కాలేజ్ పనీలేదు. ఇంక తనూ, అమ్మా హాయిగా వుండచ్చు. తమిద్దరిమధ్య ఎవరూ అడ్డురారు.

ముఖం తుడుచుకుంటూ అమ్మ బయటకి వచ్చింది. ''మాటల్లో టైమే తెలియలేదు. ఏడు గంటలకి వెళ్ళాల్సింది. అప్పుడే ఆరు ముప్పావయిపోయింది'' అని హడావుడిపడింది.

''నువ్విప్పుడెక్కడకి వెళ్తున్నావు మమ్మీ?'' అనడిగాడు ఏడుపునాపుకుంటూ.

''చాలా ముఖ్యమయిన పని వుంది నాన్నా'' అంటూ మమ్మీ జుట్టు సిగగా ముడివేస్తోంది.

''ఓహ్! నేనిప్పుడు ఒక్కణ్ణే వుండాలా? పొద్దుట్నుంచీ ఒక్కడినే వున్నాను?!'' బంటీ కోపంగా అడిగాడు.

ఒక్కక్షణం అమ్మ చేతులు ఆగాయి. ప్రేమగా బంటీవేపు చూసింది. తరువాత వాడిని దగ్గరకి తీసుకుని గారం చేస్తూ అంది- ''నా బుజ్జికొండా ఒక్కడివే ఎందుకుండడం? టిటూని పిలిచి కాసేపు ఆడుకో...''

''ఈవేళప్పుడు టిటూని పిలిస్తే వాళ్ళమ్మ ఊరుకుంటుందా?''

''పోనీ మీతోపాటు తీసికెళ్ళరాదామ్మా. పాపం పొద్దుట్నుంచీ తోచకుండా ఒక్కడే అటూ ఇటూ తిరుగుతున్నాడు'' తలుపు దగ్గర కూర్చుని వక్కలు కత్తిరిస్తున్న అత్తయ్య అంది.

బంటీ మమ్మీకేసి ఆశగా చూశాడు. అత్తయ్య సిఫార్సు వల్లేమన్నా లాభం వుండచ్చేమో!

''చెప్పాను కదత్తయ్యా నాకు పనుంది. వీడినెలా తీసికెళ్ళను?'' త్వరత్వరగా చీరకట్టుకుంటూ అంది అమ్మ.

''పనుంటే ఏమైంది? నేనూ నీతో వస్తే ఏమవుతుంది మహా?''

''ఒద్దమ్మా, మా బంటీ బంగారుతండ్రి. నాకు పనుందని చెప్పినప్పుడు ఇబ్బంది పెట్టడు కదా! పెద్దవాళ్ళమధ్యకి రాకూడదని వాడికి తెలుసు'' అని అమ్మ వాడి చెంపమీద ఒక ముద్దు పెట్టి వెళ్ళిపోయింది. గేటు దగ్గర నుంచున్న బంటీ అమ్మ వెళ్ళిపోతుంటే చూస్తూ వుండిపోయాడు. కళ్ళల్లో నిండుతున్న నీళ్ళని కష్టపడి కళ్ళల్లోనే దిగమింగుకున్నాడు.

తరువాత అన్యమనస్కంగా లోపలకొచ్చాడు.

''నీకేమయిందిరా బంటీ? అమ్మతో ఎందుకు వెళ్ళలేదు? ఇదివరకు మీ అమ్మ నంత సులువుగా వెళ్ళనిచ్చేవాడివా? వాకి

లంతా దొర్లేసి నానా అల్లరి చేసేవాడివి. ఉన్న ట్టుండి 'నీకింత బుద్ధి వచ్చేసిందేమిట్రా బాబూ! వెళ్ళు ఆడుకో' అంది అత్తయ్య.

బంటీకి ఒక్కసారిగా అనిపించింది. అత్త య్య అన్నట్టుగా ఒకసారి ఇల్లంతా పార్లి రాద్ధాంతం చెయ్యాల్సింది...

అమ్మ వచ్చేవరకు ఏడ్చి, మొత్తుకుని వెక్కు తూనే వుండాల్సింది... అమ్మ తనని ఓదార్చ లేక సతమతమైపోవాలంతే!

రాత్రి అమ్మ డాక్టర్ జోషిగారి కారులోంచి దిగుతున్నప్పుడు బంటీ గేటుదగ్గరే కాచుకుని నుంచున్నాడు.

"ఎలా వున్నావు బంటీ?" డాక్టరుగారు కా ర్లోంచే ప్రశ్నించారు.

"నేను బాగానే వున్నాను. నాకేమీ అవలేదు. మీరెందుకొచ్చారు?" అని ప్రశ్నించాడు బంటీ. క్రితంసారి తనకి జ్వరం వచ్చినప్పుడు ఆయన గుచ్చిన ఇంజక్షన్ నొప్పి ఇంకా వున్నట్టే అని పించింది వాడికి.

చీకట్లోనే బంటీ అమ్మవంక చూశాడు. అమ్మ ఆరోగ్యంగా వున్నట్టే కనిపించింది. అయినా డాక్టర్‌గారెందుకొచ్చారు?

రాత్రి అమ్మ పక్కన పడుకుని ఆవిడేమన్నా చెబుతుందేమోనని ఎంతసేపో ఎదురు చూశా డు బంటీ. ఇవాళ తను ఎంత పని చేశాడు! మమ్మీ అందుకైనా పొగడ్తగా ఒక మాట అన చ్చుగా... కాని ఆవిడ వాడు పక్కనున్నాడన్న ధ్యాసే లేనట్టుగా పడుకునుంది. ఆమె చేతు లు వాడి క్రాపులో కదులుతున్నా ఆమె ధ్యా నంతా ఎక్కడోవుంది. వాడిని ఆమె చూడను కూడా చూడలేదు.

"మమ్మీ..."

"ఊ...?"

"నువ్వు చాలా ముఖ్యమైన పని అన్నావు..."

"అవును... ముఖ్యమైన పనే"

మమ్మీకి వాడితో మాట్లాడ్డం ఇష్టం వున్నట్టు లేదు. అప్పుడు బంటీకి వెక్కివెక్కి ఏడవాలని పించింది.

★ ★ ★

స్కూళ్ళు తెరిచేసరికి బంటీకి వాడి బాల్యం మళ్ళీ తిరిగొచ్చినట్టయింది.

సుదీర్ఘమయిన శలవులయ్యాక మొదటి రోజు స్కూలుకి వెళ్ళడం అంటే బంటీకి చాలా అనాసక్తిగా వుండేది. కాని ఈసారి స్కూలుకి వెళ్ళడం అంటే వాడికి చాలా ఆనందంగా వుంది. పొద్దుట్నుంచీ వాడు స్కూలుకెళ్ళడాని కి తయారయ్యే సంబరంలో బోలెడంత హడా వుడి చేశాడు.

చివరికి సిద్ధమై వాడు తన పుస్తకాల బ్యాగ్‌ని పట్టుకుని బయల్దేరాడు. మొదటిరోజు పాఠాలు జరగడం అంతంతమాత్రమే. అందు కే ఒక్క నోటుబుక్, పెన్సిల్ మాత్రం తీసుకు న్నాడు. రోడ్డుదాటి కాలేజ్ గేట్‌దగ్గర బస్సు కోసం కాచుకోవాలి. అమ్మ గేటువరకు వచ్చి వాడిని పంపించి లోపలకెళ్ళింది. వాడు బస్ స్టాప్‌లోనుంచుని తన ఇంటికేసి చూసుకున్నా డు. చిన్న బంగళాలాంటి ఆ ఇల్లు ఎంతో అందంగా కనిపిస్తోంది. వాడికెంతో ప్రియమ యిన ఇల్లు అది!

ఒక్కక్షణం బంటీ మనసులో- "ఈ సెలవు ల్లో ఈ ఇంట్లో ఎన్నెన్ని విషయాలు జరిగిపో యాయో..." అనుకున్నాడు. అంతలో దూ రంనుంచి దుమ్ములేపుకుంటూ బస్సు రావడం కనిపించింది. బంటీ వెంటనే చేతిలోకి బ్యాగ్ తీసుకుని, బస్సు ఆగిన వెంటనే చెంగున లోపలకి గెంతాడు.

"బంటీ రారా ఇక్కడ చోటుంది" అని అనేక కంఠాలు ఆహ్వానించాయి. బస్సులో బోలెడు చోటుంది. కైలాస్ పక్కకి జరిగి బంటీకి చోటిచ్చాడు.

బస్సు బయల్దేరగానే పిల్లల కేకలు, మాట లు, గోల జాతరని మించిపోయింది. కబుర్లు... కబుర్లు! సెలవుల్లో ఎవరెవరు ఎక్కడకెళ్ళారో, ఎవరెవరు ఏం చేశారో... వగైరా... వగైరా... ఎడ తెరిపిలేకుండా చెప్పుకుపోతున్నారు. అలా చె ప్పుకునే విషయాలు తనకేమీ లేవనిపించింది బంటీకి. అంతలో ఎవరో అడిగారు.

"బంటీ, క్రిందటేడు ముస్సోరి వెళ్ళానన్నా వుగా ఈ సారెక్కడికీ వెళ్ళలేదూ?"




''లేదు'' అన్నాడు బంటీ మెల్లగా.

''వేసవి సెలవుల్లో పూర్తిగా ఇక్కడే వున్నావా?''

''అవును''

చెప్పుకుందుకు బంటీ దగ్గరా చాలా విషయాలే వున్నాయి. కాని తమ ఇంటి విషయాలన్నీ ఇంకొకరికి ఎలా చెప్పుకోగలడు? చెప్పుకున్నా వీళ్ళకి అర్థమవుతుందా? అన్నీ పెద్ద విషయాలు. వాడంటే ఒక్కసారిగా పెద్దవాడయిపోవల్సొచ్చింది. కాని ఈ విభు, కైలాస్, దీపక్, టామి అంతా ఎలా వున్నవాళ్ళు అలాగే వున్నారు.

కాని తను పొందిన జ్ఞానంపట్ల బంటీకి గర్వంగా అనిపించే బదులు మనసు భారంగా అయిపోయింది.

బస్సు వెళ్ళి స్కూలు గేటుదగ్గర ఆగింది. పిల్లలు ఒకర్నొకరు తోసుకుంటూ గబగబ దిగుతున్నారు. కిందనుంచున్న మేష్టారు, ''పిల్లలూ మెల్లగా దిగండి ఎక్కడో బోనులోంచి పారిపోతున్న జంతువుల్లా దూకకండి...'' అన్నారు.

నిజంగానే బంటీకి ఎన్నో రోజుల తరువాత బోనులోంచి బయటపడ్డట్టుంది. ఫ్రెండ్స్‌తో లెక్కలేనన్ని కబుర్లు.

కొత్త క్లాసు, కొత్త పుస్తకాలు, కొత్త మాస్టర్లు వీటన్నిటితోబాటు తానూ కొత్త రూపం ఎత్తినట్టుగా వుంది బంటీకి.

సాయంత్రం స్కూలునుంచి సంతోషంగా కొత్తకొత్త పుస్తకాలన్నీ తీసుకుని ఇంటికొచ్చాడు.

అమ్మ ఇంకా ఇంటికి రాలేదు. కాలేజ్ వదలడానికింకా టైముంది. వంటింట్లోకి వెళ్ళి అత్తయ్యని లాక్కొచ్చాడు. తన బ్యాగ్ నెత్తి చూడమన్నాడు. ఆవిడ ఆ బ్యాగ్ నెత్తి ''అమ్మో ఎంత బరువో! నీ కన్నా బరువుంది కదరా'' అని అబ్బురపడింది.

వాడెంతో సంతోషంగా ఎంతో గర్వంగా ఆ బ్యాగ్ తగిలించుకుని ఇల్లంతా తిరిగి కవాతు చేశాడు. ఒక్కొక్క పుస్తకం తీసి వాటి గొప్పతనాన్ని వివరించి చదువులేని అత్తయ్య దగ్గర తన నాలుగో క్లాసు చదువులోవున్న పరమార్థం అంతా బోధించాడు.

''ఇది హిస్టరీ తెలుసా? నువ్వు కథల్లో చెప్పే రాజులు రాణులు కాదు, నిజం రాజులు, నిజం యుద్ధాల గురించి రాశారు... ఇది సైన్స్ ఈ భూమ్మీద అన్నీ దేవుడు చేసినవే అంటావు కదా! కాదు, అవన్నీ ఎలాఎలా పుట్టుకొచ్చాయో అదంతా ఈ బుక్‌లో వుంటుంది... ఇదుందే... దీన్ని అట్లాస్ అంటారు. ఈ భూ ప్రపంచం అంతా ఇందులోవుంది. చూడు ఇదంతా ప్రపంచం ... అందులో ఈ చిన్న చోటుందే ఇది మన భారతదేశం. ఇదిగో ఇందులో ఇక్కడే మన వూరుంటుంది. అందులో మనిల్లు... ఆ ఇంట్లో నీ వంటిల్లూ... నువ్వూను'' అని బంటీ పడిపడి నవ్వాడు.

ఎన్నో రోజుల తరువాత వాడలా హాయిగా నవ్వుతుంటే ఆవిడ మురిసిపోయింది. ''అవున్రా నాన్నా నా వంటిల్లే నా ప్రపంచం'' అని ఆవిడా నవ్వింది. ఈ మధ్య ఇంట్లో గొడవలవల్ల పిల్లాడెంత నలిగిపోయాడో. హాయిగా ఆటలాడి నవ్వి ఎన్నాళ్ళయిపోయిందో.

వాళ్ళ నవ్వుల సందట్లోనే అమ్మ వచ్చింది.

బంటీ మళ్ళీ విశేషాలన్నీ చెప్పుకొచ్చాడు. విభు, కైలాష్ వగైరా ఫ్రెండ్సంతా ఎక్కడెక్కడికెళ్ళారో, సెలవుల్లో ఏమేం చూశారో... సెలవుల్లో ఎవరెవరు ఏమేం తమాషా వస్తువులు తయారుచేశారో, స్కూల్లో రోజంతా ఏమేం చేశారో అన్నీ చెప్పాడు. తనూ తన మెకానోసెట్ గురించి వివరించి చెప్పిన వైనం, గన్‌తో అత్తయ్యనెలా భయపెట్టాడో అన్నీ చెప్పాడట. వాడి కబుర్లన్నీ అమ్మ ముసిముసి నవ్వులు నవ్వుతూ వింది.

''మమ్మీ... ఇంక ఇప్పుడు నీ డ్యూటీ సంగతి విను. పుస్తకాలన్నింటికీ అట్టలు వేసేసి, లేబుల్స్ అంటించి పేర్లు రాసెయ్యాలి. లేకపోతే మాస్టారూరుకోరు. రేపటికన్నీ రెడీగా పట్టుకెళ్ళాలి. బ్రౌన్ పేపర్ వెయ్యాలి సుమా! మర్చిపోకు'' అని హుకుం జారీ చేశాడు. తన స్కూల్ సంగతులన్నీ టిటూకి చెప్పి వాడి సంగతులన్నీ వినద్దూ? అందుకే అటు పరుగెత్తాడు.

టిటూతో ఒక గంట కబుర్లయ్యాక తిరిగి ఇంటికి వచ్చేవేళకి బాగానే చీకటి పడింది. అత్తయ్య వసారాలో ఆవసోపాలు పడుతూ

వినసకర్రతో విసురుకుంటోంది.

''మమ్మీ'' అని అరుచుకుంటూ బంటీ లోప లకి వచ్చాడు. అమ్మ కనపడలేదు. వాడి పుస్తకాలన్నీ టేబుల్‌మీద అలాగే పడున్నాయి. మళ్ళీ ''మమ్మీ'' అంటూ లాన్‌లోకి పరుగెత్తా డు.

లాన్‌లో అమ్మ, డాక్టర్‌గారు కబుర్లు చెప్పు కుంటున్నారు. మధ్యలో టీ కప్పుంది. బంటీ కోపంగా అడిగాడు-

''మమ్మీ నా పుస్తకాలకి అట్టలెందుకు వెయ్యలేదు''

''బంటీ, ముందు డాక్టర్‌గారికి నమస్తే చె ప్పు'' అంది.

తన ప్రశ్నకి బదులు చెప్పకుండా అమ్మ ఇలా మాట్లాడడం వాడికి నచ్చలేదు. వాడు మొక్కుబడిగా ఆయనకో నమస్కారం పెట్టి, అమ్మవేపు కోపంగా-

''నువ్వు నా పుస్తకాలకి అట్టలెందుకు వెయ్యలేదు? రేపు స్కూల్లో పనిష్మెంటిస్తారు, నాకు''

''ఏం బంటీ, చాలా కోపంగా వున్నట్టు న్నావే? ఏమిటి సంగతి?'' అన్నారు డాక్టర్.

బంటీ మనసులోనే గొణుక్కున్నాడు. అవు ను, నాక్కోపం వచ్చింది. మీకెందుకు? ఎప్పుడు పడితే అప్పుడు వచ్చి కూర్చుంటారు. లేకపోతే మమ్మీని తీసికెళ్తారు. పెద్ద మాకే కారుందని గొప్ప! అనుకున్నాడు.

ఈయనొచ్చి కూచోడంవల్లకదా అమ్మ కవర్లు వెయ్యలేదు! ఈ అమ్మ అయినా ఆయనతో చెప్పెయ్యచ్చుకదా. బంటీ పని వుంది ఇప్పుడు తీరిక లేదని చెప్పి పంపెయ్యచ్చు కదా? ఆయనతో ఏమిటి మొహమాటం. రేపు స్కూల్లో తిట్లు తినవల్సింది తను!

బంటీ డాక్టర్ మాటలకి జవాబు చెప్పలేదు. ఆయనవేపు తిరిగి చూడను కూడా చూడలేదు. అమ్మ చెయ్యి పట్టుకుని లాగి,

''నువ్వు లోపలకొచ్చి కవర్లు వెయ్యమ్మా''

''బంటీ, ఏమిటిది!? ఎందుకిలా చేస్తు న్నావు? పెద్ద పిల్లాడివయ్యిండి ఇలా చెయ్యొ చ్చా!? బంగారు కదా...''

అయినా బంటీ తల్లి చెయ్యి పట్టుకుని లాగుతూనే వున్నాడు. ''నువ్వు ముందులే. పాఠం కూడా చెప్పాలింకా''

అని ఏడుపు స్వరంతో అన్నాడు.

''వేసిస్తానని చెప్పాగా'' అమ్మ కోపంగా అని విసురుగా చెయ్యి లాక్కుంది.

డాక్టర్‌గారు లేచి నుంచున్నారు. ''నువ్వు బంటీ పని చూడు. నేను వెళ్ళొస్తాను. నాకూ కొంచెం పనుంది. ఎనిమిదిన్నరకి విజిట్ వుంది''

అంతా అమ్మని 'మీరు' అని గౌరవిస్తారు గదా! ఈ డాక్టరేమిటి 'నువ్వు' అంటున్నారు? అమ్మ కాలేజ్ ప్రిన్సిపాల్ అన్నసంగతి తెలీదా!

ఇంకాసేపు వుండమని అమ్మ బలవంతం చేసింది. అయినా ఆయన వెళ్ళిపోయారు. అమ్మ ఆయన్ని కారు వరకు సాగనంపి వచ్చింది.

లోపలకి రాగానే మమ్మీ తనని కోప్పడు తుందన్న సంగతి బంటీకి బాగా తెలును... ''ఇలా చెయ్యొచ్చా?'' ఇలా ఎవరన్నా మాట్లాడ తారా అసలు? బుద్ధుందా నీకు'' అని బాగా చెడామడా దులిపేస్తుందనుకున్నాడు.

అయినా ఈ మధ్య అమ్మ తనని సరిగ్గా పట్టించుకుంటేగా! మునుపటిలా తిట్టనూ తిట్ట దు. ముద్దులాడనూ ఆడదు. దగ్గర పడుకోబె ట్టుకుని కథలు చెప్పదు. తనతో ఆటలాడదు. ఈ పట్టించుకోని తనం వాడికి చాలా బాధగానే వుంది. తిట్టినా ఫరావాలేదు గాని...

అమ్మ లోపలికొస్తూండడం చూసి పెద్దగా రాగం లంకించుకున్నాడు. ''ఇంత ఆలస్యం అయిపోయింది. ఇంక కవర్లు వెయ్యడానికె క్కడ కుదురుతుంది?'' అంటూ అమ్మనే దో షిగా చేసి ఏడుపు సాగించాడు.

''పద అట్టలేస్తాను...'' అంటూ వచ్చింది అమ్మ. ఒక్క తిట్టైనా తిట్టకపోడం అనేది చాలా హింసగా వుంది వాడికి. ఆవిడేమీ అనకుండా అంత శాంతంగా ఒక మాటలో అలా తేల్చె య్యడం తిట్లు తిట్టడం కంటే ఘోరంగా వుంది. ఆవిడ బాగా తిట్టేసి వుంటే తను చేసిన పెంకితనానికి చెల్లయిపోయివుండేది. ఇప్పుడెలా?




"అట్టలేస్తాను. బ్రౌన్ పేపర్ పట్టుకురా" అంది మమ్మీ.

"నా దగ్గరెక్కడుంది బ్రౌన్ పేపరు?"

"అది తేకుండా మరింత గొడవెందుకు చేసావు?"

"నాకేం తెలుసు? నువ్వు తెప్పించవల్సింది!"

"మరిప్పుడెలా?",

మళ్ళీ ఏడుపు, రాద్ధాంతం! ఆ ఏడుపు అట్టలకోసం అనేదొక నెపం. వాడి కడుపులో బాధంతా ఏడుపు రూపంలో బయటకొస్తోంది.

అమ్మ, వాడిని ఓదార్చే ప్రయత్నం చేస్తోంది. "బంటీ, పిచ్చిపిచ్చిగా చెయ్యకు. ఒక్కపూట అట్టలు లేకపోతే ఏమీ అయిపోదు. కావాలంటే నేను మేష్టారికి లెటర్ రాసిస్తానులే"

"నాకే లెటరూ అక్కర్లేదు. నాకసలు అట్టలే వెయ్యక్కర్లేదు... నేస్కూలుకి వెళ్ళనే వెళ్ళను... నువ్వు నన్నసలు ఏం పట్టించుకుంటున్నావని... నీ డాక్టరుగారితో కబుర్లు చెప్పడానికి తీరికుంది గాని... నా పుస్తకాలకి అట్టలెయ్యడానికి... పేపరు తెప్పించడానికి తీరికలేదు" ఏడుస్తూ నోటికొచ్చినట్టు మాట్లాడుతున్నాడు వాడు.

వాడి మాటలు వింటూ తెల్లబోయి చూస్తోంది అమ్మ. ఆవిడ శాంతంగా వున్నకొద్దీ వాడు రెచ్చిపోతున్నాడు.

వాడు నేలకతుక్కుపోయి ఏడుస్తుంటే అత్తయ్య వాడిని లేపడానికి ప్రయత్నిస్తోంది. వాడు లేవదల్చుకోలేదు "ఏడుస్తాను. ఇంకా ఏడుస్తాను మీకెందుకు..." అని అత్తయ్య చేతిని విదిలించేశాడు.

వాళ్ళ సంవాదం వింటూ అపరాధినిలా తల వంచుకుని చేతిమీద చెయ్యివేసుకుని కూర్చుంది అమ్మ.

వాడిని లేపడానికి, వాడి ఏడుపు ఆపడానికి ప్రయత్నించి విఫలమయిన అత్తయ్య, "ఎన్నో రోజుల తరువాత పిల్లాడు సంతోషంగా కబుర్లు చెప్పాడు. స్కూలునుంచి వచ్చినప్పట్నించి నిజంగా ఈ వయసు పిల్లలెలా చలాకీగా చురుకుగా వుండాలో అలా కబుర్లు చెప్పాడు. పుస్తకాలకి అట్టలు వేసుంచాలని పదిసార్లు చెప్పి వెళ్ళాడు. అయినా ఈమధ్యన మీరసలు..." అంటూ అమ్మ మొహం చూసి సగంలో ఆపేసింది.

అంతలో అమ్మ చటుక్కున ఏదో గుర్తొచ్చినట్టుగా "అత్తయ్యా, ఈ తాళాలు తీసికెళ్ళి, కాలేజ్ వాచ్‌మెన్‌కివ్వండి. ఇచ్చి నా రూంలో బీరువాలో బ్రవున్ కాగితం వుంటుంది. ఇమ్మని చెప్పి తీసుకురండి" అని చెప్పింది.

అత్తయ్య వెళ్ళి బ్రౌన్ పేపర్ తెచ్చివ్వగానే అట్టలు వెయ్యడానికి ఉపక్రమించింది అమ్మ.

మళ్ళీ బంటీకి తను తప్పు చేశానన్న సంగతి అర్థమయింది. బాధ కూడా కలిగింది. అమ్మ దృష్టిని ఎదుర్కోలేక తల దించుకుని తనూ అమ్మకి సాయం చెయ్యసాగాడు. అమ్మకి కోపం వచ్చిందోలేదో వాడికి అర్థంకాలేదు. ఇదివరకు అమ్మ ముఖం, కళ్ళు చూస్తే చాలు అమ్మకి కోపం వచ్చిందో, విచారంగా వుందో, విసుగ్గావుందో అనేది వాడికి తెలిసిపోయేది. కాని ఇప్పుడు?

"నువ్వెళ్ళి భోజనం చేసి పడుకో. లేకపోతే పొద్దున్నే లేవడం కష్టం"

"నువ్వూ వచ్చి భోజనం చెయ్యి" గొంతులో క్షమించమని కోరుతున్న భావం వుంది.

అమ్మ ఒక్కక్షణం వాడికేసి చూసింది. మళ్ళీ నిదానంగా అంది. "లేదు, నేను తరువాత భోంచేస్తాను"

ఒక్కక్షణం తను లేవడమా, ఊరుకోడమా అని బంటీ ఆలోచించి తరువాత మెల్లగా లేచాడు. ఇప్పుడయినా తను అమ్మ మాటని వినకుండా వుండకూడదు... అనిపించింది వాడికి. వెళ్తూవెళ్తూ చిన్న సూచననిచ్చాడు.

"లేబుల్స్ అంటించి పేర్లు కూడా రాయాలి"

"అన్నీ తయారవుతాయిగాని నువ్వెళ్ళి అన్నం తిని పడుకో"

పొద్దున్నే లేచి చూస్తే పుస్తకాలన్నిటికీ అట్టలు వేసి వుండటం కనిపించింది. వాటిమీద గుండ్రటి అక్షరాలతో వాడి పేరు, క్లాసు రాసి వున్నాయి.

బంటీ పుస్తకాలన్నీ ముట్టుకుచూశాడు. మనసు పులకించిపోయింది. ఇంకో క్షణానికి ముందురోజు జరిగిన సంఘటనలన్నీ కళ్ళముందు కదిలాయి. ఈ రోజు ఏమన్నా చేసి తల్లిని సంతోషపెట్టాల్సిందే అనుకున్నాడు. పరిగెత్తుకుంటూ వసారాలోకి వచ్చాడు. అమ్మ అక్కడ పత్రికేదో చదువుతూ కూర్చుంది. వాడు వెనుకనుంచి వెళ్ళి ఆమె మెడచుట్టూ చేతులు వేసి వాటేసుకున్నాడు. తరువాత అమ్మ చెంపమీద ఒక ముద్దిచ్చాడు.

అమ్మ వాడిని ముందుకి లాక్కుంది. వాడి రెండు భుజాలమీద తన రెండు చేతుల్ని వుంచి వాడి ముఖంలోకే చూడసాగింది. మాట్లాడలేదు. ముద్దాడలేదు. గారంగా దగ్గరకి తీసుకుని బుజ్జగించలేదు. మరి ఆ చూపులో ఏముంది? కోపమా? తిరస్కారమా? ప్రేమా? సంతోషమా? బంటీకి ఏదీ అర్థంకాలేదు.

"పద, పద వెళ్ళి రెడీ అవ్వు. మళ్ళీ స్కూలుకి ఆలస్యం అయిపోతుంది" అంటూ వాడిని ముద్దులాడకుండానే తరిమింది.

స్కూలుకి వెళ్ళేందుకు తయారవుతున్నప్పుడు కూడా బంటీ తలలో అదే ఆలోచన వేధించసాగింది. తను అమ్మకి ఒక్క ముద్దిస్తే చాలు, బదులుగా ఆవిడ తన బుగ్గల్ని దోసెడు ముద్దులతో ముంచెత్తేది. తనని దగ్గరగా లాక్కుని ముద్దుచేసేది. కానీ ఇవాళ ఎందుకిలా చేసింది? అమ్మకి తనమీద ఇంకా కోపమేనా?

లేదు, కోపమేమీ కనపడ్డంలేదు. ఈమధ్య అమ్మ చాలా మారిపోయింది. మనుపటిలా లేనేలేదు.

కొద్దిసేపటిక్రితం వాడి మనసులో రూపుదిద్దుకున్న పశ్చాత్తాపం, గిల్టీఫీలింగ్ మళ్ళీ కోపంగా మారిపోయింది. ఈసారి వాడికి కోపం వచ్చింది. అది అమ్మమీద కాదు, డాక్టర్ జోషిగారిమీద తమ ఇంటికి ఆయనెందుకన్నిసార్లు రావాలి? అనుకున్నాడు.

సాయంత్రం చాలా ఆనందంగా బయటకి వెళ్ళడానికి తయారయ్యాడు బంటీ. ఎన్నో రోజుల తరువాత అమ్మ బయటకి తీసికెళ్ళడానికి తయారవమంది. తను కాలేజీనుంచి రాగానే "బంటీ త్వరగా తయారవు. కాసేపు అలా బయట తిరిగొద్దాం" అంది. ఒక్కక్షణం ఆ మాటలు నమ్మలేనట్టుగా ఆవిడవంక చూశాడు బంటీ.

"ఎందుకలా చూస్తున్నావు? ఎక్కడికెళ్దాం చెప్పు?"

"కంపెనీ బాగ్!"

"సరే... నువ్వేం బట్టలు వేసుకుంటావు? మంచి బట్టలు వేసుకో" అమ్మ చాలా సంతోషంగా వున్నట్టుంది. మనుపటిలా డల్‌గా వుండటం లేదీమధ్య.

వాడు రెడీ అయి వచ్చి అమ్మ అలంకరించుకోడాన్నే చూస్తున్నాడు. ఒక్కొక్క సీసానే అందుకుని అందులోంచి ఏదేదో తీసి మొహానికి రాసుకోగానే ఆ మొహం కొత్తకొత్తగా తయారవుతోందనిపిస్తుంది. తెల్లటి పౌడర్ అద్దుకున్న ముఖంమీద ఎర్రటి లిప్‌స్టిక్ అద్దుకున్న పెదవుల కిందగా గడ్డంమీద నల్లగా మెరిసే ఆ పుట్టుమచ్చని చూసి, ఆ మచ్చమీద వేలితో తాకి ఆడుకుని ఎన్ని రోజులయిపోయిందో-అనిపించింది. అలంకరించుకుంటున్న మమ్మీ వాడి కళ్ళకి ఎంతో అందంగా కనిపించింది. కానీ వాడికి ఆమె దగ్గరకి వెళ్ళే ధైర్యం రాలేదు. ఈమధ్య ఆమెకి, వాడికి మధ్యనేదో అయింది.

ఇవాళ తను అమ్మతో కలిసి హాయిగా తిరుగుతాడు. అమ్మతో చాలా విషయాలు మాట్లాడతాడు. తమాషా సంగతులన్నీ చెప్పి అమ్మని బాగా నవ్విస్తాడు. రాత్రి అమ్మ పిలవకపోయినా వెళ్ళి ఆవిడ మంచంమీద పక్కనే పడుకుంటాడు. ఆ పుట్టుమచ్చమీద వేలాడిస్తూ కబుర్లు చెప్తాడు. కథ చెప్పించుకుంటాడు. ఇవాళ ఇంకే నెవం చెప్పినా వినడు.

అమ్మ బీరువాలోంచి అట్ట బాక్సొకటి తీసింది. అందులో ఆకాశం రంగు చీరొకటి వుంటే అది బయటకి తీసింది. చాలా అందమైన చీర, కొత్తది!

"అమ్మా... ఇదేం చీర?" ఉన్న చీరలన్నీ బాగా పరిచయం వాడికి. మరి ఇదెక్కడిది?

"కొత్తది"

"ఎప్పుడు తెచ్చావు? నాకు చెప్పనే లేదు"




అన్నాడు బంటీ నిష్టూరంగా.

చీర కట్టుకుంటున్న ఆమె చేతులు ఒక్క క్షణం అక్కడే ఆగాయి. కొద్దిసేపు వాడి ముఖాన్ని పరిశీలనగా చూసింది. తరువాత ఫకాల్న నవ్వేసి, "ఏరా నేను చేసే ప్రతీ పనీ నీకు చెప్పి చెయ్యాలా?" అంది.

'చెప్పకపోతే మానెయ్యి. నాకేం? నేను చేసే పన్లు నేనూ ఏమీ చెప్పనంతే' అనుకున్నాడు వాడు.

అంతలో కారు హారన్ మ్రోగింది. 'ఓహ్! ఈ డాక్టర్‌గారొకరు! ఈయనిప్పుడే ఎందుకు రావాలి? ఈయనొస్తే ఇక మమ్మీ బయల్దేర దేమో.'

"వెళ్ళు నువ్వెళ్ళి కార్లో కూర్చో. నేనిప్పుడే వస్తాను" అంది అమ్మ.

"మనం డాక్టర్‌గారి కార్లో వెళ్ళాలా?" బంటీ ఉత్సాహం చప్పగా చల్లారిపోయింది.

"అవును మరి, ఆయన్తోనే వెళ్తున్నాం" అంటూ అమ్మ గబగబ బీరువాకి తాళం వేసింది. వాడొక్కక్షణం 'నేను రాను' అందామనుకున్నాడు. కాని వాడిక్కూడా కార్లో తిరిగి రావడమంటే సరదానే.

డాక్టర్ తన పక్కనున్న సీటు వేపు డోర్ తీశారు. అమ్మ వెళ్ళి డాక్టర్‌గారి పక్కన కూర్చుంది.

"నువ్విలా వెనకసీట్లో కూర్చో బంటీ" అంది.

"పోనీ, వాడినీ ముందే నీ పక్కనే కూర్చోబెట్టుకో. ఇద్దరూ కూర్చోడానికి వీలవుతుంది" అన్నారు డాక్టరుగారు.

"ఒద్దు వాడిని వెనకాలే కూర్చోనివ్వండి. ముందుకొస్తే నా చీర నలిగిపోతుంది" అని జవాబిచ్చింది అమ్మ.

కిక్కురుమనకుండా అవమానం పొందినవాడిలా వెనుక సీట్లో కూర్చున్నాడు బంటీ. వెనకాలన్నా కూర్చోబెట్టనీ, ముందన్నా కూర్చోబెట్టనీ, లేదా ఇష్టంలేకపోతే ఇంట్లోనే వదిలిపెట్టేసి వెళ్ళిపోయినా సరే, అదంతా వేరు. కాని కొత్త చీర కట్టుకున్నానని ఎంత గొప్పలు పోతోంది! ఇద్దరూ కూర్చున్నాక కూడా ఈ డాక్టర్‌గారు కారెందుకు స్టార్ట్ చెయ్యడంలేదు? ఎప్పుడూ చూడని మనిషిని చూసినట్టుగా అమ్మనెందుకలా కరువుగా చూస్తున్నారు?

ఇంక అట్టేసేపు వూరుకోలేకపోయాడు బంటీ. "బయల్దేరండి మరి" అన్నాడు.

"సరే బంటీ, ఇవాల్టి ప్రోగ్రాం అంతా నీ కోసమే. ఎక్కడికెళ్దామో చెప్పు. అంతా నీ ఇష్టమే. ఊఁ, చెప్పు" అన్నారు డాక్టర్‌గారు.

డాక్టర్‌గారి మాటలు సంతోషాన్నిచ్చాయి వాడికి.

"బంటీకి కంపెనీబాగ్‌కి వెళ్ళాలనుంది. పిల్లల్ని తీసుకుని అక్కడికే వెళ్దాం" అంది అమ్మ. "ఓకే" అంటూ ఆయన వెంటనే కారు స్టార్ట్ చేశారు.

బంటీకి ఒళ్ళు మండింది. ఛ! ఇదేం తిరుగుడు! న్యాయంగా తనని షికారు తీసికెళ్తానంటే తనొక్కడినే అనుకున్నాడు. డాక్టర్‌గారితోటయితే ఒక్కత్తే వెళ్ళిపోతుంటుంది. ఇవాళ తనని తీసుకువెళ్తుందనుకుంటే ఇంకా ఊళ్ళో వాళ్ళందర్నీ వెంటబెట్టుకొచ్చేలావుంది. ఈ భాగ్యానికి 'నిన్ను షికారుకి తీసికెళ్తాను బంటీ' అంటూ ఉత్తుత్తి కబుర్లెందుకు చెప్పడం! ఇంకా ఈ పిల్లలెవరో? ఇదివరకు తనొక్కడే తండ్రితో షికారెళ్ళిన సంగతి గుర్తొచ్చింది. ఇంతలో-

"బంటీ ఇవాళ నీకు మా పిల్లల్ని పరిచయం చేస్తాను. మా ఇంట్లో నీకొక అక్క వుంది. జ్యోతి అక్క! ఒక తమ్ముడున్నాడు, అమిత్. మీ అక్క చాలా తెలివైనది, మంచి పిల్లకూడా. అమిత్ చాలా అల్లరి పిల్లాడు. వాడేమన్నా చిలిపి పనులు చేస్తే బాగా చెవి పిండు, తెలిసిందా?" అన్నారు డాక్టర్‌గారు.

అమ్మ ఎందుకలా నవ్వుతోంది. ఇందులో మహా నవ్వే విషయం ఏముందని? డాక్టర్‌గారేమన్నా జోక్ చేశారా?

కారు ఒక బంగళా ముందు ఆగింది. బంటీ ఆ ఇంటివేపు దృష్టిపోనిచ్చాడు. బంగళా చాలా పెద్దదే. కాని తోటలేదు. పచ్చిక లేదు. పూల చెట్లు లేవు.

డాక్టర్‌గారు కార్లోంచి దిగి లోపలకి వెళ్ళారు. అప్పుడు "ఇదే డాక్టర్‌గారి బంగళా" అని

చెప్పి అమ్మ బంటీ ముఖంలోకి పరిశీలనగా చూసింది.

ఆ బంగ్లాకి ఆనుకుని ఒక చిన్న ఇల్లుంది. దాని ముందు దూరానిక్కూడా కనిపించేలా ఒక బోర్డుంది. ఎర్రత్రికోణం బొమ్మ, ఇద్దరూ లేక ముగ్గురు పిల్లలు చాలు అని రాసి వుంది దాని మీద.

''ఇదేమిటి మమ్మీ?''

''ఇది డాక్టర్‌గారి డిస్పెన్సరీ. పొద్దున్న డాక్టర్‌గారు ఇక్కడే రోగుల్ని చూస్తారు''

''ఆంటీ...'' అంటూ నీలం రంగు ఫ్రాక్ వేసుకున్న ఒకమ్మాయి పరుగెడుతూ వచ్చింది. ఆ అమ్మాయి వెనకాలే ఒక అబ్బాయీ వచ్చాడు. ఇద్దరి ముఖాలు ఆనందంతో విరిసివున్నాయి.

అయితే అమ్మకి ఈ పిల్లలు ముందే తెలుసన్న మాట. తనకి మాత్రమే తెలియదు!

''జ్యోతీ! వీడే బంటీ. ఇవాళ మీకు పరిచయం చేస్తున్నాను కదా, రేపట్నుంచి నువ్వు వాడిని చూడ్డానికి వస్తూండు. వాడూ ఇక్కడికి వస్తాడు''

జ్యోతి బంటీ వంక చూసింది. కాని బంటీ సంకోచంతో ముడుచుకుపోయాడు.

''నేను కిటికీ పక్కన'' అని అధికారికంగా ఎనౌన్స్ చేశాడు అమిత్. బ్యాక్ డోర్ తీసుకుని దర్జాగా వచ్చి కూర్చున్నాడు. వస్తువు స్వంతం అయితే ఇంతే అనుకున్నాడు బంటీ. ఏం మాట్లాడకుండా పక్కకి జరిగి కూర్చున్నాడు. మరోవేపు తలుపు తీసుకుని జ్యోతి ఎక్కి కూర్చుంది.

ఇలా మధ్యలో కూర్చుని, కార్లో ఎక్కడకన్నా వెళ్ళడం అనే దానిలో అర్థం వుందా అసలు? బయటేమీ చూడ్డానికి లేదు. ఎవరితోటీ ఏమీ అనడానికి లేదు. పోనీ అమ్మ వాళ్ళిద్దర్లో ఒకర్ని పక్కకి జరగమని తనకి చోటిప్పించచ్చుగా! అమ్మే కదా తనని షికారుకి బయల్దేరదీసింది. తనకైతే ఇంకెవరి స్నేహమూ ఇష్టంలేదు.

ఇంకెవరూ తనకవసరంలేదు. ఇంకెప్పుడూ తను వీళ్ళతో ఎక్కడికీ వెళ్ళడు. ముందు కిటికీల దగ్గర డాక్టర్‌గారు అమ్మ. వెనక కిటికీల దగ్గర జ్యోతి, అమిత్. వీళ్ళ మధ్య తనొక్కడే పనికిమాలినవాడు.

కారు దిగి అమ్మ, డాక్టర్‌గారు వాళ్ళ చేతి రుమాళ్ళను గడ్డిమీద పరచుకుని కూర్చున్నారు.

''ఇంక మీరు ముగ్గురూ వెళ్ళి ఆడుకోండి. పదండి... రన్నింగ్ రేసో, దాగుడుమూతలో ఏదో ఒకటి ఆడుకోండి''

అమిత్ అందరికంటే ముందు పరిగెత్తాడు. జ్యోతి చుట్టూ చూస్తూ నుంచుంది. తనెవరితో నూ చేరదల్చుకోలేదు.

అమ్మ మరీ డాక్టర్‌గారినలా ఆనుక్కూర్చుందేమిటి? అమ్మ ఎప్పుడూ ఎవరి దగ్గరా ఇలా కూర్చోదు. బంటీకేమిటో ఇదంతా విచిత్రంగా వుంది. వాడు వాళ్ళిద్దరి మధ్యాదూరి ''నేను ఆటకి వెళ్ళను మమ్మీ. నాకు ఆడాలని లేదు'' అన్నాడు.

''ఇక్కడికి ఆడుకుందుకొచ్చావా? కూర్చుందుకొచ్చావా? పద పద ఆడుకో, జ్యోతి, వీడిని నీతో తీసికెళ్ళు'' అని అమ్మ ఒక విధంగా తనను నెట్టిందనే చెప్పాలి. జ్యోతి తన చెయ్యి పట్టుకుని లాగింది. ఇహ తప్పనిసరిగా లేవవల్సొచ్చింది.

కాని బంటీ ఆడుకోనూలేదు, ఆనందించనూలేదు. అమ్మ చుట్టూ తిరుగుతూనే వున్నాడు. కొంచెం దూరం అలా వెళ్ళినా మళ్ళీ మళ్ళీ అమ్మవంకే చూస్తున్నాడు.

అమ్మనిలా చూడ్డం వాడి మనస్సులో అదోరకమైన అశాంతిని కలిగిస్తోంది. కొంచెం సేపటికి వాడు అమ్మ దగ్గరకొచ్చి కూర్చున్నాడు.

''ఇట్ మీన్స్ హి హజ్‌బెండ్స్ యు టూ మచ్ కదూ?'' అని డాక్టర్‌గారు అనేసరికి అమ్మ పడిపడి నవ్వసాగింది.

డాక్టర్‌గారు హజ్‌బెండ్ గురించి మాట్లాడితే అమ్మ ఎందుకంత విపరీతంగా నవ్వాలి? అసలు నాన్న సంగతి ఇలా పరాయివాళ్ళ దగ్గ రెందుకు మాట్లాడుతుంది? పైగా ఆ నవ్వొకటి. ఆవిడ తన స్నేహితుల ముందుకూడా ఇలా వుండదు.

ఎందుకో బంటీ మనసు కోపంతో ఉడికిపోతోంది.





తరువాత అంతా ఐస్‌క్రీం తిన్నారు. చిప్స్ తిన్నారు. అమ్మ, డాక్టర్‌గారు నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూనే వున్నారు.

అమిత్ అల్లరిచేస్తూనే వున్నాడు. అది కొను నాన్నా... ఇది ఇప్పించు నాన్నా... అంటూ అధికారికంగా అడుగుతూనే వున్నాడు. జ్యోతి ఒకసారి అమ్మతో, మరోసారి డాక్టర్‌గారితో కబుర్లు చెప్తోంది. బంటీ ఒక్కడే మౌనంగా, అందరికీ దూరదూరంగా వున్నాడు. ఒంటరిగా నుంచుండి పోయాడు. వాడికున్నది అమ్మ ఒక్కత్తె. ఆ అమ్మకూడా వాళ్ళతో కలిసిపోయింది.



**ఆ** రోజు ఆదివారం. తలస్నానం చేసి జుట్టుని కుర్చీ వెనక పరచుకుని కూర్చున్న అమ్మ స్వెట్టర్ అల్లుతోంది. బంటీ రంగులు, బ్రష్ పట్టుక్కూర్చుని బొమ్మలు వేసుకుంటున్నాడు. పొద్దున్నే ఇలా లేత ఎండలో కూర్చుంటే ఎంత హాయిగా వుంటుందో.

ఓ రెండు మార్లు బ్రష్‌తో పామి మధ్యలో వాళ్ళమ్మకేసి చూస్తున్నాడు బంటీ. నిజానికి వాడు ఆవిడ వెనుకగా కూర్చున్నా అలా తలెత్తి చూసినప్పుడల్లా అమ్మ ముఖం కనిపిస్తోంది! మారిపోయిన అమ్మ ముఖం! ఈమధ్య అమ్మ బాగా మారిపోయిందని వాడికి స్పష్టంగా తెలిసిపోయింది. కానీ ఆ మార్పు మంచో, చెడో అర్థంకావడంలేదు. ఒక్కోసారి చాలా మంచిదానిలా అనిపిస్తుంది. మరోసారి చాలా చెడ్డదయిపోయిందనిపిస్తుంది. అమ్మ దగ్గర తను కోరుకున్నట్టుగా మారిపోగలిగే మంత్రశక్తి వుందని వాడికి చాలా రోజుల క్రితమే అనుమానం వచ్చింది. కానీ ఆ శక్తి ఎక్కడుంది. ఎలా వుంది? అనేది వాడికి బొత్తిగా అర్థంకాకుండా వుంది. ఎన్నోసార్లు పరీక్షించి చూశాడు. అయినా అది కనిపించలేదు. మునుపటి అమ్మ అయ్యుంటే ఆవిడనే నూటిగా అడిగేవాడు. కాని ఇప్పుడు! మారిపోయిన ఈ అమ్మ దగ్గర ఏమన్నా అడగడం జరిగే పనేనా అని! ఇప్పటికీ అమ్మ పొద్దున్నే వాడిని దగ్గర కూర్చోబెట్టుకుని పాలు తాగిస్తుంది, కబుర్లు చెబుతుంది. కాని ఇదంతా చేస్తున్నది తన అమ్మ కాదు మరెవరో అనిపిస్తుంది వాడికి.

ఇప్పుడు మమ్మీ అల్లుతున్న స్వెట్టర్ బంటీ కోసం కాదు. డాక్టర్ జోషికోసం. ఇన్నాళ్ళూ ఆవిడ చేసే ప్రతి పనీ బంటీకోసమే! కాని ఇప్పుడు, ఆవిడచేసేవన్నీ డాక్టర్‌కోసం అని వాడికర్థమైంది.

బంటీ ఇవాళ ఒక చిత్రం గీసి, రంగులు వేసి అంతా పూర్తిచేసి, వాళ్ళనాన్నకి పంపాలని అనుకున్నాడు. ఆ చిత్రానికి ఫ్రేమ్ కట్టించి గదిలో తగిలించుకోండని ఉత్తరం కూడా రాయాలనుకున్నాడు.

''అత్తయ్యా, బంటీకి స్నానంచేయించి, వంట మొదలెట్టేసెయ్యి. పన్నెండుకల్లా వంట యిపోవాలి''

అత్తయ్య జవాబు చెప్పలేదు. ఆవిడకీ అమ్మమీద కోపంగా వుంది. అందుకే ఆవిడిప్పుడు బంటీకి మునుపటికంటే సన్నిహితమైంది.

''బంటీ వెళ్ళి అత్తయ్యా చేత స్నానం చేయించుకో. వెళ్ళమ్మా బుజ్జీ''

''ఒద్దు, నా స్నానం నేను చేస్తాలే''

బంటీ త్వరగా స్నానం చేసి ఇప్పట్నుంచీ నీట్‌గా తయారై వుండాలని అమ్మ ఉద్దేశం... ఈరోజు డాక్టర్‌గారు వాళ్ళ పిల్లల్ని తీసుకుని వస్తారు. అమ్మ వాళ్ళందర్నీ ఆహ్వానించింది. వస్తే రానీ! తనుమటుకు జ్యోతితో మాత్రం మాట్లాడతాడంతే. ఆ ఇంకో కోతితో చచ్చినా మాట్లాడడు.

''బంటీ...'' అమ్మ స్వరంలో వున్న కాఠిన్యాన్ని గుర్తించి బంటీకి లోపల్లోపల ఆనందం



కలిగింది. వాడు జవాబు చెప్పకుండా ఊరికే రబ్బర్‌తో తుడుస్తూ కూర్చున్నాడు.

''బంటీ, పిలుస్తుంటే వినపడ్డంలేదూ''

''ఏమిటి? నేను డ్రాయింగ్ వేసుకుంటున్నాను'' వాడు కూర్చున్న చోటినుంచి కదల్లేదు. అమ్మకి బాగా కోపం రావచ్చు. వస్తే రానీ! ఆమెకి కోపం రావాలన్నదే వాడి కోరిక.

కాని తరువాత ఆమేమీ మాట్లాడలేదు. ఏమీ జరగనట్టుగా కూర్చుని హాయిగా స్వెట్టర్ అల్లుకుంటోంది. కోప్పడాల్సిన సమయంలో కూడా ఊరుకోడం చూసి ఒళ్ళు మండింది వాడికి.

అంతలో కాలింగ్ బెల్ మ్రోగింది. అమ్మ తలుపు తియ్యడానికి వెళ్ళింది. ఎవరొచ్చారో అన్న కుతూహలంతో బంటీ కూడా వెనకాలే వెళ్ళాడు.

ఎవరో కొత్తమనిషి వచ్చాడు. మధ్యనున్న బల్లమీద రెండు లావాటి పుస్తకాలుంచాడు. అమ్మ వాటిలో ఒకదాని పేజీలు తిరగేస్తోంది. దాన్లో వున్న రంగురంగుల బొమ్మలు దూరాన వున్న బంటీకి కూడా కనపడ్డాయి. చక్కగా అమర్చిన అందమైన చక్కటి గదుల చిత్రాలవి.

"పూర్తిగా ఈ బొమ్మల్లో వున్నట్టే అమరుస్తారా? డెకొరేషనంతా ఇలాగే వుంటుందా?"

"ఇంతవరకూ ఎవరి దగ్గర్నుంచీ ఒక్క కంప్లెయింట్ కూడా లేదు. ఇప్పుడెందుకులెండి చెప్పడం. పని పూర్తిచేశాక మీరే చూస్తారుగా..."

అయితే అమ్మ ఇతన్ని ఇల్లు అలంకరించడానికి పిలిపించిందన్న మాట. ఒక్కక్షణం బంటీ మనసు పులకించింది. వాడు అమ్మ కూర్చున్న కుర్చీ చేతిమీద కూర్చున్నాడు.

"బంటీ నీకెలాంటి సోఫా ఇష్టం? ఎలాంటి మంచం కావాలి చూడు..." అని అమ్మ నవ్వుతూ అడిగింది. బంటీ మనసు ఆనందంతో పొంగిపోయింది.

"కొంచెం ఆగు మమ్మీ, అన్నీ చూసి చెప్తాను" అని వాడు పుస్తకం పేజీలన్నీ తిరగేస్తూ చిత్రాలన్నీ గమనించసాగాడు.

దేన్ని ఎన్నుకోడం? అన్నీ ఒకదాన్ని మించి ఒకటి అందంగా వున్నాయి.

"డాక్టర్‌గారు దేన్నన్నా సెలెక్ట్ చేశారా?"

"లేదు, మిమ్మల్నే సెలెక్ట్ చేయమన్నారు"

బంటీ ఉత్సాహం కాస్తా జర్రున జారిపోయింది. దీనికీ డాక్టర్‌గారేనా? డాక్టర్ చెప్పారని తనేమీ సెలెక్ట్ చేయబోటంలేదు. అమ్మనే సెలెక్ట్ చేసుకోనీ.

అమ్మ ఇంకో పుస్తకం తిరగేస్తోంది. బంటీ కోపంగా తన దగ్గరున్న పుస్తకం మూసేసి లోపలకి వెళ్ళిపోయాడు. అమ్మ తనని పిల్చి ఆమె సెలెక్ట్ చేసిన డిజైన్ గురించి సలహా, సంప్రదింపు చేస్తుందని ఎదురు చూశాడు. ఇంతవరకూ తనని సలహా అడక్కుండా ఆవిడేమీ కొనలేదు. అయినా ఆమె బంటీని పిలవలేదు. కోపంతో వాడి మనసుడికిపోయింది.

పనంతా అయ్యాక అమ్మ శుభ్రంగా ముఖం కడుక్కుంది. తరువాత గులాబీరంగు చీరె కట్టుకుంది. డ్రెసింగ్ టేబుల్‌ముందు కూర్చుని చాలాసేపు సిగ చుట్టింది. డాక్టర్‌గారొస్తారంటే చాలు, అమ్మ బాగా అలంకరించుకుంటోంది. అమ్మ సిగచుట్టుకుంటే బంటీకి నచ్చదు. అప్పుడు వాడికి అమ్మ మమ్మీలా కనిపించదు. ప్రిన్సిపాల్‌లా అనిపిస్తుంది. చక్కగా వాలుజడ వేసుకుంటేనే అందంగా వుంటుంది. ఈ గులాబీరంగు చీర కట్టుకుని సిగలో గులాబీ పువ్వు ముడుచుకుంటే ఎంతో అందంగా వుంటుంది. అయినా సరే తను అమ్మకి గులాబీపువ్వు తెచ్చివ్వడు. ఒకవేళ ఆవిడే కోసుకుని పెట్టుకుందామనుకున్నా తను ఒప్పుకోడు. ఎంతైనా తోట తనది. అక్కడున్న చెట్లు, పూలూ అన్నీ తనవే.

"హలో బంటీ! నువ్వు మా ఇంటికి రానేలేదు. అందుకని మేమే ఇక్కడికొచ్చేశాం" అన్నారు డాక్టరుగారు లోపలికొస్తూ.

బంటీ యాంత్రికంగా నమస్కరించాడు. జ్యోతివంక చూశాడు. పలకరింపుగా నవ్వింది. జ్యోతి అంటే ఎప్పుడూ వాడికిష్టమే. ఆ పిల్లని చూడగానే వాడి ముఖం చిరునవ్వుతో విచ్చుకుంటుంది.

"జ్యోతి... బయట చూశావు కదా, అక్కడున్న మొక్కలన్నీ బంటీనే పెంచాడు. బంటీ చాలా బుద్ధిమంతుడు సుమా"

బంటీ ఓరగా డాక్టర్‌కేసి చూశాడు, ఆయన నిజంగానే మెచ్చుకుంటున్నారా, లేక ఉత్తుత్తినే అంటున్నారా అని. ఆయన పొగడ్తకి నిజంగానే వాడికెంతో సంతోషం కలిగింది. వాడు అమ్మ వైపు చూశాడు. ఆ పొగడ్త తనకే అన్నంత సంతోషంగా వుందావిడ.

అమ్మ అమిత్‌ని, డాక్టర్‌ని లోపలకి తీసికెళ్ళింది. జ్యోతి బంటీ చెయ్యి పట్టుకుని

"నీ తోట చూద్దాం రా బంటీ! నీకు అన్ని పువ్వుల పేర్లూ తెలుసా?" అంది.

"ఓ! ఎందుకు తెలీదు?"

"ఇక్కడికి రంగురంగుల సీతాకోక చిలుకలు వస్తాయా బంటీ?"

"వస్తాయి. కాని వాటిని పట్టుకోకూడదు. పట్టుకుంటే చాలా పాపం"

ఓసారి తోటంతా తిరిగి చూశాక జ్యోతి "లోపలకి పోదాం పద. ఎండ ఎక్కువైంది" అంది.

ఇద్దరూ లోపలకొచ్చారు. సోఫామీద అమ్మని ఆనుకుని మరీ కూర్చున్నారు డాక్టర్‌గారు. ఆయన ఒక చెయ్యి మమ్మీ వీపుమీంచి మరో





భుజంమీదకి వాలివుంది. ఆయన మరో చే తిలో ఒక సీసా వుంది.

బంటీ కదలకుండా చిత్తరువులా నుంచుండిపోయాడు. వాడికి అదోరకమయిన చికాకు కలిగింది. వాడు అమ్మదగ్గరకి వచ్చా డు.

''ఓహ్! పెర్‌ఫ్యూమ్'' మమ్మీ ముఖం ఆమె చీరలాగే గులాబీరంగులో వుంది.

''ఇంపోర్టెడ్, నీకోసమే తెప్పించాను'' అంటూ ఆయన ఆ సీసా మూత తెరిచి మమ్మీ చీరకి సెంట్ స్ప్రే చేశారు.

గట్టిగా అరచి వాళ్ళిద్దర్నీ దూరంగా తోసిపా రెయ్యాలని అనిపించింది వాడికి. కడుపులో ఉడికిపోతోంది. అంతలో వాడి దృష్టి అమిత్ వేపు మళ్ళింది. అమిత్ బంటీ ఆటసామా నంతా చుట్టూ పరచుకుని హాయిగా వాటితో ఆడుకుంటున్నాడు. బంటీ ఒక్క ఉదుటున వాడి దగ్గరకెళ్ళాడు.

''ఇవన్నీ నీకెవరిచ్చారు? నా సామాను నాకి చ్చెయ్'' అని అవన్నీ లాక్కున్నాడు.

అమ్మ గబగబా వచ్చింది, ''ఏమిటి బంటీ, ఏం చేస్తున్నావు. ఆడుకోనీపాపం. వాడు నీ తమ్ముడుకదా''

''కాదు, నాకే తమ్ముడూ లేడు''

అమ్మ వాడి రెండు చేతులూ పట్టుకుంది. బంటీ తన శక్తినంతటినీ ఉపయోగించి చేతు లు లాక్కోబోయాడు. కుదరకపోయేసరికి చే తుల శక్తంతా నాలుకకొచ్చింది.

''నా సామను నేను పరాయివాళ్ళకెందుకి వ్వాలి? మా నాన్న నాకోసం పంపించిన సామా న్లవి. నేనెవరికీ ఇవ్వను''

'ఫట్!'మని బంటీ చెంపమీద దెబ్బ పడింది. బంటీ గడగడ వణికాడు. దెబ్బ పెద్దగా తగల్లేదుగాని దెబ్బ వేసింది అమ్మ. ఎప్పుడూ కొట్టని అమ్మ. అదీ అందరి ముందూ... ముఖ్యంగా జ్యోతి, అమిత్‌ల ముందు.

వాడు ఏడవలేదు. కాని వాడి కళ్ళవెంట నిప్పురవ్వలు రాలాయి.

''శకూ, బంటీనెందుకు కొట్టావు?'' డాక్టర్ గారి కంచుకంఠం గదిలో ప్రతిధ్వనించింది. ''పిల్లలు వాళ్ళల్లో వాళ్ళు తగువులాడుకుంటే మధ్యలో నువ్వెందుకు వెళ్ళడం?''

డాక్టర్ బంటీదగ్గరకొచ్చి వాడినెత్తుకోడానికి ప్రయత్నించారు. కాని వాడు విదిలించుకుని దూరంగా జరిగిపోయాడు.

ఒక్కక్షణం గదిలో మౌనం ఆవరించింది. ఎక్కడివాళ్ళు అక్కడే నుంచుండిపోయారు. మరోక్షణానికి బంటీ ఒక్కొక్క సామాను ఎత్తి విసిరికొట్టడం ప్రారంభించాడు. దడదడమని సామాన్లు ఇల్లంతా చెల్లాచెదురుగా పడ్డాయి. తరువాత వాడు తన గన్ తీసుకుని బయటకి పరిగెత్తాడు. చెట్టెక్కి కూర్చుని రోయ్... రోయ్ మని పేల్చడం మొదలెట్టాడు.

ఎంతసేపయినా లోపల్నుంచి ఎవరూ రాక పోయేసరికి వాడికి ఏడుపొచ్చింది. చెట్టు మీంచి గెంతి కాళ్ళు, చేతులు విరగ్గొట్టుకుని మమ్మీని శిక్షిద్దామా అనుకున్నాడు. కాని ఆ పని చెయ్యలేకపోయాడు. అంతలో అత్తయ్య వచ్చింది. అమ్మే పంపివుంటుంది. తను స్వ యంగా వచ్చేటంత ధైర్యం వుంటేగా.

''బంటీ లోపలకొచ్చి భోంచెయ్యి నాన్నా'' అంది ఆమె.

బంటీ ఇంకా గట్టిగా, స్పీడుగా తుపాకీ శబ్దం చెయ్యసాగాడు.

''ఎందుకురా ఇలా ఏడిపించుకు తింటావు? కిందకు దిగు, అన్నం తిందువు గాని రా. తరువాత నీక్కావాల్సినంతసేపు తు పాకీ పేలుద్దువుగాని'' అని బతిమాలింది.

''నోరుమూసుకుని లోపలకి ఫో! నేను అన్నం తినను''

''మర్యాద మంటగలిపే కొంపల్లో ఇంత కంటే ఏం జరుగుతుంది. ఇంతటితో అయ్యిందా ఏమిటి? ఇంకా ఏమేం అనర్థాలు జరగాలని రాసుందో ఈ కొంపలో'' అని గొణు క్కుంటూ ఆవిడ లోపలకి వెళ్ళింది.

బంటీ వెక్కివెక్కి ఏడ్వడం మొదలెట్టాడు. తను ఆకలితో చచ్చినా ఈ ఇంట్లో ఎవరికీ బాధలేదు. మమ్మీకేం హాయిగా డాక్టర్‌కి వడ్డి స్తూండి వుంటుంది. అమిత్‌నయితే పక్కనే

కూర్చోబెట్టుకుని తినిపించినా తినిపిస్తుంది. ఈ దృశ్యాన్ని ఊహించుకుని వాడికి మరింత పిచ్చెక్కింది.

చెట్టుమీదే కూర్చుని కరువుతీరా ఏడుస్తున్నాడు. మనసులోవున్న కోపం, దుఃఖం అన్నీ కన్నీటిరూపంలో ప్రవహించి, బయటపడ్డాక, మెల్లగా వాడికి భయం వెయ్యసాగింది. అమ్మకి బాగా కోపం వచ్చిందేమో! అందుకే ఇంతవరకూ బయటకే రాలేదు. ఇంకెవర్నీ తన దగ్గరకి పంపనూలేదు.

కోపం, దుఃఖం, అవమానం, భయం, ఆకలి - వీటితో బంటీకి నీరసం ముంచుకొచ్చింది. మనసు మొద్దుబారిపోయింది. ఇప్పుడు వాడికి ఉద్రేకం, ఏడుపు రావడంలేదు. మాటిమాటికీ తలుపువంక చూడసాగాడు. ఇప్పుడెవరన్నా వచ్చి పిలిస్తే బాగుండునని వుంది వాడికి. ఆఖరికి జ్యోతి వచ్చి పిల్చినా వెళ్ళడానికి సిద్ధంగా వున్నాడు వాడు. కాని ఎవ్వరూ రాలేదు. అంతా భోజనాలు చేసి హాయిగా కూర్చునుంటారు. ఎవరూ తనగురించి ఆలోచించలేదా? అమ్మ కూడా?

మరోసారి వాడి కళ్ళు నిండాయి. మెల్లగా చెట్టుదిగాడు. ఒకసారి గేటు దగ్గరకెళ్ళాడు. గేటు తీసుకుని పారిపోదామా అనుకున్నాడు. కాని ఎక్కడికి పారిపోడం? ఎక్కడికి?

ఈ ఎక్కడికి అనే ప్రశ్నకి జవాబు దొరక్క, వెనక్కి తిరిగివచ్చి పచ్చికమీద పడుకున్నాడు. ఏమయినాసరే లోపలకి వెళ్ళకూడదని నిశ్చయించుకున్నాడు.

ఎంతసేపు వాడు అక్కడ అర్ధనిద్రావస్థలో పడున్నాడో తెలీదు, అంతలో లోపల్నుంచి అందరూ బయటకొస్తున్న సందడి వినిపించింది. వాడు వెంటనే కళ్ళు మూసుకున్నాడు. మెల్లగా అడుగుల చప్పుడు దగ్గరకొచ్చింది. మళ్ళీ మెల్లగా ఆ అడుగులు దూరమైపోయాయి. బహుశః అందరూ గేటువేపు వెళ్ళివుంటారు. కారు తలుపు తీసి మళ్ళీ వేసిన చప్పుడయింది కారు కదిలింది.

గేటు చప్పుడయింది. తరువాత సుపరిచితమైన అడుగుల చప్పుడు వాడి దగ్గరకొచ్చి ఆగింది. బంటి ఊపిరి బిగపట్టి కళ్ళు మూసుకు పడుకున్నాడు. ఎవరో వంగి వాడిని కుదిపి "బంటీ బంటీ" అని పిలిచారు. బంటీ బదులు పలుకలేదు. అప్పుడు రెండు చేతులు వాడిని దగ్గరకు లాక్కున్నాయి.

టేబుల్‌కి ఒకవేపు అమ్మ, మరోవేపు బంటీ కూర్చున్నారు. మధ్యలో అందమైన ప్లాస్టిక్ బాక్స్‌లో డాక్టర్‌గారు తెచ్చిచ్చిన సీసా వుంది. మాయదారి సీసా. డాక్టర్, అమ్మ కలిసి దాన్ని పదేపదే వాసన చూసి ఆనందించారు. ఆయన అమ్మ చీరమీద దాన్ని చల్లారు. అదయ్యాక 'ఫట్'మని తన చెంపమీద దెబ్బ... ఈమధ్యకాలంలో అమ్మ తనని కొట్టిన గుర్తేలేదు తనకి...

"బంటీ ఇకమీదట ఇలాగే చేస్తుంటావా?" అమ్మ గొంతు ఎక్కడో లోతునుంచి వచ్చినట్టుంది.

"ఇవాళ నువ్వు అలా చేయడం బాగుందా? ఎవరన్నా ఇంటికొస్తే ఇలాగే చేస్తావా?"

బంటి మౌనంగా వుండిపోయాడు. టేబుల్ మీదున్న సీసా కదుల్తున్నట్టుగా అనిపించింది వాడికి.

"ఇన్నేళ్ళనుంచీ నేను నీకు నేర్పింది ఇదేనా? మంచీ, మర్యాద, బుద్ధీ, ఇదే నేర్పానా? జ్యోతి చూడు ఎంత మర్యాదగా బిహేవ్ చేస్తుందో. చూడబోతే ఆ పిల్లల్ని చూసుకుందుకు వాళ్ళకు అమ్మకూడా లేదు. మరి నేను తొమ్మిదేళ్ళనుంచి నీకోసం తల పగలగొట్టుకుంటున్నాను. నీకోసమే తిరుగుతున్నాను. నీకోసమే ఇంట్లో పడుంటున్నాను. ఎక్కడికన్నా ఎవరింటికన్నా వెళ్ళడం పూర్తిగా మానుకుని కూర్చున్నాను. కాని నువ్వు... నువ్వు..."

ఉద్రేకంతో మమ్మీ స్వరమేకాక, శరీరమంతా కంపిస్తున్నట్టుంది.

"ఇవాళ నువ్వు నలుగురిలో నా పరువు, మర్యాద తీసిపారేశావ్. ఇన్నాళ్ళూ నేను నేర్పిందీ, నువ్వు నేర్చుకున్నదీ ఇదేనన్నట్టు చేశావ్..."

బంటీకి తనెక్కడో మునిగిపోతున్న ఫీలింగ్.

"నువ్వెందుకిలా చేస్తున్నావ్ బంటీ? ఇలా ఇంకెప్పుడూ చెయ్యద్దు నాన్నా చెయ్యద్దు..."

మమ్మీ వెక్కివెక్కి ఏడవసాగింది. ఆరోజు




ఏడ్చినట్టుగానే... అచ్చం అలాగే ఏడవసా గింది.

పరుగున వెళ్ళి అమ్మని కౌగలించుకోవాలి. తనూ గట్టిగా ఏడవాలనిపించింది బంటీకి. కాని వున్నట్టుండి, మధ్యనున్న ఆ సీసా వాడిని వెనక్కి తోసినట్టయింది. వాడి ఏడుపు లోలో పలే ఇంకిపోయింది.

★ ★ ★

చాలా సేపటివరకూ బంటీ రాతిబొమ్మలా కద లకుండా కూర్చున్నాడు. తల్లి వాడిని తీసికెళ్ళి మంచంమీద పడుకోపెట్టింది. వాడు మెల్లగా నిద్రలోకి జారుకున్నాడు.

కాని ఆమెకిమాత్రం నిద్రరాలేదు. ఇవాళ రోజంతా... రోజంతా జరిగిన ఒక్కొక్క సంఘ టనా ఆమె కళ్ళముందు కదలసాగాయి. బంటీ ఏడవటం, ఆట వస్తువులన్నీ చెల్లాచెదు రుగా విసిరికొట్టి రాద్ధాంతం చేసి బయటికి వెళ్ళిపోవటం... ఆ గొడవంతా ఇప్పుడే జరుగు తున్నంత తాజాగా ఆమె కళ్ళముందు తిరుగు తోంది.

అమిత్, జ్యోతి బెదురుముఖాలు పెట్టుకుని నుంచోడం, డాక్టర్ నుదురు చిట్లించడం, వీట న్నింటికీ కారణం తనేననిపించిందామెకి. అప్పుడు తన ముఖంలో దిగులు స్పష్టంగా కనిపించి వుంటుంది. అందుకే డాక్టర్ ఆమె వీపుమీద ఓదార్పుగా తట్టి ''పిల్లల తగువులకి నువ్వెందుకింత తలకాయ చెడగొట్టుకుంటావ్? టేకిట్ ఈజీ'' అన్నారు. కాని ఆయనా దీన్ని అంత సులువుగా తీసిపారెయ్యడానికి సిద్ధంగా లేరనే అనిపించింది.

ఆ క్షణంలో ఆమెకి లోపల ఎంత కోపం వచ్చిందంటే, వెంటనే బంటీని వాయించి పారేద్దామనిపించింది.

ఎయిర్‌గన్ 'సుయ్‌సుయ్'మనే శబ్దం ఆగ కుండా వినిపిస్తూనేవుంది. ఆ చప్పుడు తనకీ, డాక్టర్‌కీమధ్య దూరాన్ని విస్తరిస్తున్నట్టు అని పించిందా మెకి.

ఇప్పుడామె మనసులో కోపం ఏమీలేదు. బంటీ తన తప్పునే ఎత్తి చూపిస్తున్నాడన్న సంగతి స్పష్టంగా అర్థమైంది.

ఇదివరకు ఒకసారి వకీలు బాబాయి అననే అన్నారు, ''నువ్వు బంటీమీద ఇంత మోహం పెంచుకుని, వాడినే నీ జీవితకేంద్రంగా పెట్టు కుని బతకడం తప్పు. దీనివల్ల నీకుమాత్రమేకా దు, వాడికీ నష్టమే. లెట్‌హిమ్ గ్రో లైక్ ఎ బాయ్, లైక్ ఎ మేన్. ఇరవై నాలుగ్గంటలూ వాడినంటిపెట్టుకునీ, వాడిని నీ వెంట పెట్టు కునీ తిరిగితే వాడిగతేంకావాలి?'' అని.

పైకి ఆయన మాటని తను ఒప్పుకోకపో యినా, బంటీపట్ల తన ప్రవర్తన సరిగ్గా లేదన్న సంగతి ఆమెకీ అర్థమైంది.

ఇవాళ డాక్టర్‌తో పెరిగిన ఆత్మీయత చాటున, బంటీనుంచి తనను తాను విడి పించుకోవాలన్న భావన లేదూ?

తమ పరిచయం పెరిగాక డాక్టర్‌గారు తమ ఇంటికీ, పిల్లల్నీ పరిచయం చేశారు. జ్యోతిది చాలా మృదుస్వభావం. అమిత్ తుంటరి. సామాన్యంగా ఆడపిల్లలకి పట్టుదల ఎక్కువు న్నా శాంతగుణాన్ని వదిలిపెట్టరు. మగపిల్ల లు పుట్టుకతోటే అల్లరి, కోపం, తిక్క సహజగు ణాలుగా చేసుకునే పెరుగుతారు.

కాని బంటీ అలా తుంటరి, అల్లరి పిల్లా డు కాడు. మొండితనం చేస్తాడుగాని, వయసు కి మించిన ఆలోచనాశక్తి కూడా వుంది అలా అని ఆమె సగర్వంగా చెప్పుకుంటుంది.

''శకూ, వాడిమీద నీ ప్రభావం చాలానే పడింది. వాడసలు మగపిల్లాడిలా పెరగనేలే దు. చిలిపితనానికి, అల్లరికీ వాడికి నువ్వె క్కడా అవకాశమే ఇచ్చినట్టులేదు. ఆడవాళ్ళ లా పట్టుదలని, ఏడవడాన్ని బాగా నేర్పావు... అంతే!''

డాక్టర్ ఈ మాటలు క్యాజువల్‌గానే అన్నా తనకి అవమానం జరిగినట్లనిపించిందామెకి. ''నీది తప్పు అని నేను అనను గాని ఈ పరిస్థి తుల్లో జరిగేదిలాగే ఉంటుంది శకుంతలా'' అన్నాడాయన.

కాని ఈ పరిశోధనవల్ల ఒరిగిందేమీ లేదు. ఆమె మనసులో ముటుకు ఒక జంకు బయల్దే రింది. అది ఎక్కువవసాగింది. జీవితంలో మిగిలిన అన్ని సంబంధాలనూ తెంపుకున్న ఆమె పూర్తిగా బంటీయే తన సర్వస్వంగా



అతుక్కుపోయింది. తన మిగిలిన జీవితాన్ని వాడికే అంకితం చేసి బ్రతకాలనుకుంది. కాని ఆమె ఎన్నుకున్న దారి సరియైనది కాదు. ఆమె వేసే ప్రతి అడుగులోనూ పొరబాట్లే జరుగుతున్నాయి.

అప్పుడామె కొత్త జీవితాన్ని ప్రారంభించాలని నిశ్చయించుకుంది. అప్పుడూ ఆమెకి బంటీని దూరం చేసుకోవాలన్న ఉద్దేశమేమీ లేదు. తనకి దగ్గరగా వుంచుకోవాలన్నదే ఆమె కోరిక.

వేసవి సెలవులు రెండు నెలలూ పడిన బాధ, అప్పుడు బంటీ ప్రవర్తన! వయసుకి మించిన ఆలోచనలతో వాడున్న తీరు చూసి ఆమెకి చాలా దుఃఖం వచ్చేది. రోజులో ఎన్నోసార్లు తండ్రిని గుర్తుచేసుకోడం అలవాటున్న పిల్లాడు తండ్రిపేరే మర్చిపోయినట్లు, ఆ శబ్దమే తెలియనట్టుగా వుండిపోయాడు. అజయ్ తెచ్చిపెట్టిన సామాన్లన్నీ బీరువాలో దాచేశాడు. తల్లి సంతోషించేలా నడుచుకోవాలని సర్వ ప్రయత్నాలు చేశాడు.

కాని ఇలా ఒకరిమీద ఒకరు పూర్తిగా ఆధారపడి జీవించడం సరియైన పద్ధతి కాదు. ఎవరిదారి వారికుండాలి అనే ఆలోచన వచ్చాక ఆమె బంటీని కొద్దికొద్దిగా దూరంగా వుంచి వాడిలో ఆత్మవిశ్వాసం పెంపొందించేందుకు ప్రయత్నించింది.

వకీలుబాబాయి ఇన్‌డైరెక్ట్‌గా చెప్పిన మాటల్నే డాక్టర్‌గారు సూటిగా చెప్పారు.

"తల్లీ కొడుకులు ఒకర్నొకరు వాటేసుకుని కూర్చోడం, ముద్దులాడ్డం, ఇవన్నీ మానెయ్యాలి శకూ. దీనివల్ల బంటీకి చెడే తప్ప మంచి జరగదు..."

ఆరోజునుంచీ ఆమె బంటీని దూరంగా పడుకోబెట్టడం మొదలెట్టింది. తనకోసం కాక, బంటీకోసం తను కొత్తజీవితాన్ని ప్రారంభిస్తున్నానని మభ్యపడసాగింది. తను మరో వివాహం చేసుకుంటే బంటీకి తండ్రిలేని కొరత కనిపించదు. మనిషి మారితేనేం ఆ స్థానం శూన్యంగా వుందన్న కొరత తీరుతుంది కదా! అదీకాక వాడు ఇప్పటిలా ఒంటరిగా వుండక్కర్లేదు. మరో ఇద్దరు పిల్లల్తో కలిసి నార్మల్‌గా పెరుగుతాడు. హి విల్ గ్రో లైక్ ఎ బాయ్, లైక్ ఎ మ్యాన్

కాని ఆరోజు 'కంపెనీబాగ్'నుంచి ఇంటికొచ్చాక బంటీ ఏడ్చిన ఏడుపు... ఆరోజునుంచీ మారిన వాడి విచిత్ర ప్రవర్తన, మళ్ళీ ఇవాళ్టి... తుఫాను...

తను మళ్ళీ తప్పుచేసిందా? ఏదో సందర్భంలో డాక్టర్‌గారన్నారు. తనలో తప్పుచేసిన భావన తలెత్తినప్పుడు మనిషి తర్కంతో తనని తను సమర్థించుకోవాలని చూస్తాడు. లేకపోతే ఈ గిల్టీఫీలింగ్ తాలూకు భారాన్ని అతను మొయ్యలేడు. సమర్థింపు చాటున గిల్టీకాన్షస్ చోటుచేసుకొనే వుంటుంది.

అయితే తన మనసులో కూడా ఆ గిల్టీఫీలింగ్ వుందా? అన్నింటికీ బంటీ శ్రేయస్సు నెపంగా చేసుకుని తను తన స్వార్థాన్ని సాధించుకోడంలేదుకదా?

ఈమధ్యకాలంలో ఆమె మనసుకి దొరికిన నిశ్చింత, ప్రశాంతత, ధైర్యం ఇంతకుముందెప్పుడూ లభించలేదు. బయటకి పెద్ద మార్పులేమీ జరక్కపోయినా... అదే కాలేజ్, అదే ఇల్లు, బంటీ, అత్తయ్య... ఈ విషయాల్లో ఏ మార్పూ కనపడకపోయినా... లోపల తన మనసులో అదోవిధమైన తృప్తి చోటుచేసుకుంది. డాక్టర్‌గారితో ఉన్నంతసేపూ మనసు భారం తగ్గి పువ్వులా తేలికైపోతుంది.

ముప్పై ఐదేళ్ళు దాటినా తన మనసులో అన్ని విషయాలకి యవ్వనంలో నాటి ఉత్సాహం, ఆసక్తి మళ్ళీ చురుకుగా పుట్టుకు రావడం చూసి ఆమెకీ ఆశ్చర్యంగా అనిపించింది. డాక్టర్‌గారొస్తే ఆయనతో ఏకాంతంగా గడపాలని కోరిక... ఏకాంతం దొరకగానే...

వయసైనంత మాత్రాన మనసుకి యవ్వనం పడుచుదనం పోదు. ఆ వయసు తాలూకు భావాలు తృప్తి దొరక్క చచ్చిపోతాయంతే. లేదా మరింత చెలరేగి, బలం పుంజుకుని మనిషిని రెచ్చగొట్టి వేధిస్తాయి.

డాక్టర్‌గారి ప్రవర్తన ఆమె ధోరణికి విరుద్ధంగా వుంటుంది. ఒకరకమైన నిశ్చలత కనిపిస్తుంది. ఆయనకి జీవితంలో పరిపూర్ణంగా అన్నీ లభ్యమై వుంటాయనిపిస్తుంది.




ఇప్పుడు శకుంతల ఇంచుమించు ప్రతి విషయానికీ పూర్తిగా డాక్టర్‌గారిమీదే ఆధారపడుతోంది. పురుమడి తోడు ఎంత అవసరమో ఆమెకి తెలిసొస్తోంది.

ఇటీవల ఆమె తనకీ, డాక్టర్‌కీమధ్య ఎలాంటి అడ్డునీ, ఆటంకాన్నీ సహించలేకుండా వుంది. బంటీని కూడా.

రేపు డాక్టర్‌తో మాట్లాడాలి. ఆయన మాటలు వింటుంటే అదోరకం ధైర్యం వస్తుంది. ఆమె సమస్యలకి సమాధానం చెప్పగల మనిషి ఆయన.

కాని బంటీ? వాడి సమస్య పూర్తిగా వేరు.

ఒక్కసారిగా శకుంతలకి గొంతు ఎండిపోయినట్టు అయింది. ఆమె లోపలకి వెళ్ళి వేడినీళ్ళు తాగి వచ్చింది. బంటీ మెడవరకు రజాయి కప్పుకుని నిద్రపోతున్నాడు. వాడి ముఖం అజయ్‌ముఖంలాగే వుంది. ఇద్దరికీ ఎన్ని పోలికలు! కేవలం రూపంలోనే కాదు, స్వభావంలో కూడా.

అత్తయ్యా అననే అంది

''ఇంత నెత్తికెక్కించుకోకండమ్మా ఎంతైనా ఆ తండ్రికి కొడుకుకదా. ఆయన కూర్చున్న చోటునుంచి కంచం విసిరికొట్టేవాడు, వీడు గిన్నెలు విసిరికొడతాడు''

శకుంతల మనసులో విచిత్రమైన అశాంతి వ్యాపించింది. కాపురం చేసినన్నాళ్ళూ అజయ్ శకుంతల చేసే ప్రతి పనిలోనూ తప్పులు వెతుకుతూనే వున్నాడు. ఆమె స్వభావంలో ఏదో ఒక లోపాన్ని ఎత్తిచూపించి అవహేళన చేసేవాడు.

''శక్కూకి చాలా స్వంతవ్యక్తిత్వం ఎక్కువ''

''శక్కూది చాలా డామినేటింగ్ నేచర్''

''శక్కూ మరొకరి మాట వినేరకం కాదు''

''శక్కూ అలా...''

''శక్కూ ఇలా...''

అనిపించుకుంటూ ఏడు సంవత్సరాలపాటు ఆమె చేసే ప్రతి పనిలోనూ చూపే తప్పుల్నే మోస్తూ కాలం గడిపిందామె.

ఇప్పుడు ఈ బంటీ! వాడూ వాడి నాన్నలాగే తనని దోషిలా నిలబెట్టడానికి కంకణం కట్టుకున్నట్టున్నాడు.

కాని దీన్నింక భరించలేదు తను.

బంటీ తనకీ అజయ్‌కి మధ్యన అనుసంధానం కాలేకపోయాడు. పోన్లే, కాని ఇప్పుడు డాక్టర్‌కీ, తనకీ మధ్య అడ్డుమాత్రం కాకూడదు. అయితే అందుకు తనేం చెయ్యాలి?

తన అనుమానాలు, దిగుళ్ళు అన్నీ చీకటిలో కలసి, కరగిపోవాలన్నట్టుగా టప్మని లైటు ఆర్పేసింది.

పొద్దున్నే నిద్ర లేవగానే మళ్ళీ ఆమె మనసుని దిగులు ఆవరించింది. ఆయన పెళ్ళి తారీకుని నిశ్చయించారు. ఆ ఆనందంలో తను వాళ్ళని తన ఇంటికి భోజనానికాహ్వానించింది. నిన్న తను బొత్తిగా అశాంతిగా వుండటంవల్లనో ఏమో డాక్టర్ కూడా వూరుకున్నారు. కాని ఆయనకి తప్పకుండా చిరాకేసి వుంటుంది.

బంటీ డాక్టర్ విషయంలో విరోధభావంతో వున్నాడని ఆమెకీ తెలుసు. కాని మెల్లగా అన్నీ సర్దుకుంటాయనుకుంది. కాని క్రితంరోజు జరిగిన సంఘటన కారణంగా డాక్టర్‌గారు కూడా తననుంచి దూరంగా జరిగిపోతారేమోనన్న దిగులు పట్టుకుందామెకి.

ఒకవేళ అలా జరిగితే...? అజయ్ జీవితంలో తన పాత్రని పూర్తిగా తుడిచిపెట్టేసి కొత్తజీవితాన్ని ప్రారంభించాడు. అతనిప్పుడు చాలా సుఖంగా, తృప్తిగా బతుకుతూ ఉండి వుండొచ్చు. కాని తన హృదయం? తన జీవితం?

అజయ్‌ని తలచుకుంటేనే ఆమె మనసు నిండా చేదు నిండిపోయింది. ఒకవేళ బంటీ కూడా తన సుఖానికి అడ్డువస్తే వాడిని అజయ్ దగ్గరికి పంపించెయ్యాలంతే.

వెనుకొకసారి అజయ్ బంటీని తనతోబాటు తీసికెళ్ళాలనే అభిలాషని వ్యక్తంచేశాడు. కానీ ఈ మధ్యకాలంలో అతనినుంచి ఎటువంటి ఉత్తరమూ లేదు. అయినాసరే, అలాంటి పరిస్థితే వస్తే బంటీని అజయ్ దగ్గరకి పంపెయ్యడం ఖాయం.

అడ్డుగోడగా నిలవడమే బంటీ స్వభావం అయితే, అదేదో అజయ్‌కి, మీరాకి మధ్య

నిలబడతాడంతే, ఇలాంటి పిల్లాడినుంచుకుని బతకడం అంటే ఎంత కష్టమో అజయ్‌కి కూడా అర్థంకావాలి. జీవిత పుటలమీద రాసిన రాతల్ని తుడిచెయ్యడం అంత సులువైన పనికాదు.

అంతలో ఆమె కళ్ళముందు బంటీ అమాయకమైన ముఖం, అన్నెంపున్నెం ఎరుగని స్వభావం కదిలింది.

''అమ్మ లేకుండా నేనెక్కడికీ రానని డాడీతో చెప్పేశాను మమ్మీ

మమ్మీ! నేను నిన్నొదిలి ఎక్కడికీ వెళ్ళను మమ్మీ. ఏడవకు మమ్మీ... ఏడవకు''

వాడి మాటలు అలలు అలలుగా వినిపిస్తున్నాయి. ఉన్నట్టుండి శకుంతల వెక్కివెక్కి ఏడవడం మొదలెట్టింది. ఆపకుండా ఏడుస్తూనేవుంది.

సాయంత్రం డాక్టర్‌గారిదగ్గర కూర్చున్నప్పుడు కూడా శకుంతల మనసు తేలికపడలేదు. ఏమాటా కూడా పూర్తిగా మాట్లాడ్డానికి కుదరటంలేదు. డాక్టర్‌గారు ఏమనుకుంటున్నారో ఏమోగాని, శకుంతలకి మాత్రం తమ ఇద్దరిమధ్య ఎవరో అడ్డున్నట్టుగానే అనిపించడం నిజం. బహుశః బంటీరూపంలో అజయ్ అడ్డొస్తున్నాడేమో.



"ఏం శక్కూ, ఏమిటి సంగతి? చాలా చికాగ్గా కనిపిస్తున్నావే?"

'ఏం చెప్పాలి? తమిద్దరి సంబంధం బంటీకి ష్టంలేదని చెప్పాలా?... ఎలా?'

"బంటీ గురించి ఆలోచిస్తున్నావా?"

ఆమె దేన్నయితే దాచిపెట్టాలని ప్రయత్ని స్తోందో ఆ మాటే వచ్చింది. ఆమె ముఖంలో అదోరకమైన అలజడి.

"చూడు శకూ! బంటీ ప్రాబ్లెమ్ చైల్డ్ అన్న మాట నిజమే. కాని ఏం చెయ్యగలం చెప్పు. భరించాలిమరి. సహించక తప్పదు"

'ఎలా చెప్తున్నారో... ఇలాగేనా అనడం? బంటీ ప్రాబ్లెమ్ చైల్డ్ అంటే ఎలా? వాడేమన్నా పిచ్చివాడా ఏం? వాడికేమన్నా బుద్ధి భ్రమించిందన్నట్టుగా మాట్లాడతారేమిటీయన?

తనలా తల్లి మనసుతో ఆయన ఆలోచించ లేకపోవచ్చు. అది సహజమే. కాని ఆయన తండ్రిలా కూడా ఆలోచించలేదు!

"కాని ఇందులో ఆలోచించాల్సింది, బెంగె ట్టుకోవల్సింది ఏముంది? ఇది సహజమే"

"ఏమన్నారు?" ఒక్కసారిగా ఉలిక్కిపడి కాస్త గట్టిగానే అంది శకుంతల. ఆయన అజయ్‌ని దృష్టిలో పెట్టుకుని అనటంలేదుకదా? ఆమె ఇంతవరకు ఒక్కరోజు కూడా ఆయనదగ్గర అజయ్ గురించి మాట్లాడలేదు. అది ఆమెవల్ల కానిపని కూడా.

"బంటీకి అలా వుండటమే అలవాటయిపోయింది. నీతో ఒక్కడే వుండి, ఒంటరిగా పెరిగి చాలా పొజెసివ్‌గా తయారయ్యాడు. వాడికి నీపక్కన ఇంకెవర్నీ చూడ్డం ఇష్టం వుండదు. నువ్విప్పుడు ఇంకెవర్నీ..."

శకుంతలకి వకీలు బాబాయి చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. "నీకు తెలీదు శకుంతలా, అజయ్ చాలా ఇగోయిస్టిక్. దాన్తోబాటు చాలా పొజెసివ్ కూడా. నువ్వు నీ అస్తిత్వాన్ని పూర్తిగా వదులుకుంటేనే నీకు అతను పూర్తిగా లభ్యమవుతాడు. నువ్వు నీ అస్తిత్వాన్ని మిగుల్చుకోవాలంటే నువ్వు అజయ్‌ని వదులుకోక తప్పదు"

తన వ్యక్తిత్వాన్ని, అస్తిత్వాన్ని వదులుకోడం ఆమెవల్లకాలేదు. అందువల్ల ఆమె అజయ్‌ని వదులుకోవల్సొచ్చింది. ఇప్పుడూ అంతే, బంటీకోసం తన అస్తిత్వాన్ని వదులుకుంటే డాక్టర్ని పోగొట్టుకోక తప్పదు. కాని అది సాధ్యమయ్యేదేనా?

"శకూ, నువ్విప్పుడు చాలా ధైర్యంగా ముందడుగు వెయ్యాలి. ఇలాంటి పిల్లలమీద ఒత్తిడినుపయోగిస్తే మందకొడిగా తయారవుతారు. మరీ మృదువుగా వ్యవహరిస్తే పెంకిగా తయారవుతారు"

రోగికి వైద్యసలహా ఇస్తున్నంత సునాయాసంగా డాక్టర్ చెప్తున్నారు.

"బంటీ మనసుని బేలన్స్‌కి తేవాలంటే, ముందు నువ్వు నీ మనసుని బేలన్స్‌లో వుంచుకోవాలి. నువ్వు తెలివైనదానివి. నేను ఎక్కువగా ఏమీ చెప్పాల్సిన అవసరంలేదు."

ఈ మాటలవెనుక ఏమన్నా మరో అర్ధముందా అని పరీక్షిస్తున్నట్టుగా శకుంతల డాక్టర్‌గారి ముఖంలోకి పరీక్షగా చూసింది. కాని ఆయన ముఖం ఎప్పటిలాగే ప్రశాంతంగా వుంది.

శకుంతల కళ్లు నీళ్ళతో నిండాయి. ఒకసారి మోసపోయిన మనసు దేన్నీ సహజమైన ధోరణిలో స్వీకరించడానికి సిద్ధంగా లేదు.

డాక్టర్‌గారు స్నేహంగా ఆమె వీపుని నిమిరారు.

అయితే ఆయనకి బంటీపట్ల విరోధభావమేదీ లేదన్నమాట. వాడిమీద కోపం ఏమీలేదన్నమాట. ఆయన స్పర్శతో ఆమె మనసులో వున్న సందేహాలన్నీ విడిపోయాయి.

"కాని..." శకుంతల మాటలు సగంలో ఆగిపోయాయి.

"కాని ఏమిటి?"

"మీకు తెలియదు డాక్టర్... బంటీ స్వభావం పూర్తిగా అజయ్‌లాగే. వాడు నా పక్కన మిమ్మల్ని భరించలేడు. ఎప్పటికీ భరించలేడు" తన మనసులోని భయాలన్నీ బెంగలన్నీ డాక్టర్ దగ్గర వెళ్ళగక్కెయ్యాలనిపించిందామెకి.

"దానివల్ల నష్టమేమిటి?"

ఈ ప్రశ్నకి జవాబు చెప్పలేకపోయింది శకుంతల.




''చూడు శకూ... నువ్వు బంటీని నీ భర్తతో పోల్చి చూడ్డం సరియైన పద్ధతి కాదు. ఇప్పుడు బంటీ బాధ్యతని నాకొదిలెయ్యి. ఊరికే తల కాయ పాడుచేసుకోకు''అన్నారు సంభాషణని తేల్చేస్తూ.

బంటీ గురించి ఆమె ఆలోచించకుండా ఎలా వుండగలదు? చాలాసేపట్నుంచి లోలో పల గూడుకట్టుకున్న ఉద్విగ్నత అంతా డాక్టర్ ఆమెని తన బాహువుల మధ్య బంధించిన మరుక్షణమే పొంగిప్రవహించింది. ఆ ఓదా ర్పు ఆమెకి అవసరం కూడా.

డాక్టర్ చాలాసేపు, ఆమె వీపుని, భుజాల్ని నిమురుతూ, ఓదార్పుగా మాట్లాడుతూనే వున్నారు ఆ ఓదార్పు వాక్యాల్లో, ఆ స్నేహపూర్వ కమైన స్పర్శలో ఏ మంత్రం వుందో శకుంతల కి తనలోని బిగువు, బింకం కరిగిపోతున్నట్లు, మనస్తాపం అంతా చల్లబడ్డట్టు అనిపించింది. సమస్యలన్నీ విడిపోయినట్లు, మార్గమంతా సు నాయాసంగా, సుగమంగా అయిపోయినట్లు అనిపించింది.

ఇంతవరకు గడిచిన జీవితమార్గంలో దారంతా తానొక్కతే నడచి, కష్టనష్టాలన్నీ తానొ క్కతే ఎదుర్కొన్నా ఇంత ఆత్మవిశ్వాసం, ఇంతటి శక్తి తనలో చేటుచేసుకోలేదు. ఈరోజు తనని తను డాక్టర్‌కి అర్పించుకుని ఆమె అన్ని దిగుళ్ళనుంచి దూరమయింది.

తనని సంపూర్ణంగా అర్పించుకుని, ఏ సందేహమూ, ఏ చింతా లేకుండా అంకితమై పోయే మనిషి ఎంత సుఖంగా వుండగలడు!



మమ్మీకి పెళ్ళయింది.

పెళ్లంటే అన్ని పెళ్ళిళ్ళలాంటిది కాదు. బాజాభజంత్రీలు లేవు, గుర్రపుసవారీ- ఊరే గింపులేదు. టపాకాయలు, పూలబాణాలు లేవు.

బంటీ ఎదురుగానే మమ్మీ పెళ్ళి అయింది.

సింపుల్‌గా అలంకరించిన క్లబ్ లాన్స్‌లో... అపరిచితులెందరో గుంపులు గుంపులుగా. హాస్యం, తమాషాలు, ఫలహారాలు, పూలహారా లు, అభినందనలు... కంగ్రాట్స్... అరె బంటీ...! మిఠాయితిను బాబూ... మీ అమ్మ పెళ్ళి మిఠాయి! ఎన్నోరకాల గొంతులు, ఎన్నోర కాల మాటలు.

మమ్మీ డాక్టర్ జోషిని పెళ్ళి చేసు కుంటుందని బంటీకి ఎలా తెలిసిందంటే...? ఆరోజు...

బంటీ తన టేబుల్‌ముందు కూర్చుని హోంవర్క్ చేసుకుంటున్నాడు. మమ్మీ కాలేజ్ ఫైల్ చూస్తోంది. అప్పుడు చంకలో ఒక పాపా యినెత్తుకుని వెనుక గుమ్మంలోంచి వచ్చింది టిటూ వాళ్ళమ్మ.

ఆవిడని చూసి మమ్మీ కొంచెం ఉలిక్కిప డింది. ''అరె, మీరా? రండి, కూర్చోండి? ఏమిటి సంగతి? ఏమన్నా విశేషమా?''

''ఏం చెయ్యడం చెప్పండి. పక్కనే వున్నా రావడానికి బొత్తిగా తీరదు. పొద్దుట్నుంచి రాత్రి దాకా ఇంట్లోపనే సరిపోతుంది''

బంటీవేపు చూసి అంది...

''మీ బంటి చూడండి ఎలా చక్కగా చదు వుకుంటూ కూర్చున్నాడో! మా పిల్లలూ వున్నా రు, ఎందుకు? ఇరవైనాలుగ్గంటలూ ఇంట్లో మహాభారతమే''

''టిటూ రాలేదాండీ?''

''వాడెక్కడొస్తాడు? కేరమ్స్ పిచ్చి వాడికి''

''బంటీ లోపలకి వెళ్ళి టీ పెట్టమని అత్త య్యతో చెప్పిరా''

''ఒద్దొద్దు. నేనిప్పుడే టీతాగి వచ్చాను. ఇవాళ నేను టీ తాగడానికి రాలేదు. మిఠాయి పెట్టాలి మీరు. మా ఆయన నిన్న రాత్రే చెప్పారు శుభవార్త! అభినందించి రమ్మన్నారు కూడా. ఎంతయినా ఇరుగుపొరుగువాళ్ళం



కదా!''

మమ్మీ ముఖం ఎందుకలా ఎర్రబడు తోంది?

''మొదట్లో ఒకటి రెండుసార్లు డాక్టర్‌గారిని మీ ఇంట్లో చూసి ఎవరికైనా ఒంట్లో బాగోలే దేమో అనుకున్నాను. తరువాత, అంతా బాగానే వున్నారని బంటీ చెప్పాక, ఊరికే కాలక్షేపానికొస్తున్నారేమోలే అనుకున్నాను''

మమ్మీ మౌనంగా కూర్చుంది. ఒకసారి బంటీవంక చూసింది.

''నాకసలు ఇరుగు పొరుగిళ్ళ వ్యవహారాలు పట్టించుకోడం అలవాటులేదు. ఇంక పలుక రించడాలు, ఆరాలు తియ్యడాలు అనే ప్రశ్నేలే దు. అయినా మీరు చదువుకున్నవారు. కాలేజీ ప్రిన్సిపాల్ అన్నాక ఎవరో ఒకరు వస్తూనే వుంటారు''

మమ్మీ బదులు చెప్పకుండా బొమ్మలా కూర్చుంది. ఆవిడ మాట్లాడుతూనేవుంది.

''బంటీకి చాలా సంతోషంగా వుండి వుంటుంది. పాపం ఒక్కడే ఒంటరిగా తిరిగేవా డు. చూస్తే ఎంతో జాలేసేది. ఇప్పుడు చక్కగా నాన్న, అక్క, తమ్ముడు అందరూ దొరుకుతా రు''

అప్రయత్నంగా వాడి చూపులు, మమ్మీ చూపులు కలుసుకున్నాయి. ఆ కళ్ళల్లో వాడి కేం కనిపించిందో ఇక అక్కడ మరొక్కక్షణ మైనా కూర్చోడం వాడివల్ల కాలేదు.

★ ★ ★

రాత్రి మమ్మీ వాడికి వివరంగా అర్థమ య్యేలా చెప్పసాగింది... ''నీకక్కడ బాగుంటుంది బంటీ... నీకు తప్పకుండా నచ్చుతుంది నాన్నా''

మమ్మీ ఇంకా ఏమేమో చెప్తోంది. బంటీ అన్నీ వింటున్నాడు. ఒక్క ప్రశ్న కూడా అడగ లేదు. ఒక్కసారి కూడా వ్యతిరేకధోరణి కనపర చలేదు.

కాని మాటిమాటికీ వాడి కళ్ళముందు వాడి నాన్న ముఖం కదలసాగింది.

బంటీ మెడలవరకు రజాయి కప్పుకుని పడుకున్నాడు. గదిలో దీపంలేదు. టేబుల్ ల్యాంప్ వేసుకుని మమ్మీ ఏదో రాసు కుంటోంది. ఈమధ్య మమ్మీ ఎప్పుడూ ఏదో ఒకపనిచేస్తూ కనిపిస్తోంది.

సగం వెలుగు, సగం చీకటిలో కూర్చున్న మమ్మీ విచిత్రంగా కనిపిస్తోంది. ''బంగాళాదే శపు మంత్రగత్తె'' కథని అత్తయ్య చెప్పిందో, తనే ఎక్కడన్నా చదివాడోగాని... సరిగ్గా గుర్తులే దు... ఆ మంత్రగత్తె శరీరంనుంచి సగం చీకటి, సగం వెలుగూ ప్రసరించేవట. అది తల్చుకుంటే వాడికి భయం వేసింది. డాక్టర్ మంత్రం వేసేలాంటి ఆ సీసా తెచ్చినప్ప ట్నుంచీ వాడి మనసులో అదోరకమైన దిగులు ప్రారంభమైంది. ఒకసారి ధైర్యం చేసి ఆ సీసాకోసం వెదికాడు. అది దొరకలేదు.

ఒకసారి మమ్మీ టేబుల్‌వైపునుంచి ముఖం తిప్పింది. వెనక్కితిరిగి మెల్లగా 'బంటీ' అని పిల్చింది.

బంటీ చటుక్కున కళ్ళు మూసుకున్నాడు. తనకి పాతదైన అతి పరిచితమైన మమ్మీ స్వరం! మెల్లగా భయం తగ్గింది.

''నిద్రొచ్చిందా నాన్నా?'' అంటూ మమ్మీ దగ్గరకొచ్చింది. రజాయిని సరిచేసి ఆ మంచంమీద కూర్చుని వాడినుదురు, బుగ్గలు నిమరసాగింది.

మమ్మీ స్పర్శవల్ల బంటీ మనసు ఆర్ద్రమైంది. రజాయి తీసేసి మమ్మీని వాటే సుకోవాలనిపించింది.

కాని పొంగివస్తున్న ఉద్వేగాన్ని అణచిపెట్టు కుందుకు వాడు పెదవి బిగపట్టి దొడ కరచిప ట్టి పడుకున్నాడు.

''అమ్మా...''

అంటూ అత్తయ్యొచ్చింది. ఈమధ్య ఆవిడ కేమైందో పూర్వంలా మాట్లాడనే మాట్లాడదు. ''అమ్మా, నేను హరిద్వారానికి వెళ్ళాలను కుంటున్నాను. టికెట్ తెప్పించండమ్మా''

అత్తయ్య గొంతు అలా మారిపోయిందే మిటి?... ఒక్కసారి కళ్ళు తెరచి చూద్దామా అనిపించింది బంటీకి. అత్తయ్యెందుకు హరి ద్వారం బయల్దేరింది?

''ఏమయిందని అత్తయ్యా'' మమ్మీ గొంతు ఎంత తియ్యగా వినిపిస్తోందో. మమ్మీ ఇలా

తియ్యగా మాట్లాడగా విని చాలా రోజులైపోయింది.

''ఇన్నాళ్ళూ మీసేవ చేసుకున్నానమ్మా. ఇంకైనా భగంతుడిసేవ చేసుకుందామని...''

''ఏమయిందో చెప్పచ్చుగా...''

అత్తయ్య మాట్లాడలేదు. ఏడుస్తోందా ఏమిటి?

''నీకు నామీద కోపం వచ్చిందా అత్తయ్యా?''

మమ్మీ కరిగి నీరవుతున్నట్టుగా మాట్లాడుతోంది.

''మేం ఎంతైనా పనిచేసుకు బ్రతికేవాళ్ళం. కోపం తెచ్చుకునే తాహతు మాకెక్కడిదమ్మా. దేవుడు నోరిచ్చాడు. ఊరికే వుండలేక మనసు కనిపించినదేదో వటవట వాగేస్తుంటాను''

బంటీ మనసు కలవరపడింది.

''ఎదిగిన పిల్లాడిని దగ్గరుంచుకుని మీరు చేస్తున్నపని మంచిది కాదమ్మా. పెద్దవాళ్ళ వ్యవహారం. ఎవరూ మొహంమీద చెప్పటంలేదుకదా అని ఇది సరియైనపనే అనుకుంటున్నారా? మీకు తెలుసు. అజయ్‌బాబుగారి పద్ధతి నాకూ నచ్చలేదు. ఆయనంటే నాకూ ఒళ్ళుమంటే. కాని మీరూ ఆయనగారి పద్ధతినే, ఆయన దారినే నడుద్దామనుకుంటున్నారు కదమ్మా''

అమ్మ వింటూ పెదవి కరచిపట్టి కూర్చుని వుంటుంది. జవాబు చెప్పలేని సమయంలో అమ్మ అలాగే చేస్తుంది.

''పిల్లాడి ముఖం చూస్తున్నారా అసలు. అజయ్‌బాబుగారు మీ జీవితాన్ని పాడుచేశారు. మీరేమో పిల్లాడి జీవితాన్ని పాడుచెయ్యబోతున్నారు. పిల్లాడు లోలోపల దిగులుపడి, క్రుంగి చిక్కిపోతున్నాడు''

''అత్తయ్యా, నువ్వంటే నాకెంతో గౌరవం... నా తల్లికంటే ఎక్కువే నీకు దగ్గరయ్యాను. అయినా మా అమ్మ కూడా నా స్వంత విషయాల్లో ఎప్పుడూ తలదూర్చలేదు. అలాంటి అధికారాన్ని నేనెవరికీ ఇవ్వలేదు. ఆ పద్ధతి నాకు నచ్చదు''

''నేను ఇందాకే చెప్పాకదమ్మా. నాకు హరిద్వారానికి టిక్కెట్టు తెప్పించిచ్చెయ్యండి''

''సరే, నువ్వు వెళ్ళాలనుకున్న రోజుకి ఏర్పాటు చేస్తాను. ఈ ఇంట్లో నీకేం కావాలంటే అది తీసికెళ్లు. ఈ ఇంట్లో నాకున్నంత అధికారం నీకూ వుంది. ఇంకేం చెప్పమంటావు?''

అమ్మ స్వరం మళ్ళీ మృదువుగా పలికింది. అయితే అత్తయ్య వెళ్లిపోతుందా? అత్తయ్య లేకుండా తనెలా వుండగలడు? రేపు అత్తయ్యని ఆపుచేసెయ్యాలి. అమ్మమాట అలా వుంచి, తనమాట కాదనదు. వినితీరుతుంది. తను కూడా బంటీనొదిలి ఎలా వుండగలదు? ఒకవేళ తనమాట వినకుండా ఆమె బయల్దేరి వెళ్లిపోతే?

'టిక్'మని శబ్దం. మమ్మీ బహుశః టేబుల్ ల్యాంప్ ఆర్పివుంటుంది. బంటీ కళ్ళు తెరచాడు. మమ్మీ మెల్లగా వచ్చి తన మంచంమీద వాలింది. చీకటొక్కటే మిగిలింది. అంతా చీకటి... చీకటిమయం...

అత్తయ్య వెళ్ళిపోయాక బంటీ మనసు అస్తవ్యస్తం అయిపోయింది. అమ్మ వివాహం తరువాత ఇల్లే అస్తవ్యస్తం అయిపోయింది.

ఒక్కరోజులో ఇంట్లోనుంచి బోలెడన్ని సామానులు ఆ ఇంటికి వెళ్లిపోయాయి. సోమవారంనాటికి ఈ ఇంట్లోంచి అమ్మ కూడా ఆ ఇంటికి చేరిపోతుంది. మరి బంటీ?

అత్తయ్య లేకపోతే బంటీకి ఒక్కక్షణం గడవదు. మరే ఇంట్లో వున్నా బాగుండదు.

అత్తయ్య ఊరికెళ్ళిన నాటి జ్ఞాపకాలు వాడి మనసులో ఇంకా పచ్చిపచ్చిగానే వున్నాయి.

అత్తయ్య ప్లాట్‌ఫాంమీద నుంచుంది. ఒక చిన్న రేకుపెట్టె, దానిమీద ఒకమూట. మమ్మీ ఆవిడకి ఏవేవో సామాన్లు ఇద్దామని చూసింది. ఆవిడ దేన్నీ ముట్టుకోలేదు. బంటీని దగ్గరకి తీసుకుని వదలకుండానుంచుంది. ఆవిడ కళ్ళనుంచి ఆగకుండా నీళ్ళు ప్రవహిస్తూనే వున్నాయి.

బంటీ కూడా అత్తయ్యని కౌగలించుకుని నుంచున్నాడు. వాడి కళ్ళల్లో నీళ్లు లేవు. అత్తయ్య నిజంగా వెళ్ళిపోతోందా అన్నది నమ్మశక్యం కాకుండా వుంది వాడికి. తన చిన్ని అరచేతులతో ఆవిడ చేతిని ప్రేమగా పట్టుకు





న్నాడు.

మమ్మీ పర్స్‌తీసి ఒక వందరూపాయలనో టు ఆవిడ చేతిలో పెడుతూ-

"బంటీమీద ఒట్టు. నువ్విది తీసుకోక తప్ప దు అత్తయ్యా..." అంది

"ఒట్టు పెట్టి నన్నిబ్బంది పెట్టకమ్మా. నాకే మీ వద్దు. దేవుడి సాన్నిధ్యానికి వెళ్తున్న మని షిని నాకు డబ్బుతో పనేమిటి? నాదొక్కమాట నెరవేర్చండమ్మా. బంటీని అలక్ష్యం చేయ కండి. అసలే తండ్రి ప్రేమని కోల్పోయాడు. ఇప్పుడు తల్లినీ కోల్పోయి అనాధ కాకూడదు"

అమ్మ కళ్ళల్లోనూ నీళ్ళు నిండాయి.

"ఎంత మాటన్నావు అత్తయ్యా..." ఇంత కంటే ఎక్కువగా ఆమె ఏమీ అనలేకపో యింది.

అత్తయ్య వెళ్ళిపోయింది. స్టేషన్‌నుంచి వెనక్కి తిరిగి వచ్చేటప్పుడు బంటీ మౌనంగా అమ్మ పక్కన కూర్చున్నాడు. అమ్మ బంటీ అని వాడిని వాటేసుకున్న వెంటనే వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టాడు. "అత్తయ్యని తీసు కురా మమ్మీ వెనక్కి తీసుకొచ్చెయ్యి"

"ఏడవద్దు నాన్నా... కొన్నాళ్ళల్లో తనే తిరిగి వచ్చేస్తుంది. నిన్ను వదిలిపెట్టి వుండటం తనవల్లకాదు"

కొద్దిసేపటి క్రితం ఫ్లాట్‌ఫారంమీద నుంచు న్నప్పుడు కూడా బంటీకి ఆశగానే అని పించింది. అత్తయ్య ఎక్కడకీ వెళ్ళదు. తనని వదిలి ఎక్కడకీ వెళ్ళలేదు అని. కాని ఇప్పుడు అమ్మ ధైర్యం చెప్పినా వాడికింక నమ్మకంలే దు. అత్తయ్య ఇకరాదు. ఎప్పటికీ రాదు అనే అనిపిస్తోంది.

ఈరోజు కొత్త ఇంటికి వెళ్ళాలి. సాయంత్రం నాలుగుగంటల తరువాతే శుభముహూర్తం వచ్చేది. డాక్టర్‌గారు ముందురోజే బయల్దేర మని బలవంతం చేశారు.

కాని అమ్మ, "ఇన్నాళ్ళు ఆగాం, ఇంక ఒక్కరోజులో మునిగిపోయేదేం వుంది? మీరు నమ్మినా, మానినా నేను మాత్రం దుర్ముహూ ర్తపు వేళలో ఏపనీ చేయను. మంచి ఘడియ చూసే ముఖ్యమైన పనులు చేస్తాను" అనే సింది.

ఇవాళ వెళ్ళాల్సిందే. మిగిలిన కాస్త సామా ను అమ్మ ఆ ఇంటికి పంపించేసింది. బంటీ స్కూలునుంచి వచ్చాడు. గిన్నెల్లేని వంటిల్లు. బట్టల్లేని అలమార్లు, పుస్తకాల్లేని టేబుల్, కార్పె ట్స్ లేని నేల.

ఖాళీ అయిన ఆటసామాన్ల బీరువా చూసి బంటీకి నాన్న జ్ఞాపకం వచ్చారు. ఆటబొమ్మల న్నీ కళ్ళముందు కదిలాయి. అన్నీ నాన్న పంపిన సామాను.

వాడు తండ్రి తాలూకు ఆలోచనల్లో మునిగి పోయాడు. నాన్నకి ఈ ఇంటి అడ్రస్ మటుకే తెలుసు. ఈసారి ఆయనొస్తే కబురు ఎక్కడికి పంపిస్తారో? ఆ ఇంటి అడ్రస్ నాన్నగారికెలా తెలుస్తుంది. ఎన్నాళ్ళయిపోయిందో నాన్నగా రు ఒక్క ఆటవస్తువు కూడా పంపించలేదు. ఒక్కసారి కూడా కబురు చెయ్యలేదు. అమ్మకి పెళ్ళయిన సంగతి నాన్నగారికి తెలి సుంటుందా? నాన్నగారొచ్చి ఎన్నాళ్ళయిపో యిందో ఒకటి... రెండు... మూడు... ఆరు... ఏడు... ఎనిమిది నెలలయిపోయింది.

అంతలో డాక్టరుగారి కారొచ్చి ఆగింది. డాక్ట రుగారు రాలేదు. అమ్మ కాలేజినుంచి వచ్చే టైమయింది.

బంటీ వరండా మెట్లమీద కూర్చున్నాడు. లేత ఎండలో వాడికి తన చిన్నారి తోట చాలా ఆకర్షణీయంగా కనిపిస్తోంది. మధ్యలో నీళ్ళు పెట్టేపైపు పాములా పడివుంది.

టక్‌టక్‌మని చెప్పులు చప్పుడు చేసు కుంటూ అమ్మ వచ్చింది. వెంట తోటమాలి హీరాలాల్ కూడా వున్నాడు

ఇదివరకు అమ్మ కాలేజినుంచి వచ్చేటప్ప టికి తన ముఖం వాడిపోయి వుండేది. ఇప్పు డు కాలేజినుంచి వచ్చేటప్పుడూ, వెళ్ళేటప్పు డూ కూడా ఒకేలా తాజాగా వుంటోంది. ఈమ ధ్య అమ్మ ఎంత సంతోషంగా, చురుకుగా కనిపిస్తోందో! పాపిట్లో సింధూరం మెరుస్తూ వుంటుంది. మొదటిరోజు అమ్మ తలమీద సింధూరం వాడికి విచిత్రంగా కనిపించింది. ఇప్పుడూ వాడి దృష్టి మొదట ఆ సింధూరం మీదకే వెళ్తుంది.

"స్కూలునుంచి వచ్చేశావా నాన్నా? ఏమ



'సాహసమే నా ఊపిరి' అంటున్న జూలీబ్రిస్టో

# పిల్లకాదు పిడుగు

'గగనంలో విహరిస్తాను ఘనకీర్తిని సాధిస్తాను' అంటూ ఎగురుతున్న విమానంపై నిలబడిన జూలీ





సాహసి జూలీబ్రిస్టో

# సచిత్ర విచిత్రం

ఇటీవల ఇంగ్లాండ్‌లో జరిగిన ఓ 'ఎయిర్ షో'లో విమానం రెక్కలపై నిలబడి ప్రయాణించి, ప్రేక్షకుల్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తింది పంధొమ్మిదేళ్ళ జూలీబ్రిస్టో. నిజానికి ఈ విన్యాసం చేయవల్సిన యువతి చివరినిముషంలో నిరాకరించడంతో, అప్పటివరకూ జరిగిన రకరకాల విన్యాసాలు చూస్తూ ఉత్తేజంపొందిన జూలీ నరాసరి నిర్వాహకుల వద్దకు వెళ్ళి "నేనీ ప్రదర్శన ఇస్తాను. దయచేసి అనుమతించండి" అంటూ స్వయంగా అడిగింది. కూడా వచ్చిన ఆమె బోయ్ ఫ్రెండూ, నిర్వాహకులు ఎంత చెప్పినా వినక మొండిపట్టు పట్టి ఎట్టకేలకు అనుమతి సంపాదించుకుంది.

ఆ తర్వాత విమానచోదకుల దుస్తులు ధరించి, సేఫ్టీబెల్టు పెట్టుకొని విమానం రెక్కలపై నిర్భయంగా నిలబడి ఆకాశంలో షికార్లు కొట్టిందామె. "ఏమాత్రం పూర్వానుభవం లేకున్నా సాహసంతో ఈ విన్యాసాన్ని చేసి 'శభాష్' అన్పించుకోవడం కేవలం జూలీబ్రిస్టోకే సాధ్యం" అంటున్నారు ప్రదర్శన ఆసాంతం ఉద్విగ్నంగా తిలకించిన ప్రేక్షకులు.

న్నా తిన్నావా? ఇంక మనం బయల్దేరాలి పద''

హీరాలాల్ ఒక్కొక్కటిగా అన్ని తలుపులూ మూసేశాడు. అమ్మ బంటీ భుజంమీద చెయ్యేసి మాలికి సూచనలిస్తోంది.

''బంటీ వేసిన మొక్కలన్నీ తీసి ఆ ఇంటికి తీసుకురా. బొండుమల్లె, గులాబీ, జాజి... ఇవన్నీ. ఇంకా ఏమేం తీసికెళ్దాం బంటీ?'' అంటూ...

ఆమె దృష్టి మామిడి మొక్కకేసి పోనిచ్చింది. ''ఈ మామిడి మొక్కని తీసుకెళ్ళి పాతితే పెరుగుతుందా? బతుకుతుంది అంటే దాన్నీ తెచ్చెయ్యి''

కార్లో కూర్చుని బంటీ ఒకసారి తమ ఇంటికేసి చూశాడు. కిటికీమీద గడ్డాన్నాన్చి చూస్తూనే వున్నాడు. ఇప్పుడివన్నీ దూరమైపోతున్నాయి. ఆ ఇంటిని, ఆ పరిసరాలనీ విడిచిపోవాలనే నిజాన్ని వాడు నాలుగైదురోజుల్నుంచి తనకి తానే వివరించి చెప్పుకుంటున్నాడు.

కారు బయల్దేరింది. కాని ఇదేమిటి? ఇల్లు, తోట, హీరాలాల్, మాలి అన్నీ కారుతోపాటే పరుగెత్తుకువస్తున్నట్టున్నాయి. ఎవరూ అక్కడ మిగిలిపోలేదు.

''బంటీ'' అని అమ్మ వాడిని దగ్గరికి లాక్కుంది. ''అది మన స్వంత ఇల్లు కాదు నాన్నా. ఇప్పుడు వెళ్తున్నామే, అదే ఇకమీదట మన ఇల్లు. మనం విడిచిపెట్టిన ఇల్లు కాలేజీ వాళ్ళది. అక్కడ మనకింకెవరున్నారు చెప్పు? ఇప్పుడుండబోయే ఇంట్లో మనవాళ్ళంతా వున్నారు''

రానురాను అమ్మ గొంతు గద్గదమయింది. సంతోషంవల్లనో, దుఃఖంవల్లనో తెలీదు. కాని బంటీ మనసుకి సంతోషంగాని, దుఃఖంగాని ఏదీ కలగటంలేదు. తను 'వెళ్తున్నాను' అన్న అనుభవం ఒక్కటే తెలుస్తోంది.

★ ★ ★

డాక్టర్‌గారి బంగళా కొత్తగా కట్టించారేమో అన్నంతగా మెరిసిపోతోంది.

బంటీ అమ్మతోబాటు ఈ ఇంట్లోకి మొదటిసారి ప్రవేశిస్తున్నాడు. అంతా పోర్టికోలోనే నుంచున్నారు. డాక్టర్, జ్యోతి... అంతా కొత్త బట్టలు కట్టుకుని నవ్వుతూ నుంచున్నారు.

''హలో బంటీ'' డాక్టర్ పరుగున వచ్చి బంటీని ఎత్తుకుని వాడి రెండు బుగ్గలమీద ముద్దిచ్చారు. బంటీ వ్యతిరేకించలేదు. మెల్లగా కిందకి దిగాడు.

''నన్ను తీసుకురావడానికి మీరు రాకుండా కారుని మాత్రం పంపించారు... మరి...'' అమ్మ వయ్యారంగా అంది.

''నేనూ వచ్చేస్తే మీకిక్కడ ఘనస్వాగతం ఎవరు చెప్తారు?'' అంటూ అమ్మ భుజంమీద చెయ్యివేసి దగ్గరకి లాక్కుని లోపలకి తీసికెళ్ళారు.

''పదిరోజుల తరువాత మళ్ళీ ఇక్కడికొస్తున్నావు. ఈ పదిరోజుల్లో ఇంటి స్వరూపాన్నేమార్చేశాను తెలుసా?'' అన్నారు.

డాక్టర్‌గారు అమ్మనలా దగ్గరకి లాక్కోవడం బంటీ ఎన్నోసార్లు చూశాడు. కాని ప్రతీసారీ వాడికి మనసులో అదోలా అవుతూనేవుంది.

ఇల్లంతా... ప్రతి మూలా ఎంతో పరిచయం వున్నట్టుగా అమ్మ హాయిగా తిరిగేస్తోంది. వాడికేమీ తెలియదు. జ్యోతి ఎక్కడకి తీసికెళ్తే అక్కడకి వెళ్తున్నాడు. తన పక్కపక్కల నడిచి కాదు. వెనకాలే వెళ్తున్నాడు.

''అది కాలేజీవాళ్ళ ఇల్లు బంటీ. ఇప్పుడు మన ఇంటికి వెళ్తున్నాం. అక్కడ మనవాళ్ళంతా వున్నారు'' అంది అమ్మ. తనవాళ్ళ మధ్య చెదిరిన కళ్ళతో తిరుగుతున్నాడు బంటీ. ఇదే తన ఇల్లు అనుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

పెద్ద బెడ్‌రూం. లేతనీలంరంగు గోడలు. ఎర్రటి కార్పెట్, రెండు కొత్త బీరువాలు. బంటీ ఎవరూ చూడకుండా వాటిమీద చెయ్యివేసి నిమిరాడు. నున్నటి బీరువా. చెయ్యి వేస్తే చాలు జారుతున్నట్టుగా వుంది. గది మధ్యలో రెండు మంచాలు. బంటీ మనసులోనే లెక్కలు వేసుకున్నాడు తను ఇటువేపు మంచంమీద పడుకుంటాడు. అమ్మ అటువేపు పడుకోవచ్చు. పక్కనే మంచానికి ఆనుకుని లైటు ఉంది. నిద్ర వచ్చేదాకా చదువుకుని తరువాత పడుకున్న చోటినుంచే లైటు ఆర్పేయొచ్చు.

ఇంకోపక్క డ్రెస్సింగ్ టేబుల్. అమ్మ డ్రె




స్సింగ్ టేబుల్‌మీదుండే సీసాలకంటే నాలుగు రెట్లున్నాయి.

ఒక మూలనుంచుని బంటీ గదంతా పరిశీలించాడు. గోడలమీద మంచి మంచి చిత్రాలు. డాక్టర్ నిజంగా వాడికి మంచి గదినే ఇచ్చారు. ఒక్కక్షణం వాడికి తన ఇంటిని వదిలివచ్చిన దిగులు మాయమైంది. తన స్నేహితుల్ని ఈ ఇంటికి తీసుకొచ్చి చూపించాలి. అందరికంటే ముఖ్యంగా టీటూ వాళ్ళమ్మకి చూపించాలి. ఎలా నవ్వేదో! ఆవిడ సలు ఇలాంటి గదినెప్పుడూ చూసేవుండదు.

''బంటీ, ఎలావుంది గది?'' అడిగారు డాక్టర్, వాడి వీపుమీద చెయ్యివేసి- బంటీ సంభ్రమంగా చిరునవ్వు నవ్వుతూ జవాబిచ్చాడు.

''చాలా బాగుంది''

ఇప్పుడు బంటీకి డాక్టర్‌గారు కూడా బాగానే కనిపిస్తున్నారు. జ్యోతి, అమిత్ పరుగెత్తుకొచ్చారు.

''డ్యాడీ, టిఫిన్ రెడీ... రండి...''

పెద్ద టేబుల్‌మీద బోలెడన్ని స్వీట్లు, ఫలహారాలు అమర్చారు. బంటీకి పెళ్ళినాడు పెళ్లిలాగే అనిపించలేదు. ఇంకా ఇవాళే పెళ్ళిలో పెట్టినట్టుగా బోలెడన్ని తినుబండారాలున్నాయి. ఒకసారి జ్యోతి, అమిత్ వేసుకున్న కొత్త బట్టలకేసి, మురికైపోయిన తన స్కూల్ యూనిఫాంకేసి చూసుకున్నాడు. ఎంత అసహ్యంగా వుంది తన డ్రెస్! తను వీళ్ళతోటివాడు కాదు. వేరు, పరాయివాడు అన్న భావన కలిగింది.

అత్తయ్య వున్నన్నాళ్ళు తను స్కూలు నుంచి రాగానే బట్టలు మార్పించేది. కనీసం అమ్మ అయినా... ఇక్కడికొస్తాంకదా అని బట్టలు మార్చాలని కూడా అనుకోలేదు. పోనీ వచ్చాకయినా వాళ్లంతా మంచి బట్టలు వేసుకున్నారుకదా, తనకీ మంచిబట్టలు ఇవ్వచ్చుగా.

''అక్కడొద్దు శకూ. ఆ కుర్చీమీదొద్దు. అది అమిత్ కూర్చునే కుర్చీ. వీళ్ళిద్దరూ ఎప్పుడూ ఇవే కుర్చీలమీద కూర్చోవాలని డిసైడ్ చేసుకున్నారు. వాళ్ళ కుర్చీలు 'ఫలానా' అని అలవాటయిపోయింది. పైగా వాడి కుర్చీమీదెవరన్నా కూర్చుంటే అమిత్ గొడవ చేసేస్తాడు''

''మంచిది, నేనూ నాదొక కుర్చీ అని స్వంతం చేసుకుంటాను'' అని నవ్వుతూ అమ్మ డాక్టర్‌గారికి ఎదురుగా వున్న కుర్చీని లాక్కుంది. బంటీ నుంచునే వున్నాడు.

''నువ్వూ ఒక కుర్చీ ఎంచుకో బంటీ, ఇటు కూర్చుంటావా? అటా?''

అందరి కుర్చీలు నిర్ణయమైపోయాయి. తనది మటుకు కాలేదు. అందరూ తీసుకోగా మిగిలిన వాట్లలోంచి తనెంచుకోవాలి. వాడు మౌనంగా జ్యోతి పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు. మనసు చీకాగ్గా అనిపించింది.

అమిత్, జ్యోతి కలిసి, ''బంసీలాల్ పూరీ తీసుకురా. కూరెక్కడ.. ఇందులో పచ్చిమిరపకాయలెందుకేశావ్? ద్రాక్షపళ్ళెందుకు తేలేదు?'' ఇలా ఏదో ఒకటి గొడవ గొడవగా మాట్లాడుతూ టిఫిన్ తింటున్నారు. వాళ్ళిద్దరి మధ్య బంటీకి తాను పరాయివాడిననీ, ఒంటరివాడిననీ అనిపించింది. డాక్టర్‌గారు పరాయివాళ్ళని మర్యాద చేసినట్టు తననీ చేస్తున్నారు. అమ్మ కూడా ఆయనతో చేరిపోయింది.

''మొహమాటపడకుండా తిను బంటీ. ఏది కావాలో అది అడిగి వేయించుకో. మనింట్లోనే మనం మొహమాటపడితే ఎలా?''

తను కూడా డాక్టర్‌గారింటి మనిషేమోనన్నట్టుగా మాట్లాడుతోంది మమ్మీ. బహుశః ఇప్పుడామె ఆ ఇంటికి చెందిన మనిషయ్యుండచ్చు. డాక్టర్ని పెళ్లి చేసుకుందిగా! కాని తను ఆ ఇంటిమనిషెలా అవుతాడు? తనేమీ వాళ్ళని పెళ్లిచేసుకోలేదుగా!

వాడి కళ్ళముందు తమ ఇంటి చిత్రం కదిలింది. భోజనాల టేబుల్ దగ్గర తనొక్కడే, ఒక్కోసారి అమ్మ కూడా కూర్చునేది. తనని బ్రతిమాలుతూ, గదమాయిస్తూ అత్తయ్య అన్నం పెట్టేది.

బంటీ దృష్టి అమ్మవైపు మళ్ళింది. అమ్మ చిరునవ్వు నవ్వుతోంది.

''హలో డాక్టర్... గృహప్రవేశపు విందు జరుగుతున్నట్టుందే'' ఆ గర్జనలాంటి స్వరానికి బంటీ ఉలిక్కిపడ్డాడు.



ఇల్లంతా దద్దరిల్లేలాగా మాట్లాడుతూ, ఒక పొడవాటి వ్యక్తి లోపలకి ప్రవేశించాడు. కేవలం ఒక్కవ్యక్తి ఇంత హడావుడి చెయ్యడం చూసి బంటీకి ఆశ్చర్యం వేసింది. ఎంత ఎత్తు! పూర్తిగా మెడెత్తి చూడాల్సిందే. లేకపోతే మొహం కనపడదు.

"అబ్బ! ఇన్నాళ్ళకివాళ ఇది నిజమైన డైనింగ్ టేబుల్ అనిపిస్తోంది" అంటూ ఆ వ్యక్తి మమ్మీకేసి సూటిగా చూశారు.

డాక్టర్ "హి హ్హిహ్హీ..." అంటూ నవ్వారు. అమ్మ ముఖం ఎర్రబడింది. ఈమధ్య గులాబీ పూలు సిగలో ముడుచుకునే బదులు బుగ్గల కంటించుకుంటున్నట్టు మాటిమాటికి ముఖం ఎర్రగా అయిపోతుంటుంది మమ్మీకి.

అమ్మ ఒక ప్లేటుని ఆయన ముందుకి జరిపేసరికి ఆయన మళ్లీ ఉరిమాడు.

"నో... నో. అయామ్ ఫుల్ మిసెస్ జోషి"

మిసెస్ జోషి! బంటీ తలెత్తి అమ్మ ముఖాన్ని చూశాడు. కాని అమ్మ ఆయన మాటల్ని వ్యతిరేకించలేదు. ఇంతవరకూ అందరూ అమ్మని మిసెస్ బత్రా అనేవారు. ఇప్పుడు ఉన్నట్టుండి ఎలా మారిపోయిందో!

"అంకుల్ టామీని తీసుకురాలేదా?"

"'నేను ఇంటి దగ్గర్నుంచి రాలేదు బుజ్జీ. ఆఫీసునుంచి తిన్నగా ఇటే వచ్చాను... మిసెస్ జోషి, బెడ్‌రూం మీకు నచ్చిందా?

అమ్మ బుగ్గలు మళ్ళీ ఎర్రబడ్డాయి. అస్తమానూ ఈ అమ్మకేమవుతుంది? ఇదివరకిలా అయ్యేదికాదే!

"మిసెస్ వర్మ అన్నీ ఏర్పాట్లు చేశారంటే ఇంక నచ్చకపోడ మంటూ ఏముంటుంది. ఆవిడకి కృతజ్ఞతలు చెప్పడానికి మేమే వద్దామనుకుంటున్నాం"

"భలేవారే. ఈ ఫార్మాలిటీస్ ఎందుకు?" అంతలో ఆయన దృష్టి బంటీవేపు తిరిగింది.

"ఈ కుర్రాడు...? ఓ, తెలిసింది, నీ పేరేంటి బాబూ?"

బంటీ సూటిగా ఆయన్నే చూస్తూ నిస్సంకోచంగా జవాబిచ్చాడు.

"అరూప్ బత్రా" కావాలనే 'బత్రా' అనే శబ్దాన్ని ఒత్తి పలికాడు.

"వాహ్! చాలా చక్కటి పేరు. అరూప్-అమిత్ బాగున్నాయి. తరువాత అమ్మకేసి తిరిగి అన్నాడు. "సీమ్స్ టుబీ ఎ బోల్డ్ చాప్"

అమ్మ మింగేసేలా ఎలా చూస్తోందో. చూస్తే చూడనీ తనకేం భయం! తను బత్రాగానే వుంటాడు. బత్రా అనే చెప్పుకుంటాడు. ఉన్నట్టుండి జోషి అని పేరు మార్చుకుందుకు తనేం మమ్మీ కాదుగా.

టిఫిన్ తిన్నాక డాక్టర్‌గారు అన్నారు.

"జ్యోతీ బంటీకి ఇల్లంతా చూపించు. నీ కథల పుస్తకాలు, ఆటసామాను అన్నీ చూపించు. ఇంటిచుట్టూ ఒక రౌండ్ తిరిగి రండి"

అమ్మ ఆనందంగా తీరిగ్గా కూర్చుంది. బంటీచేత బట్టలు మార్పించాలని ఇప్పటికీ ఆమెకి అనిపించలేదు. అత్తయ్యేలాగూ లేదు. తన బట్టలెక్కడున్నాయో తెలిస్తే తనే వెళ్ళి మార్చుకోవచ్చు. ఈమెగారు ఇలాగే బుగ్గలెర్రగా చేసుకుంటూ కూర్చోనీలే.

కాని ఇవాళ బట్టల గురించి అమ్మ నడగాలన్నా మొహమాటంగా అనిపిస్తోంది వాడికి.

ఈ అమ్మకయినా అంతమాత్రం తెలియదా? వాళ్ళిద్దరూ కొత్త బట్టలు వేసుకోడం చూసయినా అమ్మకి తోచద్దా? ఆ పొడుగాటాయన ఈ పిల్లాడెప్పుడూ మురికిబట్టలే తొడుక్కుంటాడనుకుని వుంటాడేమో!

"జ్యోతి పిలుస్తోంది వెళ్ళు నాన్నా"

"నాకు వేరే బట్టలియ్యి. నేను బట్టలు మార్చుకోవద్దా?" ఎంత ప్రయత్నించినా బంటీ స్వరంలో ఏడుపు ధ్వనించకుండా ఆపుకోలేకపోయాడు.

"అరె మర్చేపోయాను" అని డాక్టర్‌గారివేపు తిరిగి అమ్మ అడిగింది. "ఇవాళ బట్టల బాక్స్ వచ్చిందికదా ఎక్కడ పెట్టించారు?"

ఒక గదిలో సామానంతా అస్తవ్యస్తంగా పడున్నాయి. వాళ్ళ ఇంటిసామాను, పెట్టెలు, పరుపులు, మూటలు, బంటీ ఆటవస్తువులు- మొత్తం వాళ్ళ ఇంటినంతా ఒక మూటలా కట్టి తెచ్చి ఈ గదిలో విసిరేసినట్టుంది.

అమ్మ ఒక పెట్టెలోంచి బట్టలు తీస్తుంటే




బంటీ చూస్తూ నుంచున్నాడు. సామానంతా దిగులుగా, దిక్కులేనట్టుగా పడున్నట్టని పించింది వాడికి.

"తీసుకో. బట్టలు మార్చుకుని పిల్లల్తో ఆడు కుందుకు వెళ్ళు. జ్యోతి, అమిత్ వున్నారు. ఇంటి వెనకాల బోలెడంత ఖాళీ స్థలం వుంది. వెళ్ళి ఆడుకో"

వాడు అమ్మమాట చెవిన పడనట్టుగా అడ్డ దిడ్డంగా వంగిపోయి, వూడిపోయి పడివున్న తన బొమ్మలవంక చూస్తూ నుంచుండిపోయా డు.

"రేపు అన్నీ సరిచేసి, సర్దిపెడతాలే నాన్నా. ఇప్పటికి వెళ్ళి ఆడుకో" అంది అమ్మ.

★ ★ ★

జ్యోతి తోటలో మొక్కలన్నీ చూపిస్తూ ఒక్కొ క్కటీ పరిచయం చేసింది. వేప చెట్టునొకదాన్ని చూపించి,

"డాడీ పుట్టినప్పుడు తాతగారు నాటారట ఈ మొక్కని. ప్రతి సంవత్సరం నాన్నగారి పుట్టినరోజునాడు చిన్నమామ్మ దీనికి పూజచే స్తుంది" అంది.

"చిన్నమామ్మా? చిన్నమామ్మెవరు?"

"చిన్న మామ్మంటే... మా చిన్నమామ్మ" అన్నాడు అమిత్ వాడి వివరణ చూసి నవ్వింది జ్యోతి.

"అంటే నాన్నవాళ్ళ పిన్ని అన్నమాట. ఇన్నాళ్ళు చిన్నమామ్మ ఇక్కడే వుండేది. కొన్నా ళ్ళక్రితం ఊరికెళ్ళారు. అదిగో అక్కడ కని పిస్తోంది చూడు. పెద్ద పంజరం వుంది చూ డు. బన్సీలాల్ అందులో కుందేళ్ళని పెంచే వాడు. ఒకరోజు అందులోకి ఎలాగో ఒక పిల్లి దూరిపోయింది. దాన్తో కుందేళ్ళన్నీ ఖతమ్. ప్చ్!"

"బంటీ అన్నా, పిల్లి అంటే ఎలాంటి పిల్లనుకున్నావ్? పెద్ద గండుపిల్లి! ఇంతలావు తోక! చూడ్డానికే భయం వేసింది. ఒక్కనిమి షంలో కుందేళ్ళని ఫినిష్ చేసేసింది" అన్నా డు అమిత్ భయంగా.

తరువాత బన్సీలాల్ ఇల్లు, చింతచెట్టు. ఆ చింత చెట్టుకింద కూర్చుని చింతకాయలు తింటే ఎలా వుంటుందో... ఏవేవో కబుర్లు.

జ్యోతి, అమిత్ మాట్లాడుతూనే వున్నారు. బంటీ ఊరికే వింటున్నాడు. వాడికి చెప్పడాని కేమన్నా విశేషాలయినా ఏమున్నాయని?

బంటీ ఇల్లంతా తిరిగాడు. అయినా అది తన ఇల్లు అనే భావం రాలేదు. చీకటిపడేకొద్ది ఇది తనకి అపరిచితమైనచోటు అనే భావం బలపడింది.

అమ్మ డాక్టర్‌గారితో బయటకివెళ్ళింది. గదిలో వాడొక్కడే కూర్చున్నాడు. చుట్టూ దీపాల వెలుగు నిండివుంది. అయినా వాడికదేదో భయం. రాత్రిపూట వాడెప్పుడూ విడిగా పడుకో లేదు. ఇవాళ ఎక్కడ పడుకోవాలో, ఎలా పడుకో వాలో.

ఈ ఇంట్లో అసలుండడం ఎలా? ఇది తమ ఇల్లుకాదు, డాక్టర్ గారిల్లు. జ్యోతి ఇల్లు, అమిత్ ఇల్లు. తను వేరేవాళ్ళింట్లో వుండలేడు, పడుకో లేడు.

తన ఇంట్లో వాడికెప్పుడూ భయం వేసేదికా దు. అమ్మ బయటకెళ్ళేటప్పుడూ భయపడేవా డు కాదు. చీకటిగా వున్నా ఒంటరిగా వున్నా భయం వేసేదికాదు. ఎందుకంటే అది తన ఇల్లు. తనెంతో అలవాటుపడ్డ ఇల్లు. అదీకాక తోడుగా అత్తయ్య వుండేది.

ఇక్కడ- అమ్మ ఎంత చెప్పినా 'తనది' అన్న భావం రావటంలేదు. బంటీ కళ్ళల్లో నీళ్ళూరాయి.

"బంటీ ఇంకా ఇక్కడే కూర్చున్నావా? బట్ట లు మార్చుకోలేదూ? అమ్మ నీ బట్టలు మంచంమీద పెట్టింది" అంది జ్యోతి.

జ్యోతి ఇదివరకు అమ్మని 'ఆంటీ' అని పిల్చేది. ఇప్పుడేకంగా అమ్మ అనే పిలవడం మొదలుపెట్టింది.

"పద, అందరం రజాయి కప్పుకు పడు కుని కథలు చెప్పుకుందాం. అమ్మ చెప్పింది- నీకు చాలా కథలొచ్చుటకదా?" అడిగింది జ్యోతి.

"బంటీ అన్నా నేనూ కథ వింటాను. నాకూ ఎంతో ఇష్టం. రాజూ-రాణీ కథ, అప్సరసల కథ..."

కాని బంటీ పడుకోలేదు. రజాయి కప్పుకోలే

దు. కథ చెప్పనూలేదు. రగ్గు కప్పుక్కూర్చుని మమ్మీకోసం కాచుకునే వున్నాడు. అమిత్ పడుకోగానే నిద్రపోయాడు. జ్యోతి కాసేపు స్కూలు కబుర్లు చెప్పింది. జోక్స్ చెప్పింది. బంటీ దేనికీ జవాబు చెప్పలేదు. కాసేపటికి జ్యోతి కూడా నిద్రపోయింది.

బంటీకి నిద్రపోడానికీ స్థిమితంగాలేదు, కూర్చోడానికీ స్థిమితంగా లేదు. నిమిషానికోసారి కళ్లల్లో నీళ్ళు ఊరుతున్నాయి.

అమ్మ రాగానే బంటీ మంచంమీంచి దూకి ఆమె దగ్గరకి వచ్చాడు.

''అరె, నువ్వింకా నిద్రపోలేదూ? ఇదేమిటి? వెచ్చటి బట్టలయినా వేసుకోలేదు. రగ్గు కూడా తీసిపారేశావుకదా జలుబు చేస్తే..''

బంటీ అమ్మని వాటేసుకున్నాడు. ''నేనొక్కడినే ఎలా పడుకోను? నాకు భయం మమ్మీ''

అమ్మ వాడిని దగ్గరగా పట్టుకునే మంచం దగ్గరకి తీసుకొచ్చింది.

''నీకు భయందేనికి బంటీ? అమిత్ కూడా ఇక్కడే పడుకున్నాడుకదా? నీకంటే చిన్నపిల్లాడు వాడికే భయం వెయ్యనప్పుడు నీకెందుకు భయం వేస్తుంది చెప్పు?''

అమ్మ సిగలో పూలు పెట్టుకుంది. ఆ పూల నుంచీ, ఆమె శరీరం మంచీ సుగంధం విరజిమ్ముతోంది.

''నువ్వొట్టి పిచ్చి సన్యాసివిరా. వీళ్ళంతా తోడున్నా భయపడతావుకదరా''

''కాని మన రూమ్‌లో ఎవరూ లేరుకదా. నేనెలా పడుకోడం? అక్కడొక్కడినే పడుకోడానికి భయం వెయ్యదా?''

''ఓహ్!'' అమ్మ ఒక్కక్షణం ఆగింది. తరువాత వాడివీపు నిమురుతూ అంది. ఇదే పిల్లలు పడుకునే గది. పిల్లలంతా కలిసి ఒకచోటే పడుకోవాలి. చూడు, వీళ్ళిద్దరూ ఇక్కడే పడుకున్నారుకదా! నిన్నూ పడుకోపెడతాను పద''

అమ్మ ఎంతో ముద్దుగా వాడిని మంచంమీద పడుకోపెట్టింది. రజాయి కప్పింది. వాడి తల దగ్గర కూర్చుని తల నిమరసాగింది.

ఇంతసేపూ బంటీ కల్పనలో చూసిన రూమ్, మంచం మాయమయ్యాయి.

అమ్మ వంగి వాడి బుగ్గమీద ముద్దుపెడితే వాడు ఆమె ముఖాన్ని తోసేశాడు.

''ఇలా పిచ్చిపిచ్చిగా ఎందుకు చేస్తావు బంటీ? చూడు, వీళ్ళిద్దరూ వాళ్ళంతట వాళ్ళు పడుకోలేదా? ఈమధ్య నీకు నన్ను ఇబ్బంది పెట్టడంలోను, అందరిముందు అవమానించడంలోను ఆనందం దొరుకుతుందేమో అనిపిస్తోంది''

అవును... నాకు అందులోనే ఆనందం. నిన్ను అందరిముందూ అవమానిస్తాను. నువ్వు నన్ను అవమానించడం లేదా? పరాయివాళ్ళింటికి నన్నెందుకు తీసుకురావాలి? మనిల్లేనంటావు, ఇది మనిల్లేం కాదు.. ఇలా ఎన్నోమాటలు అనెయ్యాలనిపించింది వాడికి. ఎన్నో రోజుల్నుంచి వాడికనిపించినదేదీ అనకుండానే వూరుకుంటున్నాడు. ఈమధ్య వినడం తప్ప బొత్తిగా తనేం మాట్లాడటంలేదు. చెప్పినవన్నీ ఒప్పుకుంటూ వచ్చాడు. ఇంక అలా మౌనంగా వుండటం సాధ్యంకాని పని.

కాని గొంతు పూర్తిగా మూసుకుపోతోంది మాట్లాడబోతే వెక్కిళ్ళు, ఏడుపు వస్తాయి.

''బంటీకి ఇంకా నిద్రరాలేదా? ఎందుకని బాబూ?'' డాక్టర్‌గారు తలుపు దగ్గరే నుంచని ప్రశ్నించారు.

''ఇంక ఇప్పుడు నిద్రపోతాడు, కొత్తచోటు కదా, అందుకే...'' వాడు మెలకువగా వున్నందుకు అమ్మ సంజాయిషీ ఇస్తోంది.

''నువ్వు లేచి వెళ్లిపో, నేను పడుకుంటాను'' ఎంతో కష్టంమీద అన్నాడు వాడు.

అమ్మ వాడి తల నిమురుతూ కూర్చుంది. మెల్లగా వాడిని జోకొట్టింది. బంటీ కళ్ళు మూసుకుని కదలకుండా పడుకున్నాడు. కొంచెం సేపయ్యాక మెల్లగా లేచింది. మరోసారి బాగా కప్పింది. దీపం ఆర్పింది. గదిలో చీకటి ఆవరించింది. మమ్మీ కూడా ఆ చీకట్లో కరిగిపోయింది. ఆమె సిగలోని పూలపరిమళం మెల్లమెల్లగా దూరమైంది.

తలుపుదాకా వెళ్ళి మెల్లగా గుసగుసగా 'బంటీ' అని పిల్చింది.

బంటీ పలక్కుండా ఊరుకున్నాడు.




"నిద్రపోయాడా?" డాక్టర్‌గారడిగారు.

"ఊఁ" అంది మమ్మీ మెల్లగా.

తరువాత తలుపు వేసిన శబ్దం అయింది. ఇద్దరూ వెళ్లారు.

ఆ ఇల్లు వదిలిపెట్టి వచ్చినప్పుడు ఇల్లు, తోట మాత్రం తనకి దూరమయ్యాయి. ఇక్కడికి, ఈ ఇంటికి వచ్చాక అమ్మ కూడా దూరమైపోయింది- అనిపించింది బంటీకి.

ఇంతసేపూ లోపలే అదిమిపట్టిన ఉద్వేగం తలుపు మూసిన చప్పుడు కాగానే ఉబికి బయటకొచ్చింది. కొంతసేపయ్యాక ఆ గది తలుపు తెరచుకున్నట్లనిపించింది. డాక్టర్ బయటకొచ్చి వరండాలో వెలుగుతున్న దీపాన్ని ఆర్పేసినట్లున్నారు. ఇల్లంతా చీకట్లో మునిగిపోయింది. బంటీ మనసులో నిండిన దుఃఖం, కోపం భయంగా మారిపోయాయి. చీకట్లో రకరకాల ఆకారాలు రూపుదాల్చాయి. వాడు గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. కాని కళ్ళు మూసుకున్నా ఆ ఆకారాలు తప్పుకోలేదు. మరింత స్పష్టంగా కనపడసాగాయి. నాలుకని పొడవుగా అల్లాడించే రాక్షసుడు... పాదాలు వెనక్కి తిరిగిన కొక్కెపుభూతం... మూడు కళ్ళపిశాచి... మాయానగరిలో వుండే అస్థిపంజరాలు... అన్నీ వాడు చుట్టూ గెంతడం ప్రారంభించాయి. మెల్లగా వాడి దగ్గరగా రాసాగాయి. వాడికి ఊపిరి స్థంభించిపోయింది.

"మమ్మీ... తలుపుతియ్యి మమ్మీ..." తన శక్తినంతా ఉపయోగించి అరిచాడు బంటీ. రెండు చేతుల్తోటీ తలుపుని బాదసాగాడు. అర్ధరాత్రి నిశ్శబ్దంలో బంటీ ధ్వని ఇల్లంతా ప్రతిధ్వనించింది.

ధడేల్న తలుపు తెరచుకుంది. "బంటీ... ఏమయిందమ్మా? ఏమయింది?"

భయంతో చలితో బంటీ వణుకుతున్నాడు. అమ్మ వాడిని దగ్గరకి తీసుకుంది.

కన్నీరు, చీమిడితో బంటీ ముఖమంతా తడితడిగా వుంది. వెక్కిళ్ళెక్కువై ఊపిరి తీసుకోలేకుండా వున్నాడు. అమ్మ వాడికి శాలువా కప్పింది.

"బంటీ... నేనమ్మా... మీ అమ్మని... నీకేమయింది నాన్నా. నేను నీ దగ్గరే వున్నాను చూడు..."

"ఏమయింది?" మెడవరకు కప్పుకున్న రజాయిలోంచి లేవకుండానే అడిగారు డాక్టర్ గారు.

"భయపడ్డట్టున్నాడు..." అమ్మ జవాబిచ్చింది. ఆమె గొంతు వింటే ఆమే భయపడ్డట్టుగా వుంది.

అమ్మ బంటీని దగ్గరకి తీసుకుని మంచం దగ్గరకి తీసుకొచ్చి కూర్చుని, వాడివీపు నిమురుతూ పదేపదే, "నేను నీ దగ్గరే వున్నాను రాజా... నీ దగ్గరే వున్నాను నాన్నా" అని ధైర్యం చెప్పసాగింది.

నిదానంగా బంటీ తేరుకున్నాడు. అమ్మ కౌగిలి, ఆమె స్వరం వాడి భయాన్ని పోగొట్టాయి.

వాడి వణుకు, వెక్కిళ్ళు తగ్గాయి. ఒంట్లో కాస్త వేడిపుట్టింది. మెల్లగా మంచంమీద పడుకోబెట్టింది.

"ఏమయిందిట? బంటీ ఎందుకు భయపడ్డాడు?"

బంటీ కళ్ళు తెరచి చూశాడు.

లేత నీలంరంగు వెలుగు నిండివున్న గది. గదిలో ప్రతి వస్తువు నీలిరంగునద్దుకుంది.

"ఇంతకుముందు ఎప్పుడైనా ఇలా జడుసుకున్నాడా?"

డాక్టర్ గొంతు ఎక్కడ్నుంచో వస్తున్నట్టుంది.

అమ్మ దుఃఖంతో, కంగారుతో అంది,

"లేదు, ఇలా ఎప్పుడూ జడుసుకోలేదు. కొత్తచోటు... ఏమన్నా పీడకల వచ్చుంటుంది. అందులోనూ దెయ్యాలు, భూతాల కథలు చదవడం ఎక్కువ..."

కొంచెంసేపు అమ్మ జోకొడుతూ కూర్చుంది. పాతాళంలోంచి అన్నట్టుగా-

"మీరు ఓదార్చినప్పుడు కాస్త ధైర్యంగా వుంటుంది. కాని వీడు చూస్తే..." అంది.

"ఏం ఫరవాలేదు. మెల్లగా అన్నీ సర్దుకుంటాయి. నిద్ర పట్టిందా?"

"పట్టినట్టే వుంది"

ఒక్కక్షణం మౌనం. కళ్ళు తెరచి అమ్మ

ముఖం చూడాలనిపించింది వాడికి. కాని కళ్లు తెరవలేదు.

"ష్! ఇలా చూడండి. మీరు లేచి బట్టలు వేసుకోండి. ఒకవేళ పొద్దున్నే వాడు త్వరగా లేస్తే పరిస్థితి ఇబ్బందిగా తయారవుతుంది. అమ్మ దీపం ఆర్పేసింది. బంటి మెల్లగా కళ్లు తెరిచాడు. నీలిరంగు వెలుగు మాయమైపో యింది. కిటికీలోంచి మసకవెలుతురు కని పిస్తోంది.

మంచానికొక పక్కనుంచి రజాయి తీసేసి డాక్టరుగారు లేచినుంచున్నారు. ఛీ ఛీ ఛీ ఛీ! ఇన్నేళ్ళొచ్చిన మనిషి ఇలా... దిసమొలతో! యాక్! బంటీకి తన కళ్ళు పేలిపోతున్నట్ట యింది.

దానికితోడు మమ్మీ కూడా ఆయన్నే చూ స్తోంది. సిగ్గులేదూ వీళ్ళిద్దరికీ? వాడికి వాంతి వచ్చేటట్టయింది.

ఆయన బట్టలేసుకున్నాడు. అయినా వాడి కంటిముందు ఆయన నగ్నదేహమే కని పిస్తోంది.



తరువాత అమ్మ మెల్లగా మంచం దిగింది. బట్టల ర్యాక్‌వేపు నడిచింది. తన నైట్‌గౌన్ తీసుకుంది. రామ రామా!

బంటీ భయంతో వణికిపోయాడు. ఈమె తన మమ్మీనేనా? తను ఇంతవరకు ఎప్పుడూ మమ్మీని ఈ స్థితిలో చూడలేదు. తన మమ్మీ ఇలా వుండటం అసాధ్యం! ఈ జరుగుతున్న దంతా ఏమిటి?

"ఛీ! ఛీ! సిగ్గులేని మనిషి! సిగ్గులేని మనిషి!" రజాయి విసిరికొట్టి గట్టిగా అరవాల నిపించింది. బలవంతాన అణచుకున్నాడు.

బంటీ మనసు అస్తవ్యస్తమైపోయింది.

ఎంత చికాకు, కోపం దుఃఖం ఇంతవరకూ తనలో వున్నా అమ్మ తన మమ్మీ అనిపించేది. కాని ఇప్పుడు? వాడి మనసులో ఇన్నాళ్ళు బలంగా నాటుకున్న అమ్మ మూర్తి ముక్కలైపో యింది.



పొద్దున్న చాలాసేపటివరకు నిద్రపోయినా బంటీ మనసులోంచి డాక్టర్, మమ్మీల నగ్నదే హాల చిత్రం తొలగిపోలేదు. రాత్రి తను చూ సింది సత్యమేనా? అలా జరుగుతుందా? మెల్లగా వాడి దృష్టి ఆ సీసావేపు మళ్ళింది. అది అక్కడే డ్రెసింగ్ టేబుల్‌మీద వుంది. నిన్న ఆ సీసా అక్కడ లేదుకదా, ఇవాళెలా వచ్చింది? ఎక్కడ్నుంచి వచ్చింది!

బంటీ ఆ గదిలోంచి పరిగెత్తుకు బయటకొ చ్చేశాడు. వంటింట్లోంచి అమ్మ గొంతు విని పించింది.

"బంటీ లేచావా? త్వరగా రెడీ అవ్వు. స్కూలుకి టైమయిపోతోంది..."

అమిత్, జ్యోతి అప్పుడే స్కూలుకెళ్ళడానికి తయారైపోతున్నారు. వాళ్ళని చూసి బంటీకి కాస్త ధైర్యం వచ్చింది.

"నువ్వు రోజూ ఇంత లేటుగా లేస్తావా బంటీ? స్కూలుకి ఆలస్యమైపోదా? బాత్ రూంలో వేడినీళ్ళున్నాయి. త్వరత్వరగా నీ పనంతా కానిచ్చుకుని రా... పద త్వరగా రెడీ అవ్వు"

జ్యోతి మాటలు, జ్యోతి గొంతు, జ్యోతి ముఖం అన్నీ వాడి మనసులో ధైర్యాన్ని నింపే ట్టుగా వున్నాయి. వాడికెప్పుడూ జ్యోతి అంటే చాలా ఇష్టం.

బంటీ నీళ్ళగదిలోకి వెళ్ళి తన పని ము గించుకున్నాడు.

అందరూ డైనింగ్ టేబుల్‌దగ్గర కూర్చున్నా రు. అమ్మ టోస్ట్‌కి వెన్న పూసి అందరికీ ఇస్తోంది. డాక్టర్ తెల్లటి బట్టలు వేసుకున్నారు. అందరూ టోస్ట్ తినడంలో లీనమైపోయారు. బంటికి తినడంమీదగాని, జ్యోతి, అమిత్ చె ప్పే కబుర్లమీదగాని ధ్యాసలేదు. ఎదురుగా కూర్చుని తింటున్న డాక్టర్ ఒకక్షణం బట్టలతో, మరోక్షణం నగ్నంగా కనిపిస్తున్నారు.

వెన్నపూస్తూ మధ్యమధ్యలో టీ తాగుతున్న అమ్మ కూడా ఒక్కోసారి నగ్నంగా కనిపిస్తోంది. వాడికి మొదట భయం వేసింది. కానిప్పుడు అదోరకమైన అసహ్యం వేస్తోంది.

సాయంత్రంవరకూ ఎక్కడికెళ్ళినా ఎవర్ని చూసినా ఒకటే దృశ్యం. సాయంకాలానికి వాడి కి తనేదో తప్పుడువని చేసినట్టుగా అదోవి ధంగా అపరాధభావం మనసులో చోటుచేసు కుంది. అమ్మ ఇక్కడికెందుకొచ్చింది? తన్నెందుకిక్కడికి తీసుకొచ్చింది. ఆరోజు ఒక్క క్షణమైనా వాడి మనసు చదువుమీద లగ్నంకా లేదు... ఛ! ఛ! ఇదంతా ఆలోచించడంతప్పు. ఇలాంటివన్నీ ఆలోచించి తను పాపంచేస్తున్నా డు!

రాత్రయ్యేకొద్దీ వాడి భయం ఎక్కువ కాసా గింది. అది ఏం భయమో వాడికర్థంకాలేదు.

ఆరోజు రాత్రి చాలాసేపటివరకు మమ్మీ వాడి మంచంమీదే కూర్చుని వాడి తల నిము రుతూ వుండిపోయింది.

"నిద్రపో బంటీ. నేను నీ దగ్గరే వున్నాను. బన్సీలాల్‌కి చెప్పాను. వాడిక్కడే వరండాలో మీ గదిపక్కనే పడుకుంటాడు. వరండాలో లైటు కూడా ఆర్పవద్దని చెప్పాను. జ్యోతి, అమిత్, ఆయా అంతా ఇక్కడే పడుకుంటా




రు'' అంది అమ్మ.

ఎంతోసేమయ్యాక దీపం ఆర్పేసి మమ్మీ వెళ్ళిపోయింది. గదిలో ఆవరించిన చీకటి బంటీ మనసునీ కమ్ముకుంది.

మమ్మీ గది తలుపు మూసిన చప్పుడయింది. వెంటనే బంటీ కళ్ళముందు లేతనీలంరంగు కాంతినిండిన గది కదిలింది. తర్వాత మళ్ళీ అదేదృశ్యం.

రాత్రంతా కలతనిద్రలో బంటీ ఎవరెవరో అపరిచితులమధ్య తిరుగుతున్నాడు. అంతా పరిచయంలేని ఎప్పుడూ చూడని స్థలం! ఎలా వచ్చాడో తనక్కడికి. అంతా దిసమొలతో తిరిగే వాళ్ళే... అటూ ఇటూ ఎంత నిర్లజ్జగా తిరుగుతున్నారో! తనూ బట్టల్లేకుండానే పరిగెడుతున్నాడు. కంగారు కంగారుగా నుంచున్నచోటే పాస్ పోసేసి ముందుకు పరిగెడుతున్నాడు.

'అరె! ఇదేమిటీ పరుపంతా తడిసిందేమిటి?' ఏం జరిగిందో వాడికో క్షణం అర్థంకాలేదు. అర్థమయ్యాక వాడు సిగ్గుతో కుంగిపోయాడు. అదోరకమైన భయం ముంచుకొచ్చింది. భయం... సిగ్గు... అందరిముందూ బట్టలు విప్పాల్సొచ్చే సిగ్గుతో కూడిన భయం!

కిటికీలోంచి తొలి వెలుగు మెల్లగా గదిలో విస్తరించసాగింది. ఇప్పుడు తనేం చెయ్యాలి? చేత్తో తడిమి చూసుకున్నాడు. పరుపంతా తడిసిపోయింది. బట్టలన్నీ తడిముద్ద. ఎలా లేవడం? ఎలా బట్టలు మార్చుకోడం? ఇంక ఈ పరుపు గతి ఏమిటి? తెల్లగా తెల్లవారిందంటే అందరికీ తెలిసిపోతుంది.

జ్యోతి, అమిత్, డాక్టర్, బన్సీలాల్ - అంతా ఏమనుకుంటారో? ఏమంటారో? సిగ్గు... బాధ... కోపం... చివరికి కన్నీరు!

అమిత్, జ్యోతి లేచారు. జ్యోతి వాడిని పిల్చింది. వాడు ఊపిరి బిగపట్టి పడుకున్నాడు. వాళ్ళిద్దరూ అక్కడ్నుంచి వెళ్ళిపోయారు. కాని లేవడం ఎలా?

''బంటీ, లే నాన్నా. స్కూలుకి టైమవడంలేదూ?'' అమ్మ గొంతు. తను ఇవాళ లేవడు. రేపు... ఎల్లుండి... ఇక జీవితాంతం లేవడు... లేవలేడు. తను పరుపుమీద పడుకున్నాడా? కాదు... అంటుకుని పడుకున్నాడు!

అమ్మదగ్గరకొచ్చి రజాయి ఎత్తుతుంటే మరింత బలంగా కళ్ళుమూసుకున్నాడు. అయ్యో దేవుడా! పరుపుతోసహా తను మాయమవ్వగలిగే మంత్రాలేవీ లేవా?

''అరె! ఇదేమిటి? ...ఓహ్!''

''గుడ్‌మార్నింగ్ కిడ్స్!'' గుమ్మంలో నుంచుని డాక్టర్ పలుకరించారు. అమ్మ వేగంగా రజాయి కప్పేసింది.

''మీరొకసారి అటు వెళ్ళండి''

షాల్ వాడి ఒంటిమీద చుట్టి బంటీని తన గదికి తీసికెళ్ళింది అమ్మ. త్వరత్వరగా బట్టలు మార్చింది.

''రాత్రి పాస్ పోసుకుని పడుకోలేదా కన్నా? రాత్రి వెళ్ళాల్సొస్తే బన్సీలాల్‌ని తోడు పిలవక పోయావా?''

బంటీ మాట్లాడలేదు. లోపలి భయం, ఆవేశం, వెక్కిళ్ళరూపంలో బయటకి రాసాగాయి.

''ఇంక ఏడవద్దు. నువ్వేడవడం చూసి అంతా ఏమనుకుంటారు? ఎవరికీ తెలీకుండా నేను చూసుకుంటాను. నువ్వు ఏడవకుండా వుండు''

అమ్మ డ్రెస్సింగ్ టేబుల్‌దగ్గరకి తీసికెళ్ళి వాడి తల దువ్వుతోంది... మళ్ళీ అదే సీ...సా'' బంటీ వణికిపోయాడు.

టిఫిన్‌కి అందరూ డైనింగ్‌టేబుల్‌దగ్గర చేరినప్పుడూ బంటీ తల ఎత్తలేదు. అంతా హడావుడిగా ఎవరి తిండి వాళ్ళు తింటున్నారు. కాని అంతా తననే గమనిస్తున్నారేమోనని వాడికి అనిపించసాగింది. తను పక్క తడుపుకున్న సంగతి అందరికీ తెలిసిపోయిందేమో! తలెత్తి చూడకుండానే అందరి ముఖాలూ మనసులో ఊహించుకోసాగాడు. మమ్మీ ముఖంలో అశాంతి, డాక్టర్ ముఖంలో చికాకు, జ్యోతిముఖంలో జాలి, అమిత్‌ముఖంలో వెక్కిరింపు. టోస్ట్ తయారుచేస్తున్న బన్సీలాల్ ముఖంలో ముసిముసి నవ్వు...!

★ ★ ★

మర్నాడు అమ్మ అప్రసన్నంగా, చికాగ్గా వుంది. అందర్నీ ప్రశ్నిస్తోంది. ఆమె చేతిలో ఆ

మాయా, మంత్రపు సీసా! ఖాళీసీసా!

"జ్యోతీ, నువ్వేమన్నా సెంట్‌సీసా తీశావ మ్మా?"

"లేదుమమ్మీ, నేనసలు మీ గదివేపే వెళ్ళ లేదు"

"అమిత్, నువ్వేమన్నా సీసా పడేశావ నాన్నా?"

"లేదుమమ్మీ" వాడటు తలైనా తిప్ప కుండా నిశ్చింతగా జవాబిచ్చాడు.

"పడేసుంటే చెప్పు బాబూ, నేనేం కోప్పడ ను"

"లేదు... నేనా తలుపు తియ్యనేలేదు. ఇంతకీ నేనేమన్నా సెంట్ వేసుకుంటానా ఏమిటి?"

"నువ్వు పడేశావా బంటీ?"

"లేదు" అన్నాడుకాని అమిత్ చెప్పినంత నిశ్చింతగా చెప్పలేకపోయానని వాడికే అని పించింది. మమ్మీ వాడి ముఖంలోకే గుచ్చిగు చ్చి చూస్తోంది. జ్యోతిని, అమిత్‌ని ఇలా ఎప్పు డూ చూడదు. ఈ ఇంట్లో తనొక్కడేగా దండగ్గా వున్నది?

కాని వాడికి కోపంకంటే ఎక్కువగా భయం వేస్తోంది. అసలే అది మాయ, మంత్రం తెలి సిన సీసా. నిజమైన దొంగని నేనే పట్టించిస్తా నని ఆ సీసా అంటే?

నిన్న ఇంటివెనకాలున్న మైదానంలో సెంటంతా పారబోసి దానిమీద మట్టి కప్పేసి వచ్చాడు. అప్పుడే అనిపించింది కార్టూన్ సిని మాల్లో జరిగినట్టుగా ఆ సీసాకి చేతులు, కాళ్ళు వచ్చినట్టు వాడికి భ్రమకలిగింది.

"తమాషాగా వుందే. సీసా అంతా ఖాళీ! రూంలో కొంచెమయినా సెంటువాసన లేదు. మీరెవరూ ఒలకపొయ్యలేదు. బన్సీలాల్ కూడా పడెయ్యలేదు. మరి సెంటంతా ఏమయినట్టు? బలే జాదూ సీసాలావుందే!?"

'జాదూ' అన్న శబ్దం వినపడగానే సన్నగా ఒణుకువచ్చింది వాడికి.

షేవ్ చేసుకుని, టవల్తో గడ్డం తుడుచు కుంటూ డాక్టర్‌గారొచ్చారు.

"పోనీ వదిలెయ్యకూడదా శకూ. ఆదివారం పొద్దున్నే ఏమిటీ పంచాయితీ? అయిందేదో అయింది. ఆ గొడవ వదిలేసి మరోటి తెచ్చు కుంటే పోలా?"

"తెప్పించుకోడం గురించి కాదు. అసలు సీసా ఎలా ఖాళీ అయిందీ అని"

అమ్మ గొంతులో బాధ, ముఖంలో దిగులు.

"చెప్పానుగా. ఫర్‌గెటిట్" డాక్టర్ అమ్మ భుజంతట్టి అన్నారు. "ఖాళీ అయింది సెంట్ సీసానేగా. ప్రపంచం అంతా ఖాళీ అయిపోయి నట్టు హడావుడి చేస్తావేమిటి?"

"మీరు ప్రజెంట్ చేసినది... ఇలా అయితే బాధగా వుండదా? పొద్దున్నే మూడ్ పాడయిపో యింది"

'ఓ! అమ్మకి అందుకా అంత బాధ' బంటీ మనసులో భయానికి బదులు అదోరకమైన సంతోషం కలిగింది.

★ ★ ★

ఆ బంగళా గేటుతీసి లోపలికి వెళ్ళగానే ఎడంపక్క రెండు గదులు, ఒక వరండా వున్నాయి. పొద్దున్నే ఎనిమిది గంటల్నుంచి మధ్యాహ్నం పన్నెండు గంటలవరకూ డాక్టర్ రోగుల్ని చూసేదిక్కడే. వరండాలో స్థంభంమీద కుటుంబ నియంత్రణకి సంబంధించిన పెద్ద బోర్డొకటి తగిలించివుంది.

"డాక్టర్ సలహా పొందండి. ఇద్దరూ లేక ముగ్గురు పిల్లలు చాలు" అని రాసివుంది బోర్డుమీద.

బంటీ అక్కడ వరండాలో ఒక మూలగా వున్న బెంచీమీద కూర్చుని స్కూలు బస్సు కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. ఆస్ప త్రిలో జనం నిండివున్నారు. బంటీ కుతూహ లంగా వాళ్ళనే చూస్తున్నాడు. రూమ్‌లో డాక్టర్ గారు కూర్చున్నది బంటీకి కనిపిస్తోంది. వరుస ప్రకారం రోగులు లోపలికి వెళ్తున్నారు. రోగుల్ని ఎలా పరీక్షిస్తారు? ఏం జబ్బో అని ఎలా తెలుస్తుందో! అని ఆలోచిస్తున్నాడు బంటీ.

శబ్దంచేస్తూ బస్సొచ్చి నుంచుంది.

"బంటీ నువ్వెందుకు కార్లో స్కూలుకెళ్ళ వు?"

"పోనిద్దూ కార్లో అయితే ఇంటిదగ్గర్నుంచి తిన్నగా స్కూలుకెళ్ళి, స్కూల్నుంచి తిన్నగా




ఇంటికొచ్చెయ్యాలి. ఎవరితోనూ ఒక మాట, మంతీ ఏమీ వుండవు. బస్సులో వస్తే ఎంత మజాగా వుంటుందో తెలుసా? హాయిగా కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటూ వెళ్ళిరావచ్చు. సాయంత్రం కార్లో పికారెటూ వుండనే వుంటుంది'' అన్నాడు.

లోపల మనసులోంచి ఎవరో నవ్వినట్టయింది. అంతా అబద్ధమే! వాడినెవరూ కార్లో తీసికెళ్ళరు.

ఈ మధ్య వాడు అబద్దాలు చెప్పడం అలవాటు చేసుకున్నాడు. అసహ్యకరమైన విషయాలన్నీ ఆలోచిస్తాడు. క్లాసులో పాఠాలు కూడా సరిగ్గా తలకెక్కటంలేదు. ఏమయింది తనకసలు! ఇలా అయితే గతేమిటి?

బంటీ స్కూల్నుంచి వచ్చేసరికి ఇంట్లో అమ్మ ఒక్కతే వుంది. అమిత్, జ్యోతి ఇంకా రాలేదు.

అమ్మ ఒక్కతే వుంటే బంటీకి సంతోషం. ఇల్లు 'తనది' అనిపిస్తుంది అప్పుడు.

''నువ్వివాళ కాలేజికి వెళ్ళలేదా మమ్మీ''

''లేదు నాన్నా. సామానంతా సర్దుకోవాలి కదా. అందుకని రెండురోజులు శలవు పెట్టాను''

అమ్మ బంటీ చేతిలోంచి పుస్తకాల బాక్స్ అందుకుంది. రూమ్‌కి వెళ్ళి చూస్తే జ్యోతి, అమిత్‌ల బీరువాపక్కన మరొక ఎత్తయిన బీరువా కొత్తగా వచ్చింది.

''బంటీ ఇది నీ బీరువా. నీ బట్టలు, ఆటవస్తువులు అన్నీ దీన్లోనే పెట్టాను. నీకెలా కావాలో అలా సర్దుకో''

బంటీ బీరువా తీశాడు. గుప్పున మందుల వాసన కొట్టింది.

''దీట్లోంచి మందుల వాసనొస్తోంది మమ్మీ''

''డాక్టర్ మందులు పెట్టుకునే బీరువా నీకోసం ఖాళీ చేసిచ్చారు. రెండ్రోజులయితే వాసనంతా పోతుందిలే''

''ఇలాంటి బీరువా నాకేం అక్కర్లేదు. ఇంట్లో పనికిరాని వస్తువులన్నీ నాకు పడేస్తారా ఏం? నీకుమాత్రం అంత మంచి బీరువా తెప్పించుకోలేదా?''

అమ్మ వాడికేసి తిరిగింది. ఒక్క క్షణం బంటీ ముఖంలోకి సూటిగా చూసింది. తరువాత వాడిదగ్గరకొచ్చి వాడి రెండు చేతులు పట్టుకుని మంచంమీద కూర్చోపెట్టింది.

''ఏమంటున్నావు బంటీ? నీకేమన్నా తెలుస్తోందా అసలు? ఇది పనికిరాని వస్తువా? అసలు డాక్టర్‌గారికి ఇది ఎంత ఉపయోగకరమైన వస్తువో నీకు తెలుసా? నీకోసం అని నేను ఆయన్ని ఇబ్బందిపెట్టి ఇది ఖాళీచేయించాను''

''ఎందుకు ఖాళీ చేయించావు? డాక్టర్‌గారి బీరువా డాక్టర్‌గారికిచ్చేసెయ్''

''బంటీ!!'' మమ్మీ తదేకంగా వాడి ముఖంలోకి చూసింది. వాడి ముఖంలో ఏముందో!

''కన్నా ఒక మాటడుగుతాను జవాబు చెప్తావా?''

ఏమిటన్నట్టుగా చూశాడు వాడు.

''డాక్టర్‌గారిని నువ్వెందుకు 'నాన్నా' అని పిలవ్వు?''

బంటీ మౌనంగా వుండిపోయాడు. వాడి కంటిముందు వాడి నాన్న ముఖం కదిలింది.

''ఇకనుంచి అలా పిలుస్తావా?''

''లేదు''

''ఎందుకు?''

''మా నాన్న కలకత్తాలో వున్నారు''

మమ్మీ ఒక్కక్షణం ఊరుకుంది. ముఖం సీరియస్‌గా మారిపోయింది.

''ఉన్నమాట నిజమే. కాని జ్యోతి, అమిత్ చక్కగా నన్ను 'అమ్మ' అని పిలవటంలేదూ?''

''వాళ్ళ అమ్మ చచ్చిపోయింది అందుకని పిలుస్తారేమో. నేనెందుకని పిలవాలి?''

అమ్మ వాడి ముఖంకేసే చూస్తోంది. వాడూ ఆవిడ్నే చూస్తున్నాడు.

అంతలో పోర్టికోలో కారొచ్చి ఆగిన చప్పుడైంది. అమ్మ వాడి చేతులొదిలి లేచి నుంచుంది.

''సరే బంటీ, నీకిష్టం వచ్చినట్టే చెయ్యి''

ఇప్పుడామె గొంతులో కాఠిన్యమూలేదు, కోపమూ లేదు. బహుశః బాధావీచిక వుండివుండొచ్చు.



జ్యోతి, అమిత్ వాళ్ల బ్యాగ్‌లు తీసుకుని కార్లోంచి దిగారు.

"మీరొచ్చేశారా? త్వరగా కాళ్ళు, చేతులు కడుక్కుని బట్టలు మార్చుకోండి. తిండానికేమన్నా ఇస్తాను. చూడండి బంటీకి కూడా ఇంకా ఏమీ పెట్టలేదు"

'హు! ఎంతైనా నేనో పనికిరానివాడిని. అందరూ వచ్చేదాకా కాచుకుని పడుండాల్సిన వాడిని' అనుకుంటున్నాడు వాడు.

"ఓహ్! ఈ లంబూ బీరువా బంటీ అన్నదా?" హనుమంతుడిలా ఎర్రబట్టలు కట్టుకున్న అమిత్ గెంతులేస్తూ అడిగాడు.

"లంబూ బీరువా!"

'హుఁ... అలాంటి పనికిమాలిన వస్తువుల్ని చూసి ఎవరేనా గేలిచేస్తారు! ఆంజనేయుడిలా ఎర్రటి బట్టలేసుకుని ఎలా గెంతుతున్నాడో! లంబూ బీరువాట! లంబూ బీరువా!

టిఫిన్ తినేటప్పటికి కాలేజి మాలి వచ్చాడు. వచ్చి నేలవరకు వంగి సలాంచేశాడు.

"నమస్తే బంటీ సాబ్. ఎలా వున్నారు..." అని వాడడుగుతుంటే బంటీ పరుగున వెళ్ళి అతన్ని పట్టుకున్నాడు.

"మాలీతాతా, నాతోటలా వుంది? నువ్వు దానికి సరిగ్గా నీళ్ళు పోస్తున్నావా? పసుపు గులాబి మొగ్గలన్నీ పూలయ్యాయా? పువ్వు ఎంత పెద్దదొచ్చింది? చక్కగా అందంగా వుండుంటుందికదా? మరి టెంకిస్‌పూలు...? ఎన్ని ప్రశ్నలో! మాలి రావడంతో మొత్తం వాడింటితోటే ఇక్కడకి కదిలివచ్చినంత సంభ్రమంగా వుంది వాడికి.

బంటీ ఉత్సాహంగా ఒక్కొక్క పువ్వు గురించి పేరుపేరునా అడుగుతున్నాడు.

"మాలీ! బంటీకోసం ఈ ఇంట్లోనూ చక్కటి తోటని తయారుచేసివ్వాలి సుమా! ఆ తోటకంటే ఇంకా బాగుండాలి. అక్కడ్నుంచి వీలైనన్ని మొక్కలు తెచ్చి ఇక్కడ పాతు. మిగిలినవి..."

"అక్కడున్న మొక్కలొక్కదాన్ని కూడా పీకకూడదు. నా తోటలో ఒక్క పువ్వుని కూడా ఎవరూ ముట్టకూడదు. తాతా, నువ్వు ఏ మొక్కనీ పీకద్దు" ఆవేశంగా ఆజ్ఞాపిస్తున్నట్టు అన్నాడు బంటీ.

మాలి కళ్ళు చెమ్మగిల్లాయి.

"అదంతేనమ్మా... ఎవరైనాసరే వాళ్ళు నాటిన మొక్కలమీద ఇలా మోహం పెంచుకోడం మామూలే. అవీ పిల్లల్లాంటివే. ఒకచోట నాటాక మళ్ళీ తియ్యబుద్ధవదు.

నువ్వే ఒకసారొచ్చి తోటని చూసి వెళ్ళు బంటీబాబూ! నీ మొక్కల్ని ప్రాణంలా చూసుకుంటున్నాను"

అమ్మ ఎక్కడెక్కడ ఏమేం మొక్కలు నాటాలో సూచనలిచ్చేటంతసేపూ బంటీ మాలి చెయ్యిపట్టుకుని వేళ్ళాడుతూనే వున్నాడు. మాలి చెయ్యి ముట్టుకుంటే వాడికి వాడి మొక్కల్ని తాకినంత ఆనందంగా వుంది.

మాలి వెళ్ళిపోతుంటే గేటుదాకా సాగనంపాడు. "రేపు కూడా రా తాతా. రోజూ రా..." అని మాలికి భారంగా వీడ్కోలు చెప్పాడు.

★ ★ ★

అందరూ చదువుకోడానికి గదిలోకి చేరేటప్పటికి మొదలైంది అసలు రాద్ధాంతం.

అమిత్ తన టేబుల్‌మీదున్న బంటీ పుస్తకాలన్నింటినీ ఒక్కొక్కటిగా గిరవాటేస్తూ అరుస్తున్నాడు. "ఇక్కడున్న నా పుస్తకాలన్నీ ఎవరు తీశారు...? ఎక్కడ పెట్టారు? ఈ పుస్తకాలు ఇక్కడెవరు పెట్టారు? ఇది నా టేబుల్! ఈ టేబుల్ నేనెవరికీ ఇవ్వను"

"ఏయ్ అమిత్! నీకేమన్నా పిచ్చిపట్టిందా? ఎందుకలా చేస్తున్నావు? ఇదిగో నీ పుస్తకాలన్నీ ఇక్కడ నా టేబుల్‌మీద పెట్టింది అమ్మ. ఇక్కడ కూర్చుని చదువుకుందువుగాని రా" అని జ్యోతి వాడిని శాంతపరచడానికి ప్రయత్నిస్తోంది. అంతలో ప్రవేశించాడు బంటీ.

"రారా... ఇంకా విసురు! ఇంకా విసురు..." అంటూ అమిత్ పుస్తకాల్ని ఒక్కొక్కటిగా పైకి విసరసాగాడు. ఒక్కొక్కటి రెక్కలు విప్పుకున్న పక్షుల్లా రూఫ్‌వరకూ ఎగిరి కిందపడసాగాయి.

తరువాత ఇద్దరూ తలపడ్డారు. బంటీ నాలుగు తగల్నిచ్చాడు. అమిత్ ఒడుపు చూసి బంటీని భుజంమీద పళ్ళు గాట్లుపడేలా కొరికాడు. కొరికేసరికి బంటీ అరుపులు మొదలెట్టా




డు.

''చంపేశాడురోయ్...!''

అమ్మ పరుగున వచ్చి ''ఏమిటిది? ఏమిటిది?'' అంటూ ఇద్దర్నీ విడదీసింది. జ్యోతి తనేమీ చెయ్యకపోయినా దోషిలా ఒక మూలకి నుంచుంది.

''వాడినిప్పుడు కొడతాను నేను! కొడతాను...'' అని రొప్పుతూ, వణుకుతూ ''ఏం చేశాడో చూడు! కొడతాను వాడిని'' అని గింజుకున్నాడు బంటీ.

బాగానే కొరికాడు అమిత్. కండ వూడొచ్చింది. రక్తం చిమ్ముతోంది.

''అమిత్! ఏంపనిది? అన్నయ్యనలా కొరకచ్చా?'' గద్దించింది అమ్మ.

అమిత్ ఏడుపు మొదలెట్టాడు. ఏడుస్తూ బంటీవంక గుర్రుగా చూశాడు. అంతలో బన్సీలాల్ వచ్చి అమిత్‌ని బయటికి తీసికెళ్ళిపోయాడు.

అయిపోయింది తిట్టడం! ఒక దెబ్బ వెయ్యొచ్చుగా. అదే తను కొరికుంటే!

అమ్మ బంటీని ప్రేమగా దగ్గరకి తీసుకుని, ''పద టింక్చర్ వేస్తాను'' అంది.

''నాకే టింక్చరూ అక్కర్లేదు. నన్నేం ఓదార్చక్కర్లేదు'' అని గునిసాడు వాడు. ఆ గొంతులో దుఃఖమో, కోపమో,! అమ్మ కళ్ళల్లో చెమ్మ తొంగిచూసింది.

''పద నాన్నా! మందేయించుకో. సాయంత్రం డాక్టర్‌గారితో చెప్పి వాడిని తిట్టిస్తాగా''

పెద్ద తనకి తిట్టడం రానట్టు! డాక్టర్‌తో తిట్టిస్తుందట! ''నాకేం వద్దు'' అని మందు వేయించుకోకుండా చెయ్యి విడిపించుకుని వెళ్ళాడు.

డాక్టరుగారొచ్చారు... విషయం తెలిసింది. అమిత్‌ని కోప్పడ్డారు. చెవి పిండారు కూడా. అయినా వాడు ఆ రాత్రి భోజనం చెయ్యలేదు.

డాక్టరుగారొచ్చి వాడి మంచంమీద కూర్చుని వాడి చెయ్యి నిమిరి ఓదార్చారు. వాడి పాత టేబుల్ నీకేం అక్కర్లేదు. రెండ్రోజుల్లో నీకు సరికొత్త టేబుల్ చేయించి, తెప్పించి వేస్తాను. సరేనా అని ప్రామిస్ చేశారు. అయినా వాడు కాస్తైనా కదల్లేదు.

''నువ్వు చాలా మొండివాడివి'' అనేసి వాడి తల నిమిరి లేచి వెళ్ళిపోయారాయన.

ఆయనలా వెళ్ళగానే నాన్నగారి ముఖం కళ్ళముందుకొచ్చింది. నిన్ను కలకత్తా తీసికెళ్తాను బంటీ, అక్కడ వూరంతా తిప్పి చూపిస్తాను అంటున్న డాడీ.

రేపు డాడీకి తప్పకుండా ఉత్తరం రాయాలి.

★ ★ ★

మర్నాడు బంటీ స్కూలు బస్‌కోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడు. కాని వాడు ఎవరివైపూ చూడటంలేదు. క్లినిక్‌లో వున్న డాక్టర్‌వేపు కూడా. పొద్దుట్నుంచీ వాడెవ్వరితోనూ ఒక్క మాట కూడా మాట్లాడలేదు. రాత్రికోపం వాడికింకా తగ్గలేదు. తను ఇంకెవరితోటీ మాట్లాడడు.

ఎదురుగా ఎర్ర త్రికోణం బొమ్మ వాడికేసే గుచ్చిగుచ్చి చూస్తున్నట్టుంది. 'తీస్‌రా బచ్చా ఫాల్‌తూ బచ్చా' అనే మాటలు వాడిని వెక్కిరిస్తున్నాయి. మొన్న డాక్టర్‌గారెవరికో చెప్తుంటే విన్నాడు.

''ఈ దేశంలో ముగ్గుర్ని కనే హక్కు ఎవరికీ లేదు. ఇద్దరే చాలనసలు''

అవును మూడో బిడ్డ వేస్ట్! మూడవబంటీ కూడా వేస్ట్!

''అవును బంటీ నువ్వు స్కూలుకి కార్లో ఎందుకు రావు'' అనే ఫ్రెండ్స్ మాటలు.

''ఈ లంబూ బీరువా బంటీ అన్నదా?''

అనే అమిత్ వెక్కిరింపు.

''నా టేబుల్ ఇంకెవరికీ ఇవ్వననే'' తిరస్కారం!

ఆ ఇంట్లో తనకేది హక్కు?

కార్లో కూడా వాళ్ళిద్దరూ ఎంత దర్జాగా కూర్చుంటారు!

ఎంత దర్జాగా తిరుగుతారు!

''డ్రైవర్, వెళ్ళి డాక్టర్‌గార్ని తీసుకురా''

''డ్రైవర్! అమిత్‌ని, జ్యోతిని స్కూలుకి



దింపిరా''

''డ్రైవర్ మేమ్‌సాబ్‌ని కాలేజినుంచి తీసుకురా''

అందరికీ కారు. ఫాల్‌తూ బంటీ మాత్రం బస్సుకోసం కాచుకునుంచోవాలి.

★ ★ ★

ఇంటికి దూరమైన బంటీ అన్నింటికి దూరమైపోయి కుమిలిపోతున్నాడు.

మునుపటి బంటీలా లేడు. స్కూల్లో పాఠాలు తలకెక్కవు. కళ్ళముందు తన పాత ఇంటి జ్ఞాపకాలు!

అమిత్, జ్యోతి, అమ్మ,అమ్మ రూమ్... రూమ్ లోని జాదూసీసా... ఇంకేవేవో...! వీటన్నిటి మధ్య తను ఒంటరి.

ఇంట్లో వున్నంతసేపు స్కూలు గుర్తొస్తుంది. తమ పాత ఇల్లు... తన తోట.. తోటలో ప్రతి మొక్క ప్రతిఆకు... ప్రతి పువ్వు, అత్తయ్యా, మాలి... మమ్మీ ఆ ఇంట్లో వుండిన మమ్మీ... అన్నీ ఇలా గుర్తొస్తాయి.

స్కూల్నుంచి ఇంటికి రాగానే ఎర్రత్రికోణం.

'తీస్‌రా బచ్చా-ఫాల్‌తూ బచ్చా' దర్శనమిస్తాయి. దాన్ని దాటుకుని ఇంట్లో కొచ్చాడు బంటీ. ఇంట్లో ఎవరూ లేరు. అది వాడికి కొత్తేమీ కాదు. ఇదివరకు ఆ ఇంట్లోనూ స్కూల్నుంచి వచ్చాక తనొక్కడే వుండేవాడు. అమ్మ తరువాత కాసేపటికి వచ్చేది. అయినా ఈ ఇంటికొచ్చాక పాతవిషయాలు కూడా కొత్తగా

# రచయితలకు సూచనలు













ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ **ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.**

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

కనిపిస్తున్నాయి. కొత్తగానే కాదు. విచిత్రంగా కూడా! ఇక్కడ ఒంటరిగా వుండాల్సొస్తే మరింత ఎక్కువ ఒంటరితనం అనిపిస్తుంది. అందరి మధ్య వున్నప్పుడూ తనెలాగూ ఒంటరి! తనెవరితోనూ మాట్లాడకుండా కూర్చుంటాడు.

చేతిలో వున్న స్కూల్ బాక్స్ కిందపెట్టి ఎర్రబడ్డ కళ్లని రుద్దుకుంటూ చుట్టూ చూశాడు. వాడి దృష్టి గదిలోకి కొత్తగా వచ్చిన కొత్త టేబుల్‌మీద పడింది. దగ్గరకొచ్చి చూశాడు. సరికొత్త టేబుల్. చేతుల్తో ముట్టిచూశాడు. మనసుకెంతో హాయిగా అనిపించింది. అంతలోనే ఏమైందో వెనక్కి జరిగాడు.

అమిత్ కొరికిన గాయపునొప్పి కెలికినట్టయింది. అక్కర్లేదు, తను టేబుల్ గీబుల్ ఏదీ తీసుకోడు. ఇక్కడి ఏ సామానూ తనకక్కర్లేదు.

అమిత్, జ్యోతి వాళ్ళ టేబుల్స్ దగ్గర కూర్చుని రాసుకుంటూంటే, తను నేలమీదే ఒక మూల కూర్చుని రాసుకుంటాడు. తన పుస్తకాలు ఒక మూలకి సర్దుకున్నాడు. తను నేలమీదే కూర్చుని చదువుకుంటాడు. అప్పుడు అమ్మకి బాధ కలుగుతుంది. అవును, అదే మంచిది. అలాగే అవ్వాలి. అమ్మకి బాధ, దుఃఖం రావాలి. బెంగపడాలి. అదే తన కోరిక.

తను ఇక్కడకి వచ్చినప్పుడ్నుంచీ అదెందుకో అమ్మ బాధపడితే, ఏడిస్తే తనకి సంతోషంగా అనిపిస్తోంది. అదోరకం ప్రతీకారం...!

ప్రతీకారం! అవును ఈ టైములో తను డాడీకి ఉత్తరం ఎందుకు రాయకూడదు? కాస్త కాస్త చొప్పున రెండు మూడు రోజుల్లో రాస్తేసరి. ఈసారి నాన్న వస్తే ఆయన్తో వెళ్ళిపోడం ఖాయం. అమ్మ బాగా ఏడవాలి. ఏడుస్తూనే వుండాలి.

కారు వచ్చింది. అమిత్, జ్యోతితోపాటు అమ్మ కూడా దిగుతోంది.

★ ★ ★

రాత్రి ఎనిమిదిన్నరకి అంతా భోజనాల టేబుల్ దగ్గర చేరారు. భోజనం చేస్తూ అమిత్ అన్నాడు-

"నాన్నా బంటీ అన్న కొత్త టేబుల్‌మీద తన బుక్స్ పెట్టుకోలేదు. అమ్మ చాలా చెప్పింది... అయినా..."

డాక్టర్‌గారు బంటీని సూటిగా చూశారు. ఆయన దృష్టినెదుర్కోలేక బంటీ తల వంచుకున్నాడు. ఓరగా అమ్మ ముఖంవేపు చూడసాగాడు.

"బంటీ టేబుల్ నీకు నచ్చలేదా? నీ కోసం ఎంతో చక్కటి టేబుల్ సెలెక్ట్ చేసి తెచ్చాను"

బంటీ మౌనంగా వున్నాడు. అమ్మ కూడా మాట్లాడలేదు.

"బంటీ అన్న నేలమీదే కూర్చుని చదువుకుంటాడట. తను టేబుల్ వాడనే వాడడట"

వీడొకడు చాడీకోరు!

అమ్మ మౌనంగా అందరికీ వడ్డిస్తోంది.

"నువ్వెందుకింత మొండితనం చేస్తావు బంటీ? బంగారుబాబువి కదా నువ్వు. ఇలా చెయ్యడం మంచివనేనా చెప్పు? భోజనం కాగానే పుస్తకాలన్నీ టేబుల్‌మీద సర్దుకోవాలి. నేను చూడ్డానికొస్తాను తెలిసిందా?"

డాక్టర్‌గారు ఆఖరిమాట అన్నట్టుగా చెప్పేశారు. బంటీ బదులు చెప్పకుండా తలవంచుకుని భోజనం చెయ్యసాగాడు.

భోజనాలయ్యాక అమ్మ త్వరత్వరగా పుస్తకాలని టేబుల్‌మీద సర్దడం మొదలెట్టింది. "త్వరత్వరగా సర్దేసుకో బంటీ నాన్నగారికి కోపం వస్తుంది" అని జ్యోతికూడా తెలియజెప్పింది. బంటీ ఊరికే నుంచున్నాడు. మాట్లాడలేదు. వ్యతిరేకించలేదు.

పుస్తకాలన్నీ సర్దాక అమ్మ కోపంగా అంది, "పనికిమాలిన విషయాలన్నిటికీ మొండిపట్టు పట్టకు. రోజల్లా నీది ఏదో ఒక గొడవ వుంటూనే వుంది. ఇకమీదైనా సరిగ్గా వుండు తెల్సిందా?"

అమ్మ వెళ్ళగానే బంటీ మళ్ళీ తన సామానంతా కింద పెట్టేసుకున్నాడు.

"బంటీ అన్నా డాడీ, మమ్మీ వస్తున్నారు" అనేసి అమిత్ పారిపోయాడు.

"బంటీ, నువ్వు పుస్తకాలు మళ్ళీ కింద పెట్టేసుకున్నావా? మంచిది. నీ టేబుల్ని రేపే తిరిగిచ్చేస్తాను. నువ్వు నేలమీదే కూర్చుని చదువుకో. ఇకమీదటేమన్నా మొండితనం చేస్తే నేను సహించను తెలిసిందా?" అంది అమ్మ



బంటీ కళ్ళు దించుకున్నాడు. విశాలమైన కళ్ళల్లోంచి గుండ్రటి, ముత్యాల్లాంటి బిందువులు నేలమీద రాలాయి.



సాయంకాలంవేళ మేడమీదనుంచుని బంటీ, జ్యోతి వేరుసెనక్కాయలు తింటున్నారు. జ్యోతి ఏవేవో కబుర్లు చెబుతోంది. వాటి మధ్యలో ఉన్నట్టుండి అడిగింది.

"నువ్వు ఏమీ మాట్లాడవెందుకని బంటీ? నీకింకా కోపం పోలేదా?"

బంటీ అడిగాడు, "జ్యోతీ నీకు మీ అమ్మెప్పుడూ జ్ఞాపకం రాదా? మీ అమ్మ ఎలా వుండేవారు?"

"ఒక్కోసారి గుర్తొస్తుంది. ఇప్పుడంతగా అనిపించదు. చిన్నమామ్మ చాలా గుర్తొస్తుంది. శలవుల్లో మేమంతా అలాహాబాదు వెళ్తాం. ఈసారి నువ్వు కూడారా"

"మా మమ్మీ నీ కిష్టమేనా?"

"ఓ... చాలా ఇష్టం"

"మా నాన్నని చూస్తే నీకింకా నచ్చుతారు. మానాన్న చాలా మంచాయన. నేను ఆయనకి లెటర్ రాస్తాను" అనేసి నాలుక్కరుచుకున్నాడు. ఛ! అతి చిన్న విషయాన్ని కూడా గుట్టుగా వుంచుకోడం రాదు తనకి.

"ఈసారి మానాన్న వచ్చినప్పుడు నిన్నూ నాకు తోడుగా తీసికెళ్తాను. మా నాన్న చక్కగా ఎక్కడెక్కడికో తిప్పుతారు. నువ్వూ నాతో వస్తావా?"

"నువ్వు మా నాన్నని నాన్నా అని ఎందుకు పిలవ్వు బంటీ? మా నాన్న కూడా చాలా మంచాయన"

బంటీ బదులు చెప్పలేదు.

అమ్మ, డాక్టర్‌గారు డైనింగ్‌టేబుల్‌ముందు కూర్చున్నారు. బంటీ రాగానే వాళ్ళు మాటలాపేశారు. అయితే తప్పకుండా తన గురించే మాట్లాడుకుంటూ వుండివుండాలి. అమ్మ కంప్లెయింట్స్ చెప్తూ వుండుంటుంది. అంతకంటే ఇంకేముంటుంది?

భోజనాలు మొదలయ్యాయి. రోజూలాగే అంతా కబుర్లు చెప్పుకుంటూ తింటున్నారు. బంటీ మాత్రం మౌనంగానే వున్నాడు. ఈమధ్య బంటీ పూర్తిగా మాట్లాడ్డమే మానేశాడు. భోజనం టైములో భోజనం. నిద్రటైములో నిద్ర. మిగతాటైములో ఏదన్నా పుస్తకమన్నా పట్టుకుంటాడు. లేదా డ్రాయింగ్.

ఉన్నట్టుండి డాక్టర్‌గారడిగారు.

"బంటీ, రేపు నాతో షికారుకొస్తావా?"

ఒక్కక్షణం బంటీకి ఆయన మాట అర్థంకాలేదు.

"రేపు, నేను నిన్ను ఊళ్ళో తిప్పుకొస్తాను. దూరం... బోలెడుదూరం... కార్లో వెళ్ళొద్దాం"

"నేనూ వస్తాను నాన్నా. కార్లో చాలా దూరం వెళ్ళడం నాకూ ఇష్టం. భలే మజాగా వుంటుంది" అన్నాడు అమిత్

"ఊహూ... రేపింకెవరూ వద్దు. నువ్వు అసలొద్దు. నువ్వు టేబుల్ విషయంలో అన్నయ్యకి కోపం వచ్చేలా బిహేవ్‌చేశావు. అందుకే వాడొక్కడినే తీసికెళ్ళి కోపంపోయేలా చెయ్యాలి"

డాక్టర్‌గారా ఈమాట చెప్తున్నది! బంటీ సాహసించి కళ్ళెత్తి చూశాడు. ఆయన వాడినే చూస్తూ చిరునవ్వు నవ్వుతున్నారు. నవ్వుతున్న ఆయన ముఖం వాడికి చాలా నచ్చింది. ఉన్నట్టుండి వాడికి ఆయన ముఖంలో తన తండ్రి ముఖం కనపడింది.

"వస్తాను" బంటీ మెల్లగా జవాబిచ్చాడు.

"బంటీ మాత్రం రావాలా? నేనెందుకు రాకూడదు? ఒకడే వెళ్ళడానికి బంటీ అన్నయ్యేమన్నా మహారాజా?"

"అమిత్!" డాక్టర్‌గారు కోపంగా కసిరేసరికి




ఒక్కక్షణం బంటీ కూడా వణికాడు. ఎలా కనురుతారో!

అమిత్ ఏడుస్తూ వెళ్ళిపోయాడు. అలాగే అవ్వాలి. ఇప్పుడు చెప్పమను, "నా కారు... నా టేబుల్.. బంటీ అన్నని వాళ్ళింటికి పంపెయ్యి" ఇప్పుడేం చేస్తాడట.

మమ్మీ అమిత్‌నెత్తుకుని వచ్చింది, "మిమ్మల్ని నేను తిప్పుకొస్తాగా! అడిగినవన్నీ ఇప్పిస్తాను సరేనా?"

తీసికెళ్తే తీసికెళ్ళుకోనీ. కారెలాగూ మా దగ్గరుంటుంది 'టుక్కూ టుక్కూ' అని టాంగాలో వెళ్ళాలంతే.

రాత్రి పడుకున్నాక గుర్తొచ్చింది. నాన్నకి ఉత్తరం రాయాల్సింది. రేపు రాస్తేసరి.

కళ్ళు మూసుకున్నాడు కలల్లో తేలిపోతూ.

గది కాస్తా రోడ్డుగా మారిపోయింది. నున్నటి, పొడవాటి రోడ్డు దానిమీద పరుగెడుతున్న కారు. తను కారులో వెళ్ళడం కైలాస్ చూస్తే ఎంత బాగుండును. ఒక్క నిమిషం టిటూ ఇంటిక్కూడా కార్లో వెళ్ళాలి.

అమిత్! నువ్వు రావద్దు. జ్యోతీ! నువ్వూ రావద్దు. శక్కూ, నువ్వూ అక్కర్లేదు. బంటీ మాత్రం రావాలంతే. బంటీకి కోపం వచ్చింది. వాడి కోపం పోగొట్టాలి.

★ ★ ★

ఆరోజు డాక్టర్‌గారు ఆరుగంటలకల్లా వస్తానని చెప్పారు. రోజూ ఆయన ఎనిమిది గంటలగ్గాని ఇంటికి రారు. ఈరోజు బంటీకోసం త్వరగా వస్తానని చెప్పారు. బంటీ ఐదున్నరకే తయారైకూర్చున్నాడు. ఈమధ్య వాడేమన్నా కొనుక్కుని చాలాకాలం అయిపోయింది. ఇవాళేమన్నా కొనుక్కోవాలనుకున్నాడు. జ్యోతికి కూడా ఏమన్నా కొనిపెట్టాలా ఊఁ, అమిత్‌కి కూడా ఏమన్నా తెస్తేసరి. వాడు అల్లరి వెధవే. అయినా... చిన్నవాడుకదా!

ఎవరికేం కావాలన్నా తెచ్చిపెట్టేద్దామన్నంత ఉదారంగా వుంది మనను. నిమిషానికొకసారి లోపలకి వెళ్ళి గడియారం చూసి వస్తున్నాడు. నాన్నగారు వస్తానని కబురు పంపినప్పుడల్లా వాడు ఇలాగే గిజగిజలాడేవాడు. ఇప్పుడు నాన్న స్థానంలో డాక్టర్‌గారు కనిపిస్తున్నారు. ఇద్దరూ ఒకటే, ఇద్దరి పోలికలు ఒకటేనన్న భావన కలిగింది.

జ్యోతిని, అమిత్‌ని చదువుకి కూర్చోబెట్టింది అమ్మ. వాళ్ళని రేపు అమ్మ తీసికెళ్తుందేమో. డాక్టర్‌గారి భయంతో అమిత్ కూడా గొడవ చెయ్యకుండా మర్యాదగా కూర్చున్నాడు.

ఆరుగంటలయింది. ఇంకేం, వచ్చేస్తారు. పేషెంట్స్ గొడవలోంచి బయటపడటం అంత సులువైన పనేమీకాదు. పొద్దున్నే తనే స్వయంగా చూస్తాడుగా. కుర్చీలు, బెంచీలు నిండిపోయి, నేలమీద కూడా బోలెడుమంది కూర్చుని వుంటారు.

మాటలా మరి! ఊళ్ళోకల్లా పెద్ద డాక్టరాయె! మొట్టమొదటిసారి డాక్టర్‌గారిమీద అభిమానం కలిగింది వాడికి.

ఆరున్నర! ఇప్పుడు బంటీ మనసు కలవరపడడం మొదలైంది. సమయం గడిచేకొద్దీ అశాంతి! రానురాను ఆ అశాంతి కోపంగా మారసాగింది. ఏడుగంటలకి కాంపౌండర్ వచ్చివెళ్ళాడు. "డాక్టర్‌గారు సరిగ్గా బయల్దేరాలనుకుంటుంటే వర్మగారికి హార్ట్‌ఎటాక్ అన్న వార్త వచ్చింది. నన్ను ఇటొచ్చి చెప్పమని ఆయన అటు వెళ్ళిపోయారు. పేషెంట్స్ చాలామంది వుండటంవల్ల నాకూ త్వరగా రావడానికి కుదర్లేదు" అన్న వార్త చెప్పాడు.

బంటీ సాక్సు, బూట్లు అన్నీ లాగేసి విసిరికొట్టాడు. అబద్ధాలు! అన్నీ అబద్ధాలు. తనని ఉబ్బెయ్యటం కోసం అన్నీ వచ్చి అబద్ధాలు చెప్పారు. తీసికెళ్ళడం ఇష్టం లేకపోతే ఆమాట చెప్పెయ్యొచ్చుగా.

అమిత్ 'అలాగే అవ్వాలి' అన్నట్టుగా బొటనవేలు వెక్కిరింతగా అల్లాడించి పారిపోయాడు. వాడిని మెడపట్టి గెంటెయ్యాలన్నంత కోపం వచ్చింది. రౌండ్‌కి తీసికెళ్ళమని తనేమన్నా అడిగాడా? ఎంతయినా ఈ ఇల్లు తనది కాదు. ఈ మనుమలు అసలే తనవాళ్ళు కాదు.

మమ్మీ గదిలో సామాన్లన్నీ ఒక్కొక్కటీ తీసి విసిరికొట్టాలనిపించింది. కోపంతో ఉడికిపోతూ తన బీరువా తలుపుతీశాడు. ఇదొక్కదానిమీదేగా తనకి అధికారం వున్నది. అక్కడున్న

ఒక్కొక్క వస్తువూ, బట్టలూ తీసి గదినిండా పారేశాడు.

"బంటీ" అమ్మ పరుగెత్తుకొచ్చి వాడి చెయ్యి గట్టిగా పట్టుకుంది, "ఇదేం పిచ్చిపని బంటీ" అంటూ.

బంటీ తన శక్తినంతా ఉపయోగించి చెయ్యి విడిపించుకున్నాడు. కాళ్ళకింద బట్టల్ని పడేసి తొక్కసాగాడు.

"నీకింకెప్పటికైనా బుద్ధొస్తుందో రాదో. ఏదో ఒక విషయానికి రాద్ధాంతం చేస్తూనే వుంటావు" అని అంటూ వాడిని బలంగా పట్టుకుని లాగి మంచంమీదకి తోసింది. ఆమె పట్టు కాస్త సడలగానే బంటీ చటుక్కున పైకి లేచాడు. నీట్‌గా సర్దిపెట్టుకున్న పెయింట్ సీసాలన్నీ ఒక్కొక్కటీ తీసి విసిరేశాడు. సీసాలు పగిలి రంగులన్నీ కలగాపులగం అయిపోయాయి. తరువాత తనే మంచంమీద పడుకుని కొట్టు ఇంకా కొట్టు అంటూ అరిచాడు.

అమిత్, జ్యోతి, బన్సీలాల్ అంతా ఆ చుట్టుపక్కలే వున్నారు. ఎక్కడనుంచో ఒక స్వరం పలుకుతున్నట్టనిపించింది.

"మరీ ఇంత నెత్తికెక్కించుకోకండమ్మా. ఏదో ఒకరోజు మీకే కష్టమవుతుంది"

★ ★ ★

"మీరేమిటిలా చేశారు? వాడు ఏడ్చి ఏడ్చి నానాగోలా చేసిపెట్టాడు"

"ఎందుకు? ఓ! అదా? నువ్వేమిటిలా మాట్లాడుతున్నావు? అంత సీరియస్‌గా హార్ట్ఎటాక్ వస్తే, అటెండవకుండా ఎలా రాగలను? అసలు రాత్రి ఇంటికి రావడానికి కుదరదేమో అనుకున్నాను. ఏదో అతను బతకడమే చాలా గొప్ప విషయం. బన్సీలాల్ స్నానానికి నీళ్ళు కాచు. ముందు ఒక కప్పు టీ ఇచ్చెయ్..."

అయిపోయింది. బంటీ గురించి ఒక్క మాట కూడా లేదు.

ఎన్నాళ్ళనుంచో తుపాకీ పేల్చలేదు. ఇవాళ పేల్చాలి "రేయ్ రేయ్"మని.

ఇకమీదట తనెవరితోనూ మాట్లాడడు. జ్యోతితో కూడా. మమ్మీనసలు పలుకరించడు.

★ ★ ★

స్కూల్నుంచి తిరిగి వచ్చిన బంటీకి ఇంట్లోకి పోబుద్ధికాలేదు. గేటుదగ్గరే రోడ్డుని చూస్తూ నుంచున్నాడు. ఈ రోడ్డుమీదే పరుగెత్తి పారిపోతే! కాని ఎక్కడకి? ఈసారి ఈ ప్రశ్న తలెత్తినా వాడిని అడ్డుకోలేకపోయింది. వాడు రోడ్డుమీద పరుగెత్తడం ప్రారంభించాడు. పరుగెత్తి పరుగెత్తి వాడు తమ పాత ఇంటి గేటు దగ్గరకొచ్చాడు. భయంతో, ఆయాసంతో వాడికి రొప్పు వస్తోంది.

తన ఇల్లు, తన తోట! అయినా ఇప్పుడు ఏదీ తన స్వంతంకాదు. ఇంటి కిటికీలన్నీ మూసి వున్నాయి. తలుపుకి తాళంవేసి వుంది. తనిప్పుడు ఆ ఇంట్లోకి వెళ్ళడానికి లేదు.

వాడు తోటలోకి వెళ్ళాడు. తోటంతా తిరిగి చూశాడు. తోటలో చెట్లన్నీ తాకితాకి చూశాడు. పూలచెట్లన్నీ కొత్త చిగుళ్ళతో, కొత్త ఆకులతో నిండుగా వున్నాయి.

ఈపాటికి అమిత్, జ్యోతి, అమ్మ ఇంటికి వచ్చి వుంటారు. తను కనపడక అమ్మ బన్సీలాల్‌ని అడిగివుంటుంది. వరండాలో వున్న పుస్తకాల బాక్స్ ఆమె కంటికి కనిపించిందో లేదో.

అస్థిమితంగా అమ్మ చుట్టుపక్కలంతా చూసివుంటుంది. అలాగే అవ్వాలి. ఇక్కడ్నుంచి తను వెళ్ళనే వెళ్ళకూడదు.

"నాన్నా... బంటీ ఇంటికి రాలేదు. ఎక్కడికెళ్ళాడో తెలీదు" అని ఎవరో ఒకరు చెప్పనే చెప్తారు.

డాక్టర్‌గారి కనుబొమలు ముడిపడతాయి. అమ్మ కళ్ళల్లో నీళ్ళు నిండుతాయి. ముఖం పాలిపోతుంది.

అమ్మ ప్రిన్సిపాల్ అయినా డాక్టర్‌గార్ని చూస్తే భయపడుతుంది. ఇక్కడుండగా తను అందర్నీ గద్దించేది. తనని మాత్రం ముద్దుచేసేది. అక్కడ? తనని గద్దిస్తుంది. మిగిలిన వాళ్ళని మాత్రం? అలాగే అవ్వాలి. ఈరోజు అమ్మకి బుద్ధివస్తుంది. అమ్మ మనసుకి అశాంతిగా ఉంటుందని తల్చుకుంటేనే వాడికి సంతోషంగా వుంది.

ఎవరన్నా వీధిలోకి రావడం కనపడగానే




బంటీ దాక్కుంటున్నాడు. హీరాలాల్‌గాని, మాలిగాని వస్తే తనని చూస్తారు. చూసి ఇంటికి తీసికెళ్ళి దింపివస్తారు. దాన్తో తన ప్లానంతా పాడవుతుంది.

మెల్లగా చీకటి పడింది. టిటూ ఇంటిదీపాలు వెలిగాయి. ఒక్కక్షణం తను అక్కడికి వెళ్తేనో అనుకున్నాడు. కాని వెంటనే టిటూ వాళ్ళమ్మ గుర్తొచ్చింది. 'ఒద్దు బాబూ, అక్కడకి వెళ్లనేవద్దు' అనుకున్నాడు. ఆవిడ వేసే ప్రశ్నలన్నిటికీ జవాబులెవరు చెప్పగలరు?

బయటి చీకటి మనసులోనూ ప్రవేశించడం మొదలెట్టింది. భయం! విచిత్రమైన భయం. అమ్మ తననివెతుక్కుంటూ!ఎందుకు రాలేదు? తన సంగతి అమ్మకి గుర్తురాలేదా?

ఒకవేళ డాక్టర్ "ఇదంతా కుదరదు" అని కోప్పడ్డారా?

రాత్రయినా అమ్మ రాకపోతే?! వాడు గేటువరకు వెళ్ళి రోడ్డువంకే చూడసాగాడు. ఇప్పుడక్కడ ఎవరూ తిరగటంలేదు. ఆ రోడ్డులో సాధారణంగా సందడే వుండదు. ఇప్పుడసలే లేదు. బంటీ చెట్టెక్కాడు. ఏదన్నా కారు... లేదా మనుమలు వస్తున్నారా అని చూశాడు.

'ఊహు! ఎవరూ లేరు. వాడి చెంపలమీద కన్నీళ్ళు కారడం మొదలెట్టాయి. నిర్లక్ష్యం... అవమానం... చెట్టుమీంచి దూకేద్దామా అనుకున్నాడు. బాగా దెబ్బలు తగలాలి. హార్ట్‌ఎటాక్.

బంటీ కిందకి దిగివచ్చాడు. అవమానం, కోపంతో తన చేతుల్ని కాళ్లని తనే విరగ్గొట్టుకుందామా అనిపించింది. చెట్టునుంచి ఒక ఎండుకొమ్మని విరుచుకున్నాడు.

ఇప్పుడూ ఎవరూ రాలేదు.

వాడు ఆ కొమ్మ తీసుకుని తోటలో పూలని ఆకుల్ని అన్నింటినీ కొట్టడం మొదలెట్టాడు. కొట్టి కొట్టి మొక్కలన్నిటినీ విరగ్గొట్టి పెట్టాడు. తను నాటి పెంచిన మొక్కల్ని అలా నాశనం చేసి అదోరకమైన వికృతానందాన్ని పొందాడు.

అయినా ఎవరూ రాలేదు.

వచ్చికమీద దబ్బున పడ్డాడు. ఆకలితో, చలితో ఏడుస్తూ పడుకున్నాడు.

ఒక్కసారిగా ఇంటి తలుపులు తెరచుకున్నట్టు భ్రమ. ఏదో పాటని కూనిరాగం తీస్తూ అత్తయ్యొస్తోంది. బంటీకి ఊపిరి ఆగిపోయినట్టయింది. అత్తయ్య ముందుముందుకొస్తున్నట్టయింది. అత్తయ్యా? అత్తయ్య భూతమా? అత్తయ్య చచ్చిపోలేదుకద!

కథలో రాణీ కూడా చచ్చిపోయింది. అయితే, ఆ రాణీ ప్రాణం కూతురిలో కలిసిపోయింది. ఆమె పక్షిగా మారి ఆ గదిలో వుండి వుంటుందా?

సగం మూసుకున్న కళ్ళతో బంటీ చూస్తున్నాడు. తెల్లటి ఆకారం ఒకటి గాలిలో విన్యాసాలు చేస్తోంది. వన్... టూ... త్రీ... ఫోర్...

బంటీ ఊపిరి బిగపట్టి ఎక్కడో మునిగిపోతున్నట్టు అయిపోతున్నాడు. పాతాళంలో... ఎక్కడో లోతుగా ఏవేవో ధ్వనులు వినిపిస్తున్నాయి. దగ్గర దగ్గరకొచ్చేస్తున్నాయి.

"నన్ను కొట్టద్దు... నన్ను చంపద్దు..." అని బంటీ అరుస్తున్నాడు. కాని ధ్వని బయటకి రావటంలేదు.

"బంటీ, బంటీ" ఎవరో వాడిని పట్టుకుని లేపి కూర్చోపెట్టారు. వాడు కళ్ళు మిటకరించి చూశాడు. ఎదురుగా వున్నది ఎవరు?

"నువ్వు ఇక్కడ పడున్నావా? ఎంతసేపట్నుంచి?" ఎవరో వాడి భుజాల్ని బలంగా కుదుపుతున్నారు. మెల్లగా ఒక ముఖం స్పష్టంగా కంటపడింది. కలవరం నిండిన ముఖం-ఎర్రటి కళ్ళతో చూస్తోంది.

"చెప్పు, నువ్వెందుకిలా చేస్తున్నావు? ఎందుకిలా నీ జీవితాన్ని పాడుచేసుకుంటూ, నా జీవితాన్నీ పాడుచేస్తున్నావు? అక్కడ నీకేమిటి కష్టం? ఏమిటిబ్బంది?"

ఓ! అమ్మ! అమ్మ ముఖంచూసి వాడికేమీ ధైర్యం వచ్చిపడలేదు. భయం కూడా వెయ్యాలేదు.

"ప్రతిరోజూ ఏదో గొడవ నీది. ప్రతిరోజూ రాద్ధాంతం. మిగతా వాళ్లంతా ఎన్నాళ్ళని నీపోరు పడగలరు? ఎందుకు భరిస్తారు?" ఎడం చెంపమీద ఫట్‌ఫట్‌మని శబ్దం.

అమ్మ కొట్టివుండచ్చు.

"సరే, ఎలాగూ మీనాన్న నిన్ను తీసుకెళ్తాను. తీసికెళ్తానని అన్నారుగా. అక్కడికే

పంపిస్తాను. అక్కడేవుండు...''

అమ్మ వాడిని లాక్కునిపోయింది. తీసికెళ్లి కార్లో పడేసింది.

వాడు నడవనూలేదు. కారెక్కనూలేదు. అమ్మ మాట్లాడుతూనేవుంది. ఏంమాట్లాడు తోందో వాడికొక్క ముక్క అర్థం కావటంలేదు. ఏమీ అనిపించనూ లేదు.

...కాసేపయ్యాక వాడికి అమ్మ మాటలు వినపడ్డమూ మానేశాయి.

★ ★ ★

బంటీ పూర్తిగా స్తబ్దంగా తయారయ్యాడు. మనసులోనూ, బయటా కూడా.

స్కూల్నుంచి వచ్చాక పోర్టికోలో నుంచుని అమిత్, జ్యోతి, అమ్మ వస్తారేమోనని ఎదురు చూస్తాడు. తీరా వాళ్ళొచ్చాక తను వాళ్ళకోసం ఎదురుచూడనేలేదేమో అన్నట్టుగా ఏమీ పట్ట నట్లు వుండిపోతాడు. ఇప్పుడు వాళ్ళు ముగ్గు రు కలిసి కారు దిగుతుంటే వాడికేమీ అని పించటం లేదు.

''బంటీ రమ్మీ ఆడదాం రారా'' అంటే వాళ్ళతో కూర్చుంటాడు.

''స్కూల్నుంచి వస్తే చాలు కార్డ్సు పట్టుకుని కూర్చుంటారు. హోంవర్క్ చెయ్యరా ఏం?'' అని అమ్మ కోప్పడితే వెంటనే వెళ్ళి చదువు కుందుకు కూర్చుంటారు.

ఒక్కోసారి పెయింటింగ్ చేద్దామని పిస్తుంది. కాని ఆ సీసాలన్నీ పగిలిపోయా యిగా. రంగులన్నీ ఒలికిపోయాయిగా. ఉన్న కొద్ది రంగుల్లో ఏమీ చెయ్యడానికీ కుదరదు.

వాడొక్కడే వున్నప్పుడు వాళ్ళమ్మ కారణం వున్నా లేకపోయినా వాడిని ముద్దుచేసేది. ఆ సమయంలో పూర్వం అమ్మ కళ్ళల్లో అదేదో ఆత్మీయతాభావన కదిలేది. మరి ఇప్పుడు?

★ ★ ★

బంటీ డాక్టర్‌గారి కార్లో కూర్చుని స్టేషన్‌కి వెళ్తున్నాడు నాన్నని తీసుకురావడానికి.

క్రితంసారి మాలితోపాటు టాంగాలో వెళ్తుంటే ఎంత సంతోషంగా అనిపించిందో నాన్న వస్తారని. ఈసారి సంతోషపడాలన్నా లోపలంతా ఏదో శూన్యంగా వుంది. నాన్నకి ఏవేవో చెప్పాలి. ఏమేమో రాయాలి. అని ఆలోచించుకుంటున్నాడు. కాని మనసులో సంతోషం, భయం ఏదీ లేదు.

★ ★ ★

క్రితంరోజు స్కూల్నుంచి వచ్చేటప్పటికి అమ్మ ఇంట్లోనే వుంది. వాడి చేతిలోంచి బాక్స్ తీసుకుని- ''వచ్చావా నాన్నా'' అని లోపలకి తీసికెళ్ళింది.

అయితే అమ్మ ఇవాళ కాలేజికి వెళ్ళలేదా? చీర, సిగ చూస్తే వెళ్ళిందేమోనన్నట్టుగానే వుంది. త్వరగా తిరిగి వచ్చేసిందేమో. ఎందు కో మరి?

''పద, బట్టలు మార్చుకో'' అని బట్టలు తీసిచ్చింది. చాలా రోజుల తరువాత వాడికి బట్టలు తీసిచ్చింది! అమ్మ ఏదో కలవరంగా వున్నట్టనిపించింది వాడికి.

బట్టలు మార్చగానే అమ్మ వాడి భుజాలు పట్టుకుని తన గదికి తీసికెళ్ళింది. మంచంమీద చెల్లాచెదురుగా పడున్న కాగితా లమీద వాడి దృష్టి పడింది. తను నాన్నగారికి రాసిన ఉత్తరాలు అన్నీ సగంసగం రాసినవే. ఏదీ పూర్తిచెయ్యలేదు. ఈ ఉత్తరాలన్నీ అమ్మ కెలా దొరికాయి? తప్పుచేసిన ఫీలింగ్ వచ్చినా, మరోవిధంగా సంతోషంగా అనిపించింది.వా డు అమ్మకేసి చూశాడు. ఆమె వాడివంక తదేకంగా చూస్తోంది.

''బంటీ ఈ ఉత్తరాలన్నీ నువ్వే రాశావా?''

బంటీ మౌనంగా నుంచున్నాడు.

''చెప్పుబాబూ... నేనేం కోపం తెచ్చుకోను. ఊరికే అడుగుతున్నాను. ఇలా ఉత్తరం రాసి మీ నాన్నకి పోస్ట్ చేశావా? లేకపోతే పంపించావా? ఎలా పంపించావు? ఎవరిచేత పంపావు?''

అమ్మ అదిగే స్వరం తనలోతను మాట్లాడు కుంటున్నట్టుగా వుంది. ఒక్కసారి బంటీని దగ్గరకి లాక్కుని కౌగలించుకుంది.

''ఎందుకు బంటీ! నీకిక్కడ బాగుండటం లేదా? నీకు మీ నాన్నదగ్గరకి వెళ్ళిపోవాలని వుందా? వెళ్తావా?

సరే నాన్నా... వెళ్ళాలనుంటే అక్కడకే

వెళ్ళు. నిన్ను తీసికెళ్ళడానికి మీ నాన్న వస్తు న్నారు. ఈసారి నేనూ నిన్ను ఆపుచెయ్యను. నీకు సంతోషంగా లేనప్పుడు... నేనేం చెయ్యగ లను? పట్టుదలలో మీ నాన్నకంటే నువ్వేమీ తక్కువ కాదు''

అమ్మ చేతులు కొంచెం సడిలాయి.

బంటీకేమీ అర్థంకాలేదు.

మర్నాడు పొద్దున్నే నాన్న వస్తారనే విషయం మటుకు అర్థమయింది. కాని అస లు విషయం అంతే కాదన్న సంగతి వాడికి తెలుసు. క్రితంసారి నాన్న వచ్చింది కేవలం తనని చూడ్డానికి మాత్రమే కాదు. ఇంకా ఏవేవో పనులు చేసి వెళ్ళారు... ఆ తరువాత అమ్మ ఏడుపు...

ఈసారి ఏం చెయ్యొచ్చు? బంటీ కారు డ్రైవ్‌చేస్తున్న డాక్టర్ గారివైపు చూశాడు. ఆయన రోడ్డుమీద దృష్టి నిలిపి కారు నడుపు తున్నారు. నాన్న ఇంతకుముందు డాక్టరుగార్ని చూశారా? వాళ్ళు ఒకరికొకరు పరిచయం లేక పోతే ఇంటికి రమ్మనడం ఎలా?

పొద్దున్న అమ్మే తనకి బట్టలు తొడిగింది. తల దువ్వింది. డాక్టర్‌గారు అమ్మనడిగారు.

''నువ్వు స్టేషన్‌కి రావా?''

''లేదు''

''ఏం?''

''ఎందుకులెండి, మీరు, బంటీ వెళ్ళి రండి''

''నువ్వు కాలేజీకి వెళ్ళవు కదా?''

'ఎందుక'న్నట్లుగా ఆయనవంక చూసింది.

''ఎవరన్నా ఇంట్లో ఉండద్దా? నేను పది గంటలకి వెళ్ళి తీరాల్సినమీటింగ్ ఒకటుంది''

''కాని, ఆయనిక్కడకి రారు''

''ఎందుకు రారు? నేను రమ్మని బల వంతం చేస్తాను. బంటీ నువ్వు కూడా, రావ ల్సిందేనని పట్టుపట్టాలి తెల్సిందా?''

బంటీ మనసులోనే అనుకున్నాడు. తను ఖచ్చితంగా బలవంతం చెయ్యడు. నాన్నగారు ఇక్కడికొస్తే తను ఆయన్తో మాట్లాడ్డం ఎలా కుదురుతుంది? ఈ ఇంట్లో మాట్లాడ్డం అసలు కుదరదు.

నాన్న వస్తున్నారట! నిజంగా వస్తున్నారా?

స్టేషన్‌లో బంటీ తండ్రిని గుర్తుపట్టాడు. వాడిని చూడగానే ఆయన ఎప్పటిలాగే పరు గున వచ్చి వాడిని దగ్గరకి లాక్కుని వాటేసుకు న్నారు. బుగ్గలమీద బోలెడు ముద్దులిచ్చారు.

ఆయన చేతులమధ్య చేరి ఆయన గుండె లకి ఆనుకుని ఎన్నో రోజుల్నుంచి గూడుకట్టిన దుఃఖాన్ని దింపుకున్నాడు. కళ్ళల్లో నీళ్ళు ఉబి కి రాబోయాయి. దాన్ని లోపలకి మింగేసి, తండ్రికి దూరంగా జరిగి నుంచున్నాడు. ఇంత పెద్దవాడయ్యాక తను ఏడవడమా? నాన్న అంటూ వుండిన మాటలు వాడికి గుర్తొచ్చాయి. 'ఆడపిల్లలా ఏడుస్తావా?'

నాన్న వాడినే ఒకసారి దీక్షగా చూశారు. అలాంటి సమయంలో ఆయన దృష్టిలో అమ్మ దృష్టికూడా చేరినట్టయింది. అందరూ తన నెందుకలా చూస్తారు? బంటీకి భయం వేసింది.

డాక్టర్‌గారు చెప్పారు. ''నాన్నగార్ని తీసు కుని పద బంటీ''

''పదండి నాన్నా''

నాన్నగారేదో చెప్పారు. డాక్టర్‌గారి కార్లోనే ఎక్కినా సర్క్యూట్‌హౌస్‌లోనే దిగారు. బంటీకి నిరాశగా అనిపించింది. అయితే నాన్న తన కోసం రాలేదన్నమాట! తనకంటే నాన్నగారికి పనే ఎక్కువ. నాలుగ్గంటలకి ఇంటికొస్తారట. అక్కడ ఆయన్తో ఏం మాట్లాడాలి? తనేమో స్కూలుకి వెళ్ళలేదు. ఇటు నాన్నగారు ఇంటికి రావడంలేదు. మరి సాయంత్రం దాకా తనేం చెయ్యాలి?

అమ్మ, బంటీ ఇద్దరే ఇంట్లో వున్నారు. ఇదివరకైతే అలా తామిద్దరే ఇంట్లో వుంటే బంటీకి సంతోషంగా వుండేది. అమ్మ వాడిని ముద్దుగా మాట్లాడించేది.

కాని ఇవాళ బంటీ అమ్మ దగ్గరకెళ్ళినా ఆవిడ వాడిని పలుకరించలేదు. ఒకసారి వాడి వంక చూసి మళ్ళీ తన పని చూసుకోడం మొదలెట్టింది.

తను నాన్నని చూసి వచ్చాడు కదా. అందు కని కోపం, దుఃఖం! అలాగే అవాలి అమ్మకి.

కోపం రావాలి. దుఃఖం రావాలి. అంతేకాదు, నాన్నతో తను కలకత్తాకి వెళ్ళినప్పుడు తెలిసొస్తుంది. 'వెళ్ళొద్దు బంటీ వెళ్ళొదు అనమను, అప్పుడు చెప్తాను' అనుకున్నాడు. కాని అమ్మ ఏమీ అనలేదు.

★ ★ ★

సుమారు నాలుగున్నర సమయంలో నాన్న వచ్చారు. ఎవరో కొత్తవాళ్ళకి చేసినట్టు అమ్మ 'నమస్తే' అంది. జ్యోతి మాటిమాటికీ నాన్న వంక ఎలా చూస్తోంది! నాన్న ఎంత మంచివారో జ్యోతికి తెలియాలని వాడికోరిక! కాని ఈ నాన్న...

టీ టేబుల్‌మీద బోలెడన్ని తినుబండారాలు, ఫలహారాలు. మొదటిరోజు తాము ఈ ఇంటికొచ్చినప్పుడు డాక్టర్‌గారు అమ్మకోసం అన్నీ ఇలాగే చేయించారు.

అమ్మ, నాన్న అమిత్, జ్యోతి అంతా కొత్తవాళ్ళముందు కూర్చున్నట్టు ఎలా మౌనంగా కూర్చున్నారో! ప్రతీరోజూ తనూ అంతే కదా. నాన్నతోటి ఏమన్నా మాట్లాడాలని వుంది. కాని నాన్న అమ్మ ఇద్దరూ మౌనంగానే కూర్చున్నారు. తనేమన్నా అడిగి, నాన్న దానికి బదులివ్వకపోతే జ్యోతి ''ఎలాంటి వారో మీ నాన్న!'' అని వెక్కిరించదూ?

నాన్న కూడా తననేమీ పలుకరించటం లేదు.

టీ తాగాక అమ్మ నాన్నగార్ని తీసుకుని గదిలోకి వెళ్ళింది. తనూ వాళ్ళ వెనకాలే వెళ్ళాడు.

చాలాసేపయ్యాక నాన్నగారన్నారు.

''నాకు... విషయం చాలా ఆలస్యంగా తెలిసింది. అభినందనలు పంపడానికి వీలవలేదు''

అమ్మ మౌనంగా వుండిపోయింది. ఆమె ముఖం పేలవంగా వుంది.

అలాగే అవ్వాలి. అప్పుడే అమ్మకి తెలిసొచ్చేది. నాన్నకి సంగతులన్నీ చెప్పేయాలి. ఈ ఇంటికి వచ్చినప్పట్నుంచీ అమ్మ తనని కొట్టడం కూడా మొదలెట్టింది. ఒక్కరోజు కూడా తన పక్కన పడుకోలేదు, సరికదా... ఛీ! అసహ్యం!

''బంటీ! కాసేపు నువ్వు అమిత్, జ్యోతిలతో వెళ్ళి ఆడుకోమ్మా''

హుం! తనని అక్కడ్నుంచి పంపెయ్యాలని చూస్తోంది. బంటీ అన్నీ చెప్పేస్తాడని భయపడుతోందేమో. అసలు నాన్న వచ్చింది తన కోసం. అమ్మకి, నాన్నకి పడదు కదా. అయినా సరే...

బంటీ కదల్లేదు.

''వెళ్ళు నాన్నా, కాసేపు ఆడుకుందుకు వెళ్ళు'' అని నాన్న కూడా చెప్పటంతో వెళ్ళక తప్పలేదు. బుసలు కొడుతూ బయటకి పోయాడు బంటీ.

ఊరికిరాగానే ''బుజ్జీ, నాకు పనుంది. పని చూసుకునిసాయంత్రంవస్తాగా'' అన్నారు. సరే, సాయంత్రం వచ్చి ఏం చేసినట్టు? ఇంటికొచ్చాక ''నాన్నా బయటికెళ్ళి ఆడుకోమ్మా'' అని పంపెయ్యడం! అయితే ఎందుకొచ్చినట్టు?

కాని వాడికిప్పుడు కోపం వచ్చింది నాన్న మీద కాదు అమ్మ మీదే. ఇదివరకు ఆయనొచ్చినప్పుడు రోజంతా షికారు తిప్పేవారు. ఇప్పుడే అమ్మ ఆయన్తో మాట్లాడ్డం మొదలుపెట్టింది. మనసులో వున్నకోపం అంతా పొంగి రాసాగింది. ఈ అమ్మకి సరిగ్గా బుద్ధొచ్చేలా చెయ్యాలిఅనుకున్నాడు.

కొంచెం సేపయ్యాక నాన్న వాడిని ప్రేమగా తొడమీద కూర్చోబెట్టుకుని చెప్పారు. ''నాతో కలకత్తా వస్తావా బంటీ? నేను నిన్ను తీసికెళ్ళడానికే వచ్చాను''

బంటీ అమ్మనే చూస్తూ ఆమెకే చెప్తున్నట్టుగా గట్టిగా కోపంగా అన్నాడు- ''తప్పకుండా వస్తాను. నేను ఇక్కడ అస్సలు వుండను''

నాన్న వాడిని దగ్గరకి తీసుకున్నాడు. బంటీ మనసులో ఎన్నాళ్ళనుంచో గూడుకట్టుకున్న బాధ, కోపం అంతా కరిగి కన్నీరుగా ప్రవహించింది. తండ్రిని కౌగలించుకుని గట్టిగా ఏడ్చేసాడు.

నాన్న వాడిని దగ్గరగా లాక్కుని అన్నారు- ''ఏడవద్దు కన్నా, ఏడవకు...''

ఆయన గొంతు కూడా భారంగా వుంది.

అమ్మ కళ్ళు ఎండిపోయినట్టున్నాయి.





నీళ్ళు లేని ఎర్రటి కళ్ళు. అలాగే అవ్వాలి అమ్మకి!



నాన్నతో బంటీ ఊళ్ళో తిరిగి రావడానికి వెళ్ళాడు. నాన్న కలకత్తా సంగతులన్నీ చెప్తున్నారు. కానీ వాడికేమీ వినిపించటం లేదు. వాడి కళ్ళముందు రీలులా తిరుగుతున్న దృశ్యాలన్నీ వేరు.

అమ్మ వాడిని మంచంమీద కూర్చోబెట్టుకుని ఏడుస్తూ బ్రతిమాలుతోంది. "వెళ్లద్దు కన్నా. వెళ్లద్దు. నువ్వు లేకుండా నేనుండలేను. ఇన్నాళ్ళల్లో ఎప్పుడయినా..."

అలాంటి పరిస్థితే వస్తే తల్లి దగ్గర తను పెట్టాల్సిన షరతులు వరుసగా గుర్తొచ్చాయి. వాటన్నిటికీ అమ్మ ఒప్పుకుంటేనే తనిక్కడ వుండేది. లేకపోతే తను వెళ్ళిపోతాడంతే!

తను లేకుండా అమ్మ ఒక్కరోజయినా వుండలేదన్న సంగతి తనకి తెలియదూ? డాక్టర్, అమిత్, జ్యోతి, పెద్ద బంగళా, కారు అన్నీ వుండచ్చు. కాని బంటీ లేకుండా...

"బంటీ, డాక్టర్‌గారెలా వుంటారు?" అనడిగారు నాన్న. ఆయన దృష్టి బంటీ ముఖంమీదే వుంది. బంటీకి ఏం చెప్పాలో తెలియలేదు. డాక్టర్‌గారి ముఖం కళ్ళముందు కదిలింది. వాడు మెల్లగా చెప్పాడు. "మంచాయన" అని.

"పిల్లలు?"

"జ్యోతి చాలా మంచిది. నేనంటే తనకి చాలా ఇష్టం. నాతో ఒక్కసారి కూడా దెబ్బలాడలేదు..."

అరె! ఈ నాన్న ఎందుకిలా చూస్తారు? తను తప్పేం మాట్లాడటం లేదు కదా!

తరువాత నాన్న ఇంకేమీ అడగలేదు.

★ ★ ★

రాత్రి బంటీ తన మంచంమీద అమ్మకోసం ఎదురుచూస్తూ పడుకున్నాడు. అమ్మ వస్తుంది, తనని వెళ్ళొద్దని బ్రతిమాలుతుంది. అప్పుడు తన కండిషన్లన్నీ చెప్పాలి.

జ్యోతి తన స్నేహితురాలింటికి వెళ్ళింది. వెనకాలే అమిత్ కూడా వెళ్ళాడు. ఒక్కడే వుంటే బంటీకి విసుగ్గా వుంది. నెపానికి ఒక పుస్తకం చేతిలో పట్టుకున్నాడు గాని వాడి ధ్యాసంతా అమ్మమీదే వుంది.

అమ్మ డాక్టర్‌గారితో తన గదిలో వుంది. తప్పకుండా ఏడుస్తూ వుండి వుంటుంది. బంటీకి నచ్చచెప్పమని డాక్టర్‌గార్ని వేడుకుంటూ వుండి వుంటుంది. ఆయనంటే తను భయపడతాడని అనుకుంటుందేమో. అసలే ఇప్పుడు నాన్నగారు కూడా వున్నారు. తనేం భయపడడు. అనుకున్నది స్పష్టంగా చెప్పేస్తాడు. ఇంక ఇదంతా భరించడం కష్టం.

కాని ఎవరూ తన దగ్గరకి రానేలేదు. రావడానికి ధైర్యం వుండాలిగా. అంతలో జ్యోతి, అమిత్ ఇంటికి వచ్చారు. తిన్నగా అమ్మ గదిలోకి వెళ్ళారు. వాడలా అమ్మ గదిలోకి ఎప్పుడూ వెళ్ళలేదు, వెళ్ళడం వాడివల్ల కాదు కూడా.

కొంచెంసేపయ్యాక జ్యోతివచ్చి అడిగింది.

"రేపు నువ్వు మీ నాన్నగారితో కలకత్తా వెళ్తున్నావా?"

"అవును, మా నాన్నగారు నన్ను తీసికెళ్ళడానికే వచ్చారు. నేను వెళ్ళిపోతాను" తన జవాబు అమ్మకి వినిపించాలనే గట్టిగా చెప్పాడు.

అమ్మకి వినిపించిందో లేదో గానీ జ్యోతి విని బట్టలు మార్చుకుందుకు వెళ్ళిపోయింది.

కొంచెం సేపటికి అమ్మ సడెన్‌గా తలుపు దగ్గరొచ్చి నుంచుంది. బంటీ అమ్మకేసి సూటిగా చూశాడు. తరువాత తను ఎవరికోసమూ ఎదురుచూడ్డం లేదన్నంత సహజంగా పుస్తకం వేపు చూపుతిప్పేసుకున్నాడు. అమ్మ

నిదానంగా వచ్చి వాడి దగ్గర కూర్చుంది. బంటీ మరోసారి అమ్మకి విధించాల్సిన షరతుల్ని పునశ్చరణ చేసుకున్నాడు. ఎందుకంటే అమ్మ ఏడవడం మొదలెట్టిందంటే తనకీ ఏడుపొచ్చెయ్యొచ్చు. అప్పుడు చెప్పాలనుకున్నవి చెప్పలేకపోతే!

కాని అమ్మ ఏమీ చెప్పలేదు. ఊరికే వాడి తల నిమురుతూ కూర్చుంది. వాడు కళ్ళెత్తి అమ్మ ముఖంకేసి చూశాడు. అమ్మ ఏడవటంలేదు. బహుశ ఇంక ఇప్పుడు ఏడుస్తుందేమో. ఊహుఁ, ఏడవనేలేదు. అప్పుడు బంటీ అన్నాడు, "నేను రేపు నాన్నతో కలకత్తా వెళ్ళిపోతాను"

వాడిమాట వినపడనట్టుగా వాడివంకే చూస్తూ కూర్చుంది. కాని ఏడవలేదు.

"నేను మళ్ళీ ఎప్పుడూ నీ దగ్గరకి రాను. నాన్నదగ్గరే వుంటాను... ఎప్పటికీ"

అమ్మ వాడి జుట్టు, చెంపలు సవరించింది. తరువాత మెల్లగా అంది... "బంటీ!"

బంటీ ఆమె చెప్పబోయే తొలి వాక్యంకోసం ఎదురుచూస్తున్నాడు. 'వెళ్ళొద్దు బంటీ అని అడగనీ చెప్తాను' అనుకుంటూ.

"నీకోసం ఏమేం తెచ్చిపెట్టను బంటీ? నీకు ఏమిష్టం?"

అంటే అమ్మ తనని ఆపు చెయ్యటంలేదు. తనని నిజంగా పంపించేస్తోంది. వాడికి లోపల ఏదో గుచ్చుకున్నట్టు అయింది.

"నాకేంవద్దు... నువ్విప్పించే ఏవస్తువూ నాకొద్దు. నేనేదీ తీసికెళ్ళను" రోషంతో మండుతున్న కళ్ళతో అమ్మనే చూస్తూ అన్నాడు ఇప్పుడేడవనీ అనుకుంటూ.

అమ్మ మాత్రం ఏడవలేదు. ఆరిపోయిన కళ్ళు, అంతకంటే ఎక్కువగా ఆరిపోయిన ముఖం.

ఇంట్లో డాక్టర్‌గారున్నారుగా. అందుకే ఏడవటంలేదేమో భయం అయ్యుంటుంది. ఎందుకూ, రేపు చూద్దాం! ఇంతకీ అమ్మ ఏడిస్తే తనకేంటి, మానేస్తే ఏమిటి? తను మాత్రం నాన్నగారితో కలకత్తా వెళ్ళిపోతాడు. నాన్నగారితో కలకత్తా అంతా తిరుగుతాడు. కొత్తకొత్త చోట్లన్నీ చూస్తాడు.

మర్నాడు కూడా అమ్మ ఏడవలేదు. ఒక్కసారి కూడా 'వెళ్ళొద్దు' అని అనలేదు. అప్పుడింక బంటీకి ఏడుపొచ్చింది. వాడు బాత్ రూంలో ఒంటరిగా కన్నీరు కార్చాడు.

డైనింగ్ టేబుల్ దగ్గర అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు. జ్యోతి, అమిత్, డాక్టర్, అమ్మ అంతా టేబుల్‌కేసే చూస్తూ కూర్చున్నారు. ఒక్కరయినా నువ్వు వెళ్ళొద్దు బంటీ అనలేదు. బహుశ అందరికీ తను వెళ్ళిపోడమే ఇష్టమేమో. అమ్మకి కూడా...

వాడి గొంతుకి ఏదో అడ్డుపడ్డట్టయింది. అన్నం మింగుడు పడలేదు.

అమ్మ కాలేజీకి వెళ్ళలేదు. వాడినీ స్కూలుకి పంపలేదు. నిన్నకూడా స్కూలుకి వెళ్ళలేదు. ఇవాళ కూడా వెళ్ళకపోతే ఎలా? స్కూలుకి వెళ్తానని అడుగుదామనుకున్నాడు. కాని ఏమీ మాట్లాడలేదు. ఎవరో తన గొంతు నొక్కుతున్నట్టుగా వుంది.

అమ్మ నిశ్శబ్దంగా బంటీ సామాను సర్దుతోంది. ఆ బట్టలు, ఆట వస్తువులు అవన్నీ ఎత్తి విసిరి కొట్టాలన్నంత కోపం వస్తోంది వాడికి. తను కలకత్తా వెళ్ళడు. అసలెందుకు వెళ్ళాలి? అసలెలా వెళ్తాడు? ఇంకో నెలలో పరీక్షలున్నాయి కూడా. అదీకాక అమ్మనొదిలిపెట్టి తను ఎప్పుడున్నాడని? ఎలా ఉండగలడని?

కాని వాడేమీ చెప్పలేకపోయాడు. కన్నీళ్ళని దిగమింగుతూ అటు- ఇటు తిరుగుతున్నాడు. సమయం గడిచేకొద్దీ దుఃఖమంతా లోలోపలే కరడుగట్టింది.

అప్పుడు అమ్మ వచ్చింది. రెండు భుజాల్ని పట్టుకుని అడిగింది "అక్కడికెళ్ళి నన్ను మర్చిపోవు కదూ బంటీ? అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తావా?"

"నేను నిన్నొక్కరోజు కూడా గుర్తుచేసుకోను. నీకు ఒక్క ఉత్తరం కూడా రాయను. నువ్వు... నువ్వు..."

తరువాతి మాటలు గొంతులోనే అణిగిపోయాయి. ఇప్పుడైనా అమ్మ ఏడుస్తుందనీ, తనని పిలుస్తుందనీ చూశాడు.





ఆమె కళ్ళల్లో నీళ్ళు చిమ్మాయి. కాని ఒక్క మాట కూడా మాట్లాడకుండా వెళ్ళిపోయింది.

నాన్నని తీసుకురావడానికి కారు వెళ్ళింది. బంటీ సామానంతా సిద్ధంగా వుంది. సామాను మీద మూడు, నాలుగు ప్యాకెట్లున్నాయి. వాటిని అమ్మ తెచ్చిపెట్టివుంటుంది. తను ఖచ్చితంగా వాటిని తీసికెళ్ళడు.

అంతలో డాక్టర్‌గారు ఇంటికొచ్చారు "బంటీ, వేసవి సెలవలకి నువ్విక్కడికిరా మనం అంతా కలిసి చిన్నమామ్మ వాళ్ళూరు వెళ్దాం" అంది జ్యోతి.

ఒక్కక్షణం జ్యోతివంకే చూసి అన్నాడు "లేదు, నేను ఇక్కడికెందుకు రావడం? నేనెక్కడికీ రాను. సెలవుల్లో నేను అక్కడే వుంటాను"

అవును, తను ఇక్కడికెందుకొస్తాడు, ఇక ముందు తనెప్పుడూ ఇక్కడికి రాడు. అమ్మ ఏమనుకుంటోంది తన గురించి?

నాన్న రాగానే డాక్టర్‌గారు బయటకొచ్చారు "మీరు చాలా ఆలస్యం చేసేశారు. నేను చాలా సేపట్నుంచి మీకోసమే కాచుకుని వున్నాను. కాసేపు కూర్చుని మాట్లాడుకుందామంటే కూడా వీలు లేకపోయింది చూడండి" అన్నారు.

నాన్న లోపలకి రాలేదు "సో సారీ! అనుకోకుండా లేటయిపోయింది" కోటు స్లీవ్‌ని వెనక్కిజరిపి వాచ్ చూసుకుంటూ అన్నారు "ఇప్పుడు రైలు బయల్దేరే టైమవుతోంది. బంటీ రెడీనా?"

బంటీ పరుగెత్తుకువెళ్ళి నాన్నదగ్గర నుంచున్నాడు. లోలోపల భయంభయంగా వున్నా పైకి ధైర్యంగా వున్నట్టే కనిపిస్తున్నాడు. తనకి కూడా ప్రేమగా చూసే నాన్నవున్నారని అందరికీ తెలియనీ.

అమ్మ బయటకి రాలేదు. నాన్న చూపులు కూడా ఆమెనే వెతుకుతున్నట్టున్నాయేమో. అమ్మ బయటకి రాదా?

బన్సీలాల్ బంటీ సామాన్లు కారులో పెట్టడానికి తెస్తుంటే అమ్మ పెట్టిన ప్యాకెట్లు తీసి పక్కకి పెట్టాడు బంటీ.

"అరె, అవన్నీ నీ కోసం తెచ్చినవే బంటీ... తీసికెళ్లు"

బంటీ మాట్లాడలేదు. మౌనంగా వాటిని మెట్లమీద ఒకపక్కకి పెట్టాడు. నాన్న ఒకసారి డాక్టర్‌గారి ముఖంలోకి చూశారు. ఆయన ముఖం పాలిపోయింది.

అప్పుడు అమ్మ లోపల్నుంచి బయటకొచ్చింది. ఒకసారి నాన్నవంక చూసింది. తరువాత ప్యాకెట్లవంక చూసింది. అప్పుడు నిదానంగా ముందుకొచ్చి బంటీని వాటేసుని ముద్దుపెట్టుకుంది.

వాడు విడిపించుకుని తండ్రి దగ్గరకెళ్ళి ఆయన చెయ్యి పట్టుకుని నుంచున్నాడు. ఇంక తను పూర్తిగా నాన్నకి చెందిన బంటీనని స్పష్టంచేస్తున్నట్టుగా.

కారులో అందరూ కూర్చున్నారు. డాక్టర్, అమిత్, జ్యోతి. అమ్మ మాత్రం బయటే నుంచుంది. నాన్న డాక్టర్‌గారి ముఖంలోకి చూశారు.

"షి ఈజ్ వెరీ అప్‌సెట్" అంటూ డాక్టర్‌గారు కారు స్టార్ట్ చేశారు.

ఎంత వద్దనుకున్నా బంటీ దృష్టి అమ్మవైపు తిరిగింది. ఆమె ఏడుస్తూ చెయ్యి వూపుతోంది. ఏడుస్తున్న అమ్మ అలాగే వుండిపోయింది. బంగళా, వరండా అన్నీ ఆమెతోపాటే వెనక్కి వెళ్ళిపోయాయి.

రైల్లో కూర్చుని బంటీ కిటికీలోంచి బయటకి చూస్తున్నాడు. స్టేషన్లో గుంపులు గుంపులుగా మనుషులు. ప్లాట్‌ఫారం మీద డాక్టర్, అమిత్, జ్యోతి...

డాక్టర్‌గారు ఆపి... ఆపి... ముక్కలు ముక్కలుగా మాట్లాడుతున్నారు "మీరు వీడి విషయాలు... అప్పుడప్పుడు... తెలియబరుస్తూ వుండాలి. యూ... నో... షి... చాలా... ఇబ్బంది... బాధ... కాని..."

"బంటీ అన్నయ్యా నేను కలకత్తా వస్తాను" అమిత్.

"బంటీ, నాకు ఉత్తరం రాస్తావా?" జ్యోతి.

ఈ మాటలతోపాటు బోలెడు సందడి. రకరకాల చప్పుళ్లు. ఉన్నట్టుండి ఈ సందడిని మర్చిపోయేటంత గట్టి స్వరం... 'బంటీ, వెళ్ళొద్దు నాన్నా. నువ్వు లేకుండా నేనుండలేను'

అంటూ బంటీ చెవిన పడుతోంది. అమ్మ మతిలేకుండా పరుగెత్తుకు వస్తున్నట్టు అనిపిస్తోంది. ఎందుకో దగ్గరకి రాలేకపోతోంది. కాని ఆమె స్వరంమాత్రం అన్నివేపులునుంచీ వినిపిస్తోంది.

రైలు బయల్దేరింది. వచ్చిన జనాలంతా వెనక్కి మిగిలిపోయారు. చెయ్యూపుతూ నుంచున్న డాక్టర్, అమిత్, జ్యోతి మెల్లగా వెనక్కి జరిగిపోయారు. రానురాను ఒక బిందువుగా మాయమయ్యారు. ప్లాట్‌ఫారంమీద జనాల గుంపు ఊరు, పరిచయమైన ప్రాంతాలన్నీ వాడిని వదిలి వెనక్కి వుండిపోయాయి. మరి కాసేపటికి రైలు విశాలమైన పొలాలమధ్య, తోటలమధ్య పరుగిడనారంభించింది.

బంటీ మెడ పక్కకి తిప్పాడు. ఎదురుగా అన్నీ పరిచయం లేని మొహాలు. వాడికి అన్ని కొత్తమొహాల్ని చూసి భయం వేసింది. వాడు లేచి నాన్న పక్కన చేరి ఆయనకి ఒరిగి కూర్చున్నాడు. ఆయన ప్రేమగా వాడివీపు నిమిరి ''బంటీ'' అన్నారు.

వాడికి తెలీకుండానే వాడి చెవిలో కొన్ని మాటలు వినిపిస్తున్నాయి.

''అక్కడ మనిల్లు వుంది. నీకు చాలా నచ్చుతుంది నాన్నా''

కాని నాన్న అడుగుతున్నది మరొకటి.

''పక్కవేయనా బంటీ? పడుకుంటావా?''

ఇంతమంది కొత్తవాళ్ళమధ్య తనకి తనే కొత్తగా అనిపిస్తున్నాడు బంటీ. ఈ కొత్తవాళ్ళ గుంపులో తండ్రి ఎక్కడ తప్పిపోతాడో అన్నట్టుగా ఆయనన్నంటుకునే కూర్చున్నాడు.

హౌరా రైల్వేస్టేషన్‌లో దిగినప్పుడు పరిచయంలేని చిన్న కొలనులోంచి తీసికెళ్ళి పరిచయంలేని మహాసముద్రంలో పడేసినట్టుగా భయమేసింది. పొరపాటున నాన్న చెయ్యి వదిలేస్తే తన గతేమిటి? అనే బెంగ కూడా కలిగింది.

నాన్న టాక్సీ క్యూలో నుంచున్నారు. బంటీ వెర్రివాడిలా ఆయనవంక చూస్తున్నాడు.

వాడి మొహం చూసి అలసిపోయుంటాడని వూహించి నాన్న అన్నారు ''నువ్విక్కడే కూర్చుని వుండు''

వాడు పెట్టెమీద కూర్చున్నాడు. చుట్టుపక్కల ఎటుచూసినా జనం ఒక్కక్షణం ఆగి వాడు మళ్ళీమళ్ళీ ఆయన చెయ్యిపట్టుకుని నుంచున్నాడు.

వాడి చిన్న నీడ ఆయన పొడవాటి నీడలో కలిసిపోయింది.

★ ★ ★

అజయ్ బంటీని తీసికెళ్ళడానికి ఇష్టపడ్డాడు. బంటీ కూడా అతనితో వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. బంటీకి ఈ ఇంట్లో వుండడం ఇష్టంగాలేదు. ఎంత ప్రయత్నించినా బంటీ ఆ ఇంట్లో ఇమడగలిగేలా ఆమె చెయ్యలేకపోయింది. వాడు ఈ ఇంటిని తన ఇంటిగా స్వీకరించలేక పోయాడు. వాడు తల్లినుంచి ఏది కావాలని ఎదురు చూశాడో అది ఆమెకి తెలియదు.

అజయ్ ఆమెనుంచి ఏం కోరుకున్నాడో అది కూడా ఆమెకి తెలియదు. అది అతనికి దొరకలేదు. అతడామె జీవితం నుంచి దూరంగా వెళ్ళిపోయాడు. బంటీ ఏం కోరుకున్నాడో అది దొరక్క వాడూ దూరమయిపోయాడు. ఒకవేళ అజయ్ తాను అపేక్షించినది బంటీ రూపంలో కావాలని నిరీక్షించాడేమో...

ఇలా ఏవేవో ఆలోచిస్తూ ఆమె భ్రమల్లో కొట్టుకుపోతోంది. అజయ్ హాయిగా తన జీవితాన్ని తాను రూపొందించుకున్నాడు. అతను తన మనోఫలకం మీదనుంచి తనని పూర్తిగా తుడిచేశాడు. అలాగే తను కూడా అజయ్‌ని తన మనసునుంచి పీకిపారేసి కొత్త జీవితాన్ని ప్రారంభించాలని కోరుకున్న తరుణంలో బంటి...

అందరూ తననుంచి ఏవో ఒకటి ఆశిస్తారు. ఫలానాదాన్ని ఆమె పూరించాలి అని కోరుకుంటారు. తను మాత్రం ఏమీ కోరుకోకూడదు. కోరుకుంటే మాత్రం అదెందుకు తప్పవుతుంది? అనుచితమైనదాన్ని, అసంభవమైనదాన్ని దేన్నీ తను కోరుకోలేదే. తను నిశ్చింతగా ఊపిరి తీసుకోగలిగే సరళ జీవనాన్నే కోరుకుంది. తన ఇష్టాలు ఎంతో సహజమైనవి. అయినా అందరూ తనదే తప్పు అనే పరిస్థితి వచ్చిపడింది




శకుంతలకి అనిపిస్తుంది తన మనసులో ఉన్నదొకటే, కేవలం దుఃఖం. బంటీ వెళ్ళిపోయాడు. కాని ఆ ఇంట్లోనూ వాడు సంతోషంగా ఉండలేదు. హాస్టల్లో వున్నా, ఇంట్లో ఉన్నా వాడెక్కడున్నా సుఖంగా ఉండలేదు. ఈమధ్య తనతో వున్నప్పుడు కూడా వాడు సంతోషంగా లేడు.

అమ్మని దుఃఖపెట్టడంవల్ల తనకెంత దుఃఖం కలుగుతుంది అన్నది బంటీకి అర్థంకాలేదు. కాని అది శకుంతలకి అర్థమైంది. అయినా ఆమె ఊరుకుంది. బంటీ తన జీవనమార్గంలో అడ్డుగోడగా నుంచున్నాడన్నది ఆమె అనుభవానికొచ్చింది.

తను దేనికీ పశ్చాత్తాప పడక్కర్లేదు. బంటీ తన జీవితంలో విడదీయలేని అంగం, తనలో ఒక భాగం. వాడు వెళ్ళిపోయిన దుఃఖాన్ని తను భరించాలి. ఒకవేళ అలా వాడు వెళ్ళడంవల్ల ఏదన్నా తప్పు జరిగుంటే ఆ భారాన్ని తను భరించాలి. ఈ దుఃఖాన్ని తప్పునీ ఆమె ఇంకెవరితోనూ పంచుకోడానికి అవకాశం లేదు. పంచుకోనూ లేదు.

అలా ఆమె సంఘర్షణలో కొట్టుకుపోతుంటే-

కారు తిరిగి వచ్చింది. డాక్టర్, అమిత్, జ్యోతి కార్లోంచి దిగారు. ఆమె గుండెల్ని గుద్దినట్టు మరోసారి ఉలిక్కిపడింది. అయితే నిజంగానే బంటీ వెళ్ళిపోయాడా? ఆమె మనసులో ఎన్నెన్ని ఆలోచించినా, మిగిలిన దృశ్యం వేరు. స్టేషన్‌లో కొత్తకొత్త జనాల్ని గుంపులుగా చూసి బెదరిన బంటీ, "నేను వెళ్ళను, నేను వెళ్ళను అమ్మనొదిలి నేను వెళ్ళను" అని జ్యోతిని పట్టుకున్నాడేమోనన్న దృశ్యమే ఆమె కళ్ళ ముందు మెదుల్తోంది.

"ఇందాకా టీ సరిగ్గా తాగనేలేదు. త్వరగా ఒక కప్పు టీ తెచ్చిపెట్టు. నేను త్వరగా వెళ్ళాలి"

"అమ్మా... నేను బంటీకి చెప్పాను. తను నాకు తప్పకుండా ఉత్తరం రాస్తాడు"

"వెళ్ళగానే ఉత్తరం రాయండని నేనూ మిష్టర్ బత్రాకి చెప్పాను"

అంతే! ఇంకెవరూ ఏమీ మాట్లాడలేదు.

రెండు కప్పుల్లో చాయ్, రెండు కప్పుల్లో పాలు. బంటీ కుర్చీ ఖాళీగా వుంది.

చలికాలం అయిపోవచ్చింది. మరో పది పన్నెండు రోజుల్లో ఎండలు, చెమట స్నానాలు మొదలైపోతాయి.

"స్టేషన్‌లో ఇవాళ చాలా ఉక్కపోసేసింది"

"రైల్లో అంత గొడవ గొడవగా ఎందుకుంటుంది డాడీ? రోజూ అంతమంది జనం ఎక్కడికి వెళ్తారు?"

డాక్టర్‌గారు వెళ్ళిపోయారు. అమిత్, జ్యోతి చదువుకుందుకు కూర్చున్నారు. అన్నీ మామూలుగా జరిగిపోతున్నాయి. ఎక్కడా తేడా రావటంలేదు. ఏదో అనవసర భారం దూరమయిపోయిందన్నట్లుంది. అందరూ ఈరోజు కోసమే ఎదురుచూస్తున్నట్టుగా అంతా ప్రశాంతంగా మారిపోయింది.

★ ★ ★

వారంక్రితం అజయ్ ఉత్తరం వచ్చినరోజున శకుంతల, డాక్టర్ ఎదురెదురుగా కూర్చున్నారు. ఇద్దరిమధ్య నీరవత.

అజయ్ చాలా సంతోషంతో ఆ ఉత్తరం రాశాడు. కాని ఒకవిధంగా స్పష్టంగా ఒత్తి చెప్తూనూ రాశాడు. 'బంటీని తన దగ్గర వుంచుకోవాలన్నది తన కోరిక. కాని వాళ్ళిద్దరి అభిప్రాయానికి వ్యతిరేకంగా ఏమీ చేసే వుద్దేశం తనకి లేదు' అని.

డాక్టర్‌గారు ఉత్తరం చదివి మౌనంగా వున్నారు. శకుంతల మనసులో వేలకొద్దీ మాటలు ఒక్కసారిగా పరుగిడసాగాయి. బంటీని తండ్రితో పంపేసి ఈ ఇక్కట్టునుంచి తప్పించుకుందామని ఒకసారి అనిపిస్తే, తను బంటీనెందుకు పంపించాలి? బంటీమీద అజయ్‌కి ఏం అధికారం ఉంది? తను మరో పెళ్ళి చేసుకోడమే కారణం అని అన్నట్టయితే అతనూ మరో పెళ్ళి చేసుకున్నాడుగా. అని మనసు వాదిస్తోంది.

"మీరేం చెప్పరేమిటి?" శకుంతల డాక్టర్‌గార్ని సీరియస్‌గా చూస్తూ అడిగింది.

ఆయనకేం చెప్పాలో తోచక మౌనంగా వుండిపోయారు.

"చెప్పండి, అజయ్‌కేం జవాబివ్వాలి?"

శకుంతల జవాబు చెప్పమని ఒత్తిడి చేస్తున్నట్టుగా అడిగింది.

"నాకు మిష్టర్ బత్రాగారితో పరిచయం లేదు. ఆయన ఎందుకిలా ఉత్తరం రాశారో నాకు తెలియదు. ఇలాంటి పరిస్థితిలో నేనేం చెప్పగలను"

అదే నిర్లక్ష్యం! అదే అనాసక్తి! మాట్లాడుతూ మౌనం వహించడం అంటే ఇదేనేమో.

"ఒకవేళ మీ పిన్నమ్మ 'అమిత్‌ని చిన్నప్పట్నించీ నేనే పెంచాను. వాడిని నా దగ్గరకి పంపేసెయ్యి' అని ఉత్తరం రాస్తే మీరు పంపించేస్తారా? ఏమీ జవాబు చెప్పరా?"

"ఆ విషయం వేరు శక్కూ"

డాక్టర్‌గారి స్వరం ఎలాంటి పరిస్థితిలోనయినా విచలితం కాదేమో. ఆయనకి తనమీద తనకెంత నమ్మకమో!

డాక్టర్‌గారిలా కామ్‌గా కూర్చోడం ఆమెకి ఒళ్ళు మండించింది.

"విషయం వేరే కాదు. బంటీ వేరే అనండి. అమిత్ అంటే మీ కొడుకు. వాడి విషయం అయితే మీరు నిర్ణయం తీసుకోగలరు... బంటీ మీకు"

"శక్కూ" డాక్టర్‌గారు తమ రెండు చేతుల్నీ ఆమె భుజాలపై ఉంచారు.

మాట మధ్యలోనే ఆగిపోయింది. శకుంతల తదేకంగా డాక్టర్‌గారి ముఖం వంక చూసింది. ఆయన స్వరంలో ఏ శక్తి వుందో ఆమె ఆవేశం మెల్లగా దిగిపోయింది.

"పిచ్చీ, ఈ ఉత్తరం చూసి నీ మనసు పాడయింది. కాని ఇలా బ్యాలెన్స్ కోల్పోతే సమస్యలెలా పరిష్కారం అవుతాయి? మీరిద్దరూ మీ అహాన్ని పక్కనపెట్టి బంటీ గురించి ఆలోచించండి. అదీ వాడి దృష్టితో ఆలోచించండి" సూటయిన, సరిఅయిన పాయింట్ చెప్పారాయన.

ఆమెలోని అనుమానపు పర్వతం నిదానంగా కరగసాగింది.

"నీవల్లేమీ కాదుగాని, నేనే ఒకసారి బంటీని నాతో కార్లో బయటకి తీసికెళ్ళి మెల్లగా, ప్రేమగా ముద్దుగా అడుగుతాను. ఇక్కడ వాడికెందుకు నచ్చట్లేదో ఏది ఇబ్బందిగా వుందో అడుగుతాను... కాని ఏం చేయను శక్కూ, ఎప్పుడూ ఒకటే ప్రాబ్లెం. నాకు తీరిక దొరక 'టమే కష్టంగా వుంది కదా"

"మేం వెళ్ళేటప్పుడు నిన్ను కూడా తీసికెళ్ళ 'ను తెల్సిందా?" అని ఆమె భుజాల్నొకసారి కుదిపి లేచారు.

నమ్మకం నిండిన ఆయన మనసుముందు అపనమ్మకంతో విల్లవిల్లాడే ఆమె మనసు ఓడిపోయింది. ఆమెకి తనే అపరాధిని అనిపించింది. ఏ విషయమైనా ఆమెకి విపరీత ధోరణిలో ఎందుకు కనిపిస్తుంది? సరిఅయిన అర్థంలో వస్తుస్థితిని చూడ్డానికి ఆమెకి ఎందుకు సాధ్యపడదు?

అజయ్ ఇంటికి రాడని ఆమెకి తెలుసు. అయినా అతన్ని ఇంటికి తీసుకురావాలనే ఉద్దేశంలో డాక్టర్‌గారు స్వయంగా కారు తీసుకుని స్టేషన్‌కి వెళ్తే ఆమెకి సంతోషం కలిగింది. కాని అజయ్ నాలుగ్గంటలకి ఇంటికొస్తానని చెప్పినప్పుడు డాక్టర్ మీటింగ్ ఉందని వెళ్ళిపోయారు. బంటీ విషయం తనూ, అజయ్ మాత్రమే నిర్ణయించుకోవాలన్నది ఆయన ఉద్దేశం అయ్యుంటుంది. తను పరాయి వ్యక్తి న్నట్టుగా ఆయనెందుకు ప్రవర్తించాలి? అని ఆమెకి కొద్దిగా అనిపించినా, ఆ చర్చ జరిగినప్పుడు ఆయన లేకపోవడమే సుఖంగా వుందామెకి.

అజయ్ నాలుగ్గంటలకి ఇంటికొస్తాడు. అతని రాక ఆమెకి ఒక విధంగా సంతోషంగా అనిపించినా మరోవిధంగా చికాగ్గా కూడా వుంది. తన వైభవాన్ని సంతోషాన్ని అజయ్ ముందు ప్రదర్శించచ్చు అనే ఆనందం, కాని బంటీ ఉత్తరం రాసి తన తండ్రిని రప్పించుకుని తన సంతోషాన్ని మంటగలిపాడు కదా అని బాధ.

ఇవన్నీకాక ఆమె మనసు మూలల్లో ఎక్కడో ఆశ. బంటీ ఆవేశంలో వాళ్ళ నాన్నకి ఉత్తరం రాసినా వాడు ఆయనతో వెళ్ళలేదు. ఎంత ఏడ్చినా, ఎంత మొండితనం చేసినా, శకుంతలతో మాట్లాడకుండా దూరదూరంగా తిరిగినా తననలా విడిచి వాడు వెళ్ళలేదు. తనని వదిలిపెట్టి అక్కడ ఒక్క రోజయినా వుండలే




డు. ఒక్కరోజు రాత్రికి నర్స్యాట్‌హాస్టల్‌లోవాళ్ళ నాన్నతో వుండలేకపోయాడంటే?

ఎంతయినా పిల్లల మొండితనం, రోషం ఎంతసేపని వుంటాయి? అయినా బంటీ తనకి ఎంతో మాలిమిఅయి పెరిగినవాడు.

"ఒక్కడినే నేనెప్పటికీ వెళ్ళను" అని వాడు ఆరోజు అన్న మాటనే బలంగా పట్టుకుని కూర్చుంది శకుంతల. వాడామాట అని ఎనిమిది, పది నెలలు దొర్లిపోయాయి. అదీకాక ఈమధ్యకాలంలో ఎన్నెన్ని ఎలాంటి మార్పులొచ్చాయన్నది ఆమె ఆలోచించడం లేదు.

ఆరోజంతా శకుంతల ఇల్లు తీర్చిదిద్దడంలోనే గడిపింది. ప్రతి వస్తువూ మెరిసిపోతోంది. ఈసారి ఉద్వేగం లేకుండా అజయ్‌తో మాట్లాడాలని మనసులోనే రిహార్సల్స్ వేసుకుంటోంది. ఇక్కడి విధానాలు చూశాక, బంటీని తనతో తీసికెళ్ళడం అర్థంలేనిపని అని అజయ్‌కి అనిపించాలి.

కాని టీ టేబుల్ దగ్గర కూర్చున్నప్పుడు అల్లుకున్న నీరవత ఆమెను చాలా వేధించింది. టేబుల్‌మీద ఎన్నో రకాల చిరుతిళ్ళున్నాయి. అన్నీ తనే ఏర్పాటు చేసింది. కాని అజయ్ దృష్టి దానివేపు పడనేలేదు. జ్యోతిని, అమిత్‌ని ఒకసారి పలుకరించాడేమో అంతే. అతని దృష్టి పూర్తిగా బంటీమీదే వుంది.

ఆమె మనసులో ఆందోళన మొదలయింది.

ఎన్నాళ్ళ తరువాతనో శకుంతల, అజయ్ ఒకే గదిలో కూర్చున్నారు. గది వెచ్చగా హాయిగా వుంది. కాని మనసే అంత హాయిగా లేదు. ఏదో గాభరా, పరీక్ష ముందు విద్యార్థి మనసున్నట్టుగా.

"బంటీ సంగతి ఏమి ఆలోచించావు?"

సూటిగా అడిగాడు అజయ్. గొంతులో పంతమేమీలేదు.

"బంటీని ఇకమీదట నాదగ్గరే వుంచుకోడం నాకిష్టం. కాని ఇది నేనొక్కడినే నిర్ణయం చేసే విషయం కాదు. అంటే..."

"కాని బంటీ ఉన్నపళంగా బయల్దేరడానికెలా వీలవుతుంది? వచ్చేనెలలో వాడికి పరీక్షలు. ఒక సంవత్సరం అన్యాయంగా పాడవుతుంది"

"ఇదే కారణమా?" అన్నట్టు చూశాడు అజయ్.

"కలకత్తాలో సెషన్ మొదలయ్యేది జనవరి నుంచి. ఏప్రిల్‌వరకు స్కూళ్ళల్లో చేర్చుకుంటూనే వుంటారు. అక్కడ నాకు పరిచయస్థులున్నారు"

"కొత్తవాళ్ళని చూస్తే బంటీ బెదురుతాడు. ఈ వయసులో వాడు చాలా ఇంట్రావర్ట్‌గా వున్నాడు. నాకేమనిపిస్తుందంటే..."

"అవునవును నాకూ అనిపించింది. పొద్దున్నసలు మాటలే ఆడలేదు. ఇప్పుడూ భయపడ్డవాడిలా నిశ్శబ్దంగా ఉండిపోయాడు" అనేసి అజయ్ ఊరుకున్నాడు.

ఆమె మనసులో ఎన్నో ఆలోచనలు రేగుతున్నాయి. బంటీ విడాకులు తీసుకున్న తల్లిదండ్రులకి బిడ్డ కావడంవల్లనేమో వాడింత అబ్‌నార్మల్‌గా వున్నాడు. కలకత్తా వెళ్తే మాత్రం వాడికి ఆత్మీయులెవరు దొరుకుతారని? చెప్పుకుందుకు నువ్వు వాడి తండ్రివి. కాని వాడి సంగతి నీకేం తెలుసునని? ఆఖరికి వాడి బూట్ల నంబరైనా నీకు తెలుసా?...

"నాతో రావడానికి వాడు ఒప్పుకుంటే, నీ అభ్యంతరం ఏమీ లేకపోతే నేను వాడినిప్పుడే తీసికెళ్ళడానికి నిర్ణయించుకుని వచ్చాను. ఎందుకంటే మాటిమాటికి, అనుకున్నప్పుడల్లా రావడం నాకు చాలా కష్టం..."

నాకేమిటి అభ్యంతరం. వాడిని నీ దగ్గరకి పంపించెయ్యాలన్నదే నా ఉద్దేశమూను. వాడితో పడిపడి విసిగిపోయాను. ఇంకైనా నా జీవితాన్ని ప్రశాంతంగా గడుపుతాను. వీడు నాకు, డాక్టర్‌కి మధ్య ఇనుపగోడలా తయారయ్యాడు. నీకు, మీరాకి మధ్యకూడా కొన్నాళ్ళు గోడ కట్టనీ. రోజుకొక సమస్య. రోజుకొక గోల...

అని ఆమె అనలేదు. చాలా కంట్రోల్ చేసుకుని మెత్తటి స్వరంతో...

"బంటీనే అడగండి. మన ఇష్టాలని వాడి తలమీద ఎందుకు రుద్దడం?"

బంటీని అడగ్గానే మొండిగా అన్నాడు.

"నేను వెళ్తాను. తప్పకుండా వెళ్తాను"

అప్పుడు శకుంతల కళ్ళకి గదిలోసామా నంతా మసకమసగ్గా కనిపించింది. చుట్టూవు న్న వైభవమంతా ఒకచిన్న బిందువుగా మారి పోయింది. బంటీని మెడపట్టి బయటకి గెంటేసి ''ఇప్పుడే వెళ్లిపో'' అని అరవాలని పించింది. కానీ ఆమె ఏమీ మాట్లాడలేకపో యింది. ఈ ఇంటికి వచ్చినప్పట్నుంచీ ఆమె బంటీ మీద అధికారాన్ని కోల్పోయింది.

అజయ్ బంటీని ఊళ్ళో తిప్పుకు రావడాని కి తీసికెళ్లినప్పుడు శకుంతలకి ఆరోజు డాక్టర్ గారు బంటీని షికారు తీసికెళ్తానన్న సంగతి గుర్తొచ్చింది. కార్లో దూరంగా ఎంతోదూరంగా తీసికెళ్లి ప్రేమగా మాట్లాడి వాడి మనసుని గెలుస్తానని ఆయనన్నారు. ఆరోజు అది సాధ్యం కాలేదు. అందుకే ఈరోజు ఇది సాధ్య మయింది.

నిజానికి పనికిమాలిన మాటలు. తను మళ్లీ పెళ్లి చేసుకుందికదా. అది అతని అహాన్ని దెబ్బకొట్టింది. బంటీనుంచి తనని విడదీసి, తననుంచి బంటీని దూరంచేసి ఆ అహాన్ని తృప్తిపరచుకోవాలనుకుంటున్నాడు. ఆమె మనసుని హింసించడమే అతని ఉద్దేశం.

అజయ్ వివాహవార్త తెలియగానే ఇంకెప్పు డూ అతనితో బంటీని పంపకూడదని నిశ్చ యించుకుంది శకుంతల. ఇకమీద బంటీని అతను చూసే అవకాశమే ఇవ్వకూడదని అను కుంది. బంటీని అడ్డుగాపెట్టుకుని అజయ్ మనసుకి దెబ్బకొట్టాలనుకుంది.

ఒక్కసారిగా రెప్పలల్లాడిస్తూ తదేకంగా చూ సే బంటీ ముఖం కళ్లముందుకొచ్చింది. ''న న్ను పంపించకు మమ్మీ... నన్ను పంపించ ద్దు...'' అంటూ ఆ కళ్లు వేడుకుంటున్నట్టు అనిపించింది. బంటీ రకరకాల భంగిమలు ఆమెముందు కదలివచ్చాయి. వాడి ముఖం మందకొడిగా తయారయినట్టనిపించింది. మాలి మాటలు చెవుల్లో గింగురుమంటు న్నాయి.

''అవి ఆ భూమ్మీద పుట్టిపెరిగిన మొక్కల మ్మా. మరోచోటకి తీసికెళ్లి పాతితే ఎండిపో తాయి. వేళ్లు నేలలో దిగి స్థిరపడేదాకా అంతే''

ఈ మాటల్లో ఆమెకివాళ వేలవేల అర్థాలు గోచరిస్తున్నాయి.

శకూ వెక్కివెక్కి ఏడవడం ప్రా రంభించింది. ఈ ఆవేశం ఒక్కనాటిది కాదు.

''ఏడవకు మమ్మీ ఏడవకు'' రెండు బుల్లి బుల్లి చేతులు ఆమెను చుట్టుకున్నాయి.

''శక్కూ!'' డాక్టర్‌గారి స్వరం అక్కడి నిశ్శ బ్దాన్ని చీలుస్తూ ప్రతిధ్వనించింది. నువ్విక్కడు న్నావా? కింద ఎవరికీ తెలియనే తెలియదు. అరె! నువ్వు... ఏడుస్తున్నావా శకూ...'' రెండు బలమైన బాహువులు ఆమెని చుట్టివేశాయి. మెల్లగా శకుంతల ఆ బాహువుల్లో కరిగిపో యింది.

కానీ ఎవరికీ తెలీకుండా రెండు బుల్లి బుల్లి అదృశ్యబాహువులు ఆ బలమైన బాహువుల క్రింద అణగిపోయాయి.



''ఇదే మనిల్లు'' మెట్లు ఎక్కుతూ ఒక ఇంటిముందు నుంచుని అన్నారు నాన్నగారు. బంటీ తలుపుకి వేళ్ళాడుతున్న నేమ్‌ప్లేట్ చూస్తున్నాడు.

తలుపు తెరుచుకుంది.

''ఓ! వచ్చేశారా? మీరింకా రెండురోజుల య్యాకగాని రారేమో అనుకున్నాను'' అన్నదొక స్త్రీ స్వరం.

వాలిపోతున్న చూపుల్తోనే ఆమె పాదాలని చూశాడు బంటీ. ఈమె తన మమ్మీకాదు. అమ్మ పాదాలు తనకెంతో పరిచయం. ఆ పాదాల్ని సులువుగా గుర్తుపట్టగలడు తను. ఆ పాదా లు... వాటికి ధరించే చెప్పులు. ఆ పాదాలమీద కదలాడే చీర అంచు. అన్నీ తనకి తెలుసు.




''ఓహో! బంటీ దొరగారొచ్చేశారే! రా! రా! ఎంత ముద్దుగా వున్నావోయ్ బాబూ!'' అని వాడి వీపు నిమిరి భుజాలమీద చెయ్యివేసింది.

ఒక్కసారి బంటీకి అమ్మ జ్ఞాపకం వచ్చింది. వాడు వాళ్ళ నాన్న వేలిని మరింత గట్టిగా పట్టుకున్నాడు.

''నాదగ్గరకి రా బాబూ. ఎందుకంత సిగ్గు?''

ఎదురుగా వున్న ఆమె ముఖం కొంచెం దీపా ఆంటీ ముఖంలాగే అనిపించింది. తలెత్తి చూసి బంటీ మళ్ళీ తల దింపేశాడు.

నాన్న చెప్పిన 'మీరా' ఈవిడేకాబోలు. ఇక మీద తను ఈవిడతో వుండాలికాబోలు.

''బహాదూర్, శీనూని తీసుకురా''

ఒక కుర్రాడు ఒక చిన్నబాబునెత్తుకుని అక్కడికొచ్చాడు.

'శీనుబుజ్జీ' అంటూ చేతులు చాపి నాన్న ఆ బాబుని ఎత్తుకున్నారు.

''బంటీ, వీడు నీ తమ్ముడు శీను. వీడితో నువ్వు చక్కగా ఆడుకోవచ్చు. ఎంత బాగా నవ్వుతాడో చూడు! ఆడుకుంటావా మరి?''

బంటి తలెత్తి బాబుని చూశాడు. ఎర్రగా ముద్దుముద్దుగా వున్నాడు. ఆ బాబు ముఖంలో వాడికి అమిత్ కనపడ్డాడు. వెంటనే జ్యోతి గుర్తొచ్చింది. ఇప్పుడు జ్యోతి ఏం చేస్తోందో!

''రా, ఇల్లెలా వుందో చూపిస్తాను''

''ఇదిగో... ఇది డ్రాయింగ్‌రూం''

''ఇది... పడగ్గది...''

బెడ్‌రూమ్ చూడగానే ఆ ఇంటి నీలంరంగుది గుర్తొచ్చింది.

''దీని పక్కనే ఈ చిన్నగది వుందికదా. ఇది ఇవాల్టినుంచి నీకు. చిన్నబంటీకి చిన్నిగది! ఇది బాల్కనీ. ఇక్కడ నుంచుంటే కలకత్తా అంతా కనిపిస్తుంది''

ఇంతేనా? ఇంత చిన్న ఇంట్లో అంతా వుంటారా? ఆడుకుందుకు ఇంటిముందు వసారా అయినా లేదు. కాంపౌండు అనలే లేదు. ఇన్నాళ్ళూ కలకత్తా అంటే వాడు చిత్రించుకున్న చిత్రం క్షణంలో కూలిపోయింది.

అందరూ డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చున్నారు. బంటీ యథాప్రకారం తల వంచుకుని మౌనంగా కూర్చున్నాడు.

''ఇవాళ మీ నాన్న ఆఫీస్‌కి వెళ్ళాలికదా. అందుకుని హడావుడిగా వంట చేసేశాను. ఇప్పుడు నువ్వు నీకేమేం ఇష్టమో, నువ్వేం తింటావో చెప్తే రేపట్నుంచి అవే చేస్తాను'' అంది మీరా.

''చెప్పు నాన్నా. సిగ్గుపడకూడదు. ఇది మనిల్లేకదా. ఎవరింట్లో వాళ్ళు సిగ్గుపడతారా?''

ఆ నాలుగ్గదుల ఇల్లు చూస్తుంటే తమ పాత ఇల్లు తన తోట గుర్తొచ్చింది. వెనకాల పెరట్లో తులసికోట దగ్గర వెలిగే దీపం, అత్తయ్య ఆంజనేయస్తోత్రం... అన్నీ గుర్తొచ్చాయి.

''అది మనిల్లు నాన్నా. అక్కడ మనవాళ్ళంతా వున్నారు'' డాక్టర్‌గారింటిని గురించి అమ్మ అన్న మాటలు గుర్తొచ్చాయి.

''ఈ వేపచెట్టు నాన్న పుట్టినప్పుడు వేశారట బంటీ'' ఈ జ్ఞాపకాలు నింపిన ఆ ఇళ్ళు రెండూ ఒకటితో ఒకటి కలిసిపోయి క్రమంగా మాయమైపోయాయి.

★ ★ ★

''బంటీ, ఏమన్నా తింటావా నాన్నా?'' అని భుజం కుదుపుతున్నారు నాన్న. బంటీ ఉలిక్కిపడ్డాడు.

నాన్నగారెంతసేపట్నుంచి భుజం కుదుపుతున్నారో?!

''ఆకలేస్తోందా?'

''లేదు''

నాన్నగారు వాడి పక్కనే కూర్చుని దగ్గరకి తీసుకున్నారు.

''బంటీ, ఎందుకిలా డల్‌గా వుంటావు? నువ్విలాగే వుంటే నాకు బెంగగా వుంటుంది''

బంటీ నాన్నగారివైపు చూశాడు. ఆయన కళ్ళల్లో నీళ్ళు!

''బంటీ నువ్వు చక్కగా చదువుకోవాలి. బంగారు తండ్రిలా బాగా చదువుకోవాలి సుమా! అక్కడ నీకేమేం నేర్పుతారో తెలుసా?''

''... ...''

ఆయన ఏదేదో మాట్లాడుతున్నారు. వాడు

వింటున్నాడుకాని వాడికొక్క ముక్క కూడా అర్థంకావటంలేదు. వాడికీమధ్యన ఏమవు తోందో బొత్తిగా అర్థంకావటంలేదు.

స్కూల్లో చేరాలంటే ప్రవేశ పరీక్ష రాయాలిట. నాన్న చెప్పారు.

"నువ్వేం కంగారుపడద్దు బంటీ. అడిగిన దానికి నిదానంగా జవాబు రాయి. నిన్నేం అడిగినా ధైర్యంగా జవాబు చెప్పు. మొహమాటంగాని భయంగాని వద్దు సుమా"

అలా చెప్తున్న నాన్న ముఖంలో మాటిమాటికీ అమ్మ ముఖం కనపడసాగింది. నాన్న గొంతు కూడా అమ్మగొంతులాగే అనిపిస్తోంది. "చూడు నాన్నా బాగా ఆలోచించి అడిగినవాటన్నిటికి జవాబులు రాయి"

ఈ ఇంట్లో నాన్న అమ్మయిపోతే ఎలా? ఊహుఁ, నాన్న మమ్మీ కాలేదు, కారు. కాని నాన్న మునుపటి నాన్నలా లేరే. దూరంగా వుంటే నాన్న తనకెంతో దగ్గరయినట్టనిపించే వారు. ఇప్పుడు తీరా దగ్గరకొచ్చాక నాన్న అపరిచితంగా అనిపిస్తున్నారు.

జనంతో నిండిన ట్రామ్ వచ్చింది. నాన్నగారు తనని సీట్లో కూర్చోబెట్టి తను నుంచున్నారు. బంటీ కళ్ళు ఆయననే అతుక్కుపోయాయి. ఆయన్నుంచి దృష్టి తప్పిస్తే తను తప్పిపోతానేమోనని భయం వాడికి.

"అటు చూడు అదే మీ స్కూలు"

నాన్న అటువైపు చూపిస్తున్నారుగానీ, బంటీ కళ్ళముందు తన పాత స్కూలు మెదిలింది. ఇవాళ ఏం వారం? బుధవారం కాబోలు! ఈపాటికి జాగ్రఫీ పాఠం జరుగుతూ వుంటుంది. మాష్టారు ఈరోజు ఏం పాఠం చెప్తున్నారో... మహారాష్ట్ర, బెంగాల్ అంటూ చెప్తుండొచ్చు. తనిప్పుడు బెంగాల్లోనే వున్నాడు.

"భయపడద్దు నాన్నా ఇంగ్లీష్‌లో మాట్లాడగలవుకదా! బాగా ఆలోచించి జవాబులు రాయి"

★ ★ ★

మాష్టారడుగుతున్నారు - "వాటీస్ యువర్ నేమ్ డియర్?"

"అరూప్ బత్రా" తన గొంతు వణుకుతోందేమో అనిపించింది బంటీకి.

"హ్యావ్ యు కమ్ విత్ యువర్ ఫాదర్?"

అవుననన్నట్టుగా తల ఊపాడు వాడు.

"వాటీస్ యువర్ ఫాదర్?"

ఏం చెప్పాలో తెలియక తల వంచుకున్నాడు.

"టెల్‌మి అరూప్"

కాని ఏం చెప్పడం? తనకా వివరాలు తెలిస్తేకదా!

"మై మమ్మీ ఈస్ ప్రిన్సిపాల్"

వాడికి తెలీకుండానే వాడి నోటివెంట ఈ మాట వచ్చింది. మాటతోపాటు ఏడుపు కూడా వచ్చినట్టయింది.

మాష్టారు నవ్వుతున్నారు.

పేపర్ పెన్సిల్ ఇచ్చి ఆయన బంటీని కూర్చోబెట్టారు. "రైట్ ఎ స్టోరీ ఇన్ యువర్ ఓన్ వర్డ్స్"

బంటీ కళ్ళముందు బోలెడన్ని కథలు కదులుతున్నాయి. మమ్మీ చెప్పిన కథలు, అత్తయ్య చెప్పిన కథలు. కాని అవన్నీ రాయడం ఎలా? వాడేదీ రాయలేకపోయాడు. ఎదురుగా వున్న పేపర్‌మీద కన్నీళ్ళు టపటపమని కురిశాయి. మాష్టారు ఏమనుకున్నారో! మరి నాన్న ఏమనుకున్నారో!

సాయంకాలం వకీలు బాబాయి రావడం చూసినప్పుడు మునుపటిలా పరుగున వెళ్ళి ఆయన చేతులు పట్టుకుని వేళ్ళాడాలనిపించింది బంటీకి. కానీ ఉన్నచోటినుంచి ఒక్క అంగుళం కూడా కదల్లేకపోయాడు. ఒక్కసారి మాత్రం బాబాయివంక చూసి మళ్ళీ చూపు వాల్చేశాడు.

"అరె! ఇదేమిటి? బంటీ అలా ఊరికే నుంచున్నావేంటి? నేను నీకోసమే వచ్చానయ్యా?"

బాబాయి దగ్గరకొచ్చి తన ముఖంకేసే తదేకంగా చూస్తుంటే బంటీకి బాబాయితోపాటు ఆయనవెంట తన పాతిల్లు, తోట, అమ్మ అన్నీ వచ్చినట్టనిపించింది.

"వకీల్ బాబాయిగారూ! ఇదేమిటి మీరిలా వచ్చారు?" అంటూ మీరా లోపల్నుంచి




వచ్చింది.

"బంటీకి ఎంట్రెన్స్ టెస్ట్ అయిందా? అడ్మిషన్ అయిందా?" బాబాయి అడుగుతున్నారు. వాడికి అక్కడ్నుంచి పారిపోవాలని వుంది.

ఆమె అంటోంది, "అయ్యో, ఎడ్మిషనెలా అవుతుంది? వీడేమీ రాయనేలేదు. చాలా నెర్వస్ అయిపోయినట్టున్నాడు"

ఎక్కడ్నుంచో మరో ధ్వని లేచి వచ్చి బంటీ చెవుల్లో గింగురుమంది.

"అత్తయ్యా ఈరోజు హల్వా చెయ్యి. బంటీ మూడు సెక్షన్లకీ కలిపి సెకండ్ వచ్చాడు"

"అక్కడ స్టాండర్డ్‌కి ఇక్కడి స్టాండర్డ్‌కి చాలా తేడా వున్నట్టుంది. వీడెప్పుడూ క్లాస్‌లో ఫస్ట్ వస్తాడని చెప్పేవారీయన... ఒకవేళ ఇంగ్లీష్‌వల్ల ఏమన్నా..."

మీరా మాట్లాడుతూవుంది. బాబాయి మౌనంగా వింటున్నారు.

ఆయన మౌనంగా వుండడం, మరెవరన్నా మాట్లాడుతూ వుండటం చాలా ఆశ్చర్యంగా వుంది వాడికి.

"ఈ స్కూల్లో తెలిసినవాళ్ళెవరైనా వుంటే మీరే వాళ్ళతో మాట్లాడి చూడాలి బాబాయిగారూ. నా మాట ఈయన వినరు. పైగా ఈ విషయంలో నేను మాట్లాడడం కూడా..."

బంటీ దృష్టి తనమీదే వుండటం బాబాయి గమనించారు.

"వీడిని ఇప్పుడే తీసుకురావద్దని నేనెంతో చెప్పాను. అక్కడ పరీక్షలయిపోయాక శలవుల్లో తీసుకురావాల్సింది. నాలుగు రోజులు వాడిక్కడ అలవాటు పడితే అప్పుడు ఈ స్కూలు గురించి ఆలోచించేవాడు. పాపం, పిల్లాడికి ఎంత ఇబ్బంది!" అంది మీరా

బాబాయి ఎందుకనో ఏమీ మాట్లాడటంలేదు!

"వాళ్ళయినా అసలెలా పంపించారో! నేను మాత్రం నా బుజ్జికొండని..." అంటూ శీనూని గుండెలకి హత్తుకుంది మీరా!

బంటీ చటుక్కున లేచి బాల్కనీలోకి వెళ్ళిపోయి నుంచున్నాడు. వాడినెవరూ ఆపలేదు.





ఎవరూ పిలవలేదు...

వాడికి అనిపించింది-

ఇవాళ నాన్నకి చెప్పెయ్యాలి. తనని మళ్ళీ మమ్మీ దగ్గరకే తీసికెళ్ళి విడిచిపెట్టి రమ్మంటే సరి. తను తమ ఊళ్ళోనే, ఆ పాత స్కూల్లోనే చదువుకుంటాడు.



"కొంచెంసేపు కిందకి దిగు నాన్నా" అని చెప్పారు నాన్నగారు.

బంటీ తలూపాడు. నాన్న దిగిపోతే తను రైల్లో ఒంటరివాడినయిపోతానని వాడి భయం. అంతలో వాళ్ళ నాన్న రెండు దొన్నెల్లో సమోసాలు తెచ్చారు.

"తీసుకో... తిను" అని అందించారు.

"కారంగా ఉందా?"

తింటూనే లేదని తలూపాడు బంటీ. ఆ తరువాత మంచినీళ్ళు తెచ్చి అందిస్తే తాగాడు.

మళ్ళీ రైలు బయల్దేరింది. నాన్న వాడి భుజంమీద చెయ్యి వేసి అన్నారు, "ఈసారి భయపడాల్సిందేమీ లేదు. అక్కడ టెస్ట్ అదీ ఏమీ ఉండదు. నేను ఉత్తరం రాసి అన్నీ ముందే కనుక్కున్నాను. ఈసారి తిన్నగా క్లాస్‌కి వెళ్ళడమే"

ఈ మాట ఆయన ఇప్పటికి ఎన్నిసార్లు చెప్పారో! ఆరోజు ఆయన వాడిని తనదగ్గరే పడుకోబెట్టుకుని ఓదారుస్తూ చెప్పారు,

"ఇక్కడ సీటు దొరకలేదని బెంగపడకు. నేను హాస్టల్‌కి లెటర్ రాశాను" అని వివరించారు.

హాస్టల్లో తను ఉండనని చెప్పెయ్యాలని బంటీ చాలా ప్రయత్నించాడు. సాయంత్రంవరకూ ఎలా చెప్పడమా అని ఆలోచిస్తూనే వున్నాడు. కాని చెప్పడానికి ధైర్యం రాలేదు.

"ఆ హాస్టల్ నీకు తప్పకుండా నచ్చుతుంది. అక్కడ నీ వయసు పిల్లలే వుంటారు. వాళ్ళతో కలిసి చదువుకోవచ్చు, ఆడుకోవచ్చు..."

అదే సమయంలో మరో కంఠం లీలగా బంటీ చెవుల్లో ప్రతిధ్వనించింది.

"అక్కడ నీకు చాలా బాగుంటుంది బంటీ... ఆ ఇల్లు నీకు తప్పకుండా నచ్చుతుంది. అక్కడ జ్యోతి ఉంటుంది, అమిత్ ఉంటాడు... ఇక్కడయితే నీకొక్కడికీ బోర్ కదా!"

"ఆ హాస్టల్ స్కూల్ ప్రిన్సిపాల్ నాకు ఫ్రెండ్. ఆయన నీకు లోకల్ గార్డియన్‌గా వుంటారు. ఆదివారం ఇంటికి తీసికెళ్తారు. ఆయన నీకు నాన్నలాంటివారు. నాన్నే అనుకో"

బంటీ అయోమయంగా చూశాడు.

డాక్టర్ జోషిగారి ముఖం గుర్తొచ్చింది.

"నువ్వాయన్ని నాన్న అని ఎందుకు పిలవ్వు?"

హాస్టల్ గురించి నాన్నగారు ఏవేవో వివరాలు చెప్తున్నారు. ఎంత ప్రయత్నించినా వాడికి హాస్టల్ ఎలా వుంటుందన్న చిత్రం కల్పించుకుందుకు కుదరటంలేదు.

ఇదివరకు కలకత్తా గురించి ఆయన చెప్పినప్పుడల్లా తను కలకత్తా గురించి కల్పించుకున్న చిత్రాలన్నీ కళ్ళకి కట్టినట్టయ్యాయి.

"నువ్వు హాస్టల్లో పెయింటింగ్ చెయ్యచ్చు. బుల్లితోటని పెంచవచ్చు. కావల్సినన్ని హాబీలు పెంచుకోవచ్చు" అన్నారు నాన్నగారు.

కళ్ళు మూసుకుంటే ఏవేవో కలలు. తను అందుకున్న చేయి తనని వదిలేసి వెళ్ళిపోయినట్టు... తను ఒంటరివాడైపోయి... చుట్టూ కొత్తకొత్త ముఖాలు... వాడు గట్టిగా అరిచేశాడు.

"నాన్నా...!"

"భయపడ్డావా కన్నా? కల వచ్చిందా? ఏదీ... కళ్ళు తెరు. నేనిక్కడే వున్నాను"

వాడు కళ్ళు విప్పి చూశాడు. ఎదురుగా నాన్న తనని మెల్లగా వడుకోబెట్టారు. చుట్టూ చీకటి. చీకటిలో చుట్టూ ఏవేవో ధ్వనులు... స్వరాలు... చీకటిలో వినపడే స్వరాలు విచిత్రంగా వుంటాయి.

"పిల్లాడి పరిస్థితి ఎలాగైపోయింది. ఎంత భయపడుతున్నాడు! వీడిని హాస్టల్‌కి పంపించడమే మంచిది. లేకపోతే వీడెవరితోటీ సర్దుకోలేడు. హాస్టల్లో అయితే తన వయసు పిల్లల్తో వుంటే నార్మల్ అవుతాడేమో. ఎంత ఖర్చయినాసరే... అదేనయం" అంటున్న మీరా కళ్ళముందు కదిలింది.

"నేను చెప్పేది మీరు అర్థంచేసుకోరు. సర్లెండి. ఈ విషయంలో నేనింకేం మాట్లాడను" అంటోందామె. క్రమంగా ఆ స్వరం చీకట్లో కలిసిపోయింది.

"బంటీ! లే నాన్నా... మనం ఇంక దిగాలి" ఎవరో వాడి భుజాలు కుదిపి లేపుతున్నారు. అయినా వాడు ఆ ప్రశ్నకి ఏదో జవాబు చెప్పాలని ప్రయత్నిస్తూనే వున్నాడు.

వాడినెవరో పట్టుకుని లేపి నుంచోబెట్టారు. తెల్లగడ్డం సాధువు ముఖంలోంచి మరో ముఖం లేచివచ్చి ఎదుట నిల్చింది... నాన్నగారు!

త్వరత్వరగా ముఖం కడుక్కుని రా. ఇంక ఐదు నిమిషాల్లో స్టేషన్ వచ్చేస్తుంది.

బంటీ నిదానంగా వాస్తవ జగత్తులోకి వచ్చాడు. రైలుపెట్టె... లోపలంతా జనాలు. సామాను, పరుపు కడుతున్న నాన్న! ఉదయపు వెలుగు చుట్టూ పరచుకుంటోంది.

వాడికొక్కసారి ఏమయిందో! ఇంతసేపూ మనసులో ఉంచుకున్న శిల ఉన్నట్టుండి బీటవారింది. అక్కడ్నుంచి పుట్టెడు కన్నీళ్ళు ఉబికి వచ్చాయి. అంతర్నేత్రాలే కాదు, బాహ్యనేత్రాలు కూడా కన్నీరు కార్చసాగాయి. కన్నీళ్ళు నిండిన కళ్ళకి రైలుపెట్టెలో ప్రతి వస్తువు, ప్రతి మనిషి అన్నీ మసగ్గా కనపడ్డారు. మసక ఎక్కువై ఒకటిలో ఒకటి కలిసిపోయాయి. నాన్న ముఖంకూడా వాళ్ళ ముఖాల్లో కలిసి అందులో ఒకటైపోయింది.



# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 2. | Periodicity of its Publication | : Monthly |
| 3. | Printer's Name<br>Whether citizen of India<br>If foreigner, state the country of origin | : **RAMOJI RAO**<br>Yes<br>– |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 4. | Publisher's Name<br>Whether citizen of India<br>If foreigner, state the country of origin | : **RAMOJI RAO**<br>Yes<br>– |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 5. | Editor's Name<br>Whether citizen of India<br>If foreigner, state the country of origin | : **RAMOJI RAO**<br>Yes<br>– |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 6. | Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. | : **VASUNDHARA PUBLICATIONS**<br>6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS.**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 1993.

చతుర ఫీచర్

లాంచీ నిర్మాణ కేంద్రం

# కడలూరు



చట్రానికి మూలాధారమైన దూలాల బిగింపు

తమిళనాడు రాష్ట్రంలోని కడలూరు పడవలు, లాంచీలు తయారుచేయడంలో అగ్రగామిగా ఉంది. దక్షిణ ఆర్కాటు జిల్లాకు చెందిన ఈ తీరపట్టణంలో ముఖ్యంగా చేపల వేటకు ఉపకరించే లాంచీలు తయారవుతాయి. ఇంజన్‌తో నడిచే ఈ లాంచీలు సముద్రం లోతట్టుకు వెళ్ళి చేపలు పట్టడానికి జాలర్లకెంతో అనుకూలంగా ఉంటాయి.

లాంచీలలో మీడియమ్‌సైజ్, స్పెషల్‌సైజ్ అని రెండు రకాలుగా తయారవుతాయి. 35 అడుగుల పొడవుగా ఉండే మీడియమ్‌సైజ్ లాంచీని తయారుచేయడానికి 85 మంది వడ్రంగులు కనీసం మూడునెలలకాలం కష్టపడాల్సుంటుంది. అందుకయ్యే ఖర్చు సుమారు 80 వేలపైమాటే! అంటే అది కేవలం కలప, ఇనుము కొనడానికి, వడ్రంగులకు ఇచ్చే కూలికి సరిపోతుంది. ఇంకా లోపల ఇంజన్‌లు అమర్చడం, ఇతరత్రా బిగింపులు చేయడం, అలంకరణలు, ఫినిషింగ్‌లు చేయిస్తే మొత్తం ఎంతలేదన్నా మూడునాలుగు లక్షలకు తక్కువకాదు. ఇంక స్పెషల్‌సైజ్ లాంచీ అంటే అది మీడియమ్‌కి మూడింతలు పొడవుంటుంది. అంటే 105 అడుగులు. దాని తయారీకి ఎంత తక్కువగా అంచనావేసినా 13 నుంచి 15 లక్షలు వరకూ ఖర్చవుతుంది.

కడలూర్‌లో తయారయ్యే లాంచీలలో మీడియమ్‌సైజుకే గిరాకీ ఎక్కువ. అవి స్థానిక జాలర్లకేగాక, చుట్టుపక్కల తీరపట్టణాలలోని జాలర్లకీ అందుబాటులో ఉంటున్నాయి. అయితే స్పెషల్‌సైజ్ లాంచీలు ఎక్కువగా బొంబాయి, కర్నాటకలోని మంగుళూర్ నగరా



పూర్తి అవుతున్న లాంచీ



ఆ దూలాలకి పక్కటెముకల్లా ఏర్పాటుచేసిన కొయ్యచట్రాలు

మూడవదశలో క్రిందిభాగం ఆకారం పూర్తయిన లాంచీలు

లకి ఎగుమతి అవుతుంటాయి.

లాంచీల తయారీ మొత్తం ఆర్డర్లద్వారానే జరుగుతుంది. కాంట్రాక్టర్లు పార్టీలనుంచి ఆర్డర్లు స్వీకరించి, వడ్రంగుల్ని ఇంతమొత్తానికని మాట్లాడుకుని పని ప్రారంభిస్తారు. అటువంటి పెద్ద కాంట్రాక్టర్లు ఆ పట్టణంలో ఇరవైమంది పైనే వున్నారు. దినభత్యంమీద పనిచేసే వడ్రంగి కుటుంబాలు వెయ్యికి పైచిలుకే ఉంటాయి. ఈ కుటుంబాలలో అధికభాగం ఆ ఇరవైమంది కాంట్రాక్టర్లమీదే ఆధారపడి ఉంటాయి. కొనుగోలుదారుల్నించి దశలవారీగా అడ్వాన్స్‌లు తీసుకొని కాంట్రాక్టర్లు నిర్మాణ కార్యక్రమాల్ని పూర్తిచేస్తారు. అప్పుడప్పుడు ముడిపదార్థాలు, రవాణా, కూలీరేట్లలో అనూహ్యంగా పెరిగే పెరుగుదలలవల్ల కాంట్రాక్టర్లు నష్టపోయే అవకాశమూ లేకపోలేదు. అయితే అది అతి అరుదు.

సాధారణంగా అతి ఖరీదైన టేకు, పనస, మామిడి కలపలకు బదులు కాస్త చౌకగా లభించే మారుజాతి కలపతో లాంచీ నిర్మాణం చేయిస్తారు కాంట్రాక్టర్లు. తమిళనాడు రాష్ట్రప్రభుత్వం ఈ లాంచీ నిర్మాణ పరిశ్రమపై శ్రద్ధ చూపనందున ప్రస్తుతం ఇది ప్రైవేట్ కాంట్రాక్టర్ల ఆధ్వర్యంలో నడుస్తోంది. అయితే కాంట్రాక్టర్లు అటు కార్మికుడికీ ఇటు కొనుగోలుదారుడికీ మధ్య దళారుల్లా ఉండి ఎక్కువ మొత్తాలు గడిస్తున్నారనే ఆరోపణ లేకపోలేదు. అయితే కొంతమంది కాంట్రాక్టర్లు తమ దక్షతతో అందరికీ మేలుకలిగేలా ప్రవర్తిస్తున్నారు. అటువంటి మంచికంపెనీలు కడలూరులో కూడా కొన్ని వున్నాయి.

# చతుర ప్రపంచం

## తపాలాబిళ్ల కథ

ఇప్పటికి ఖచ్చితంగా 28 సంవత్సరాల క్రితం మాట.

ఆరోజు జనవరి 26, 1965. న్యూయార్క్ నగరం నుండి రానున్న బోయింగ్ 707 విమానం కోసం ఎందరో అధికార అనధికార ప్రముఖులు లండన్ విమానాశ్రయంలో ఎదురు చూస్తున్నారు. ఇంతలో విమానం రానేవచ్చింది. పత్రికావిలేఖరులు, ఫొటోగ్రాఫర్లు, న్యూస్‌రీల్ తీసే సిబ్బంది అంతా విమానం చుట్టూ గుమికూడారు. ఇంతకీ ఆ విమానంలో వస్తున్నది ఎవరనుకున్నారు? ఓ తపాలబిళ్ల... అవును నిజం! అది కూడా అతితక్కువ విలువైన తపాలబిళ్ల. దాని విలువ ఒక్క సెంట్ మాత్రమే. ఆ తపాలా బిళ్లని ప్రయాణానికి ముందు రెండు లక్షల పౌనులకు భీమా చేయడం కూడా జరిగింది. అతి కట్టుదిట్టమైన రక్షణతో ఆ తపాల బిళ్లను తెచ్చే వ్యక్తిని భద్రంగా తమ వెంట తీసుకుపోయారు అధికార్లు.

అసలు కథ ఏమంటే-

ఒకప్పుడు బ్రిటన్‌లోని వాటర్‌లూ అండ్ సన్స్ కంపెనీ వారే బ్రిటీష్ గయానాదేశానికి అవసరమైన తపాలా బిళ్లల్ని ముద్రించేవారు. కాని 1856లో ఏవో అనివార్యకారణాలవల్ల వాటర్‌లూ కంపెనీ పంపిన స్టాంపులు గయానా దేశానికి చేరలేదు. దాంతో పోస్టేజి స్టాంపులులేక అక్కడి ప్రజలు గగ్గోలెత్తిపోసాగారు. ఆ పరిస్థితుల్లో గయానాలోని ఓ పోస్టుమాస్టర్ పైఅధికారుల అనుమతితో ఓ ప్రైవేట్ ప్రెస్‌లో 4 సెంట్ల విలువగల తపాలా బిళ్లల్ని ముద్రింపించాడు. అనంతరం వాటన్నింటిని దేశంలోని వివిధ పోస్టాఫీసులకు పంపించాడు. అయితే ముద్రణా సమయంలో పొరపాటున ఓ స్టాంపు మీద నాలుగు సెంట్లకు బదులు ఒక సెంట్ అని ముద్రవడింది. హడావిడిలో సదరు పోస్ట్ మాస్టర్ ఆ పొరపాటును గమనించలేదు. పోస్టేజి స్టాంపులు సమృద్ధిగా లభించడంతో ప్రజలు కూడా చల్లబడ్డారు.

అది జరిగిన 17 సంవత్సరాలకి స్టాంపుల్ని సేకరిస్తున్న ఓ గయానాదేశపు యువకునికి ఆ







ఒక్కసెంట్ స్టాంపు దొరికింది. అప్పటికే అదెంతో మాసిపోయి ఉంది. అయినప్పటికీ ఆ యువకుడు పదిలంగా దాన్ని తన ఆల్బమ్‌లో దాచుకున్నాడు. కాని ఓ రోజు డబ్బు అవసరమై ఆరు షిల్లింగులకు దాన్ని అమ్మేశాడతను. అలా అలా చేతులు మారుతూ ఆ స్టాంపు ఫ్రాన్స్, ఆస్ట్రేలియా వంటి దేశాలు చుట్టి అమెరికా చేరుకుంది.

ఇంతలో ఈ స్టాంపు చరిత్ర తెల్సుకుని బ్రిటీషు అధికారులు దాన్ని తిరిగి సంపాదించి లండన్ ప్రదర్శనశాలలో ఉంచేందుకు కట్టుదిట్టమైన ఏర్పాట్లతో న్యూయార్క్‌నుంచి విమానంలో తెప్పించారు. ఆ స్టాంపుకి ఇంత చరిత్ర ఉందిగనుకే విమానాశ్రయంలో ఆనాడంత రద్దీ ఏర్పడిందని చెప్పుకోవచ్చు.

అయినా అది అక్కడా నిలవలేదు. అనేక ప్రభుత్వ కారణాలవల్ల తిరిగి మళ్లీ దేశ సంచారం మొదలెట్టింది. ఆమధ్య 1970లో కాబోలు న్యూయార్క్ నగరంలోనే దాన్ని వేలంవేస్తే సుమారు 21 లక్షల రూపాయలకు ఓ అమెరికన్ దాన్ని పాడుకున్నాడు. కేవలం 'ఒక్కసెంటొ' విలువగల ఆ స్టాంపు 1970లోనే 21 లక్షల రూపాయలు పలికిందంటే ప్రస్తుతం దాని ధర ఇంకెంత పెరిగిపోయిందో ఎవరు చెప్పగలరు?

---

## కీలెరిగి పెట్టిన వాత

"యాజమాన్యం ముర్దాబాద్... కార్మికుల న్యాయమైన కోర్కెలను పట్టించుకోని ఈ దగాకోరు యాజమాన్యం నశించాలి! మేనేజిమెంట్ డౌన్ డౌన్..." అంటూ దిక్కులు పిక్కటిల్లేలా వీరావేశంతో నినాదాలు చేస్తూ సమ్మెకుదిగిన ఆ ఫ్యాక్టరీ వర్కర్లు మరికొద్దిసేపటిలోనే "యాజమాన్యం జిందాబాద్" అంటూ ఆనందోత్సాహాలతో గంతులు వేశారు. ఈ గమ్మత్తయిన సంఘటన మద్రాసులోని మద్రాస్ బోట్లింగ్ కంపెనీలో జరిగింది. కేవలం ఓ చిన్న లేఖద్వారా సమ్మెకు దిగిన కార్మికులను సమాధానపరచగలిగిన ఆ కంపెనీ ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ బాలచంద్రన్ మేధాసంపత్తికి అందరూ ముక్కున వేలేసుకున్నారు. ఆగ్రహావేశాలతో సమ్మెకు తల పడిన వర్కర్లందరిచేతికీ తలా ఒక లేఖను స్వయంగా అందించాడు బాలచంద్రన్. ఆ లేఖల్లోని సారాంశం ఏమంటే-






"ప్రియ కార్మికులారా!

మీరు సమ్మెకు పిలుపునిచ్చిన విషయాన్ని తెలుసుకొని యాజమాన్యం చాలా బాధపడుతోంది. సమస్యల్ని సామరస్య పూర్వక చర్చల ద్వారా పరిష్కరించుకోవాలేతప్ప, ఇలాంటి సమ్మెలద్వారా సాధించుకోగలిగేదేముంది? కాదని మీరు స్ట్రయిక్ చేస్తామంటే మన ప్రొడక్షన్ దెబ్బతింటుంది. ఫలితంగా మన మార్కెటింగ్ కుంటుపడుతుంది. ఆర్థిక పరిస్థితి తారుమార

వుతుంది. అగ్రస్థానంలో ఉన్న మన కంపెనీ అధమస్థానానికి పడిపోతుంది. ఈ అవకాశాన్ని అందిపుచ్చుకొని మన ప్రత్యర్థి సంస్థలు చురుకుగా ముందుకు దూసుకుపోతాయి. ఆర్థికపుస్థిలేని మన కంపెనీ ఈమాత్రపు జీతభత్యాల్ని కూడా చెల్లించలేని సంకటస్థితిలో పడిపోతుంది. ఈ ప్రభావం కార్మిక సోదరులైన మీ అందరి జీవితాలపై పడ్తుంది. ఇంతకంటే దౌర్భాగ్యమైన పరిస్థితిలోకి మీరు నెట్టబడతారు. కంపెనీకి రుణాలు మంజూరుచేసిన బ్యాంకులు ఊరుకోవుగా? అవి వత్తిడి ప్రారంభిస్తాయి. అటు అప్పులు కట్టలేక ఇటు జీతభత్యాలు చెల్లించలేక సతమతమైన కంపెనీ 'లాకవుట్' ప్రకటిస్తుంది. అది మరింత దుర్భరం. పై అధికారులకంటే ఎక్కడో అక్కడ ఉద్యోగాలు లభిస్తాయి. కానీ మీ లాంటి కార్మికుల పరిస్థితి ఏమిటి? 'లాకవుట్' అయిన కంపెనీ కార్మికుడంటే ఏ సంస్థలూ ఉద్యోగంలో పెట్టుకోవు. ఆ పరిస్థితుల్లో మీరూ, మీమీద ఆధారపడ్డ మీ కుటుంబాలూ ఏంకావాలి? పట్టెడన్నం దొరకని స్థితిలో మీ పిల్లలు అల్లాడుతుంటే మీరు చూసి భరించగలరా? మరో ముఖ్య విషయం-

ఇది స్కూళ్ళు తెరుస్తున్న సమయం. మీ పిల్లల్ని స్కూళ్ళలో చేర్పించాలంటే మీకు డబ్బు కావాలి. ఈ సమయంలో మీరు సమ్మెకు దిగితే వాళ్ళను స్కూళ్ళలో ఎలా చేర్పిస్తారు? అంటే మీ చేతులతోనే వారి బంగారు భవిష్యత్తును మొగ్గలోనే తుంచేస్తారా? ఆలోచించండి. సమస్యలుంటే మేనేజిమెంట్‌తో చర్చలు జరిపి పరిష్కరించుకోడాన్కి ప్రయత్నించండి. అంతే గానీ వృధా కాలయాపన సమ్మెలతో అటు మీ కుటుంబాన్ని ఇటు ఇన్నాళ్ళూ కన్నతల్లిలా అన్నం పెట్టిన సంస్థనూ కష్టాలపాలు చేయకండి. మీరు తెలివైనవాళ్ళు గనుక తెలివైన నిర్ణయాలు తీసుకుంటారని ఆశిస్తున్నాం. మీ వేలితోనే మీ కంటిని పొడుచుకునే మూర్ఖులు మీరు కారనే మా విశ్వాసం..." లేఖ చదివిన వెంటనే కార్మికులకు రాబోయే దుష్పరిణామాలు కళ్ళముందు కదలాడాయేమో వెంటనే స్ట్రయిక్‌కు 'కాల్ ఆఫ్' చేసి పనుల్లోకి వెళ్ళిపోయారు. తమపట్ల మేనేజిమెంట్ సహృదయంతో ఉన్నదనే నమ్మకం ఆ లేఖ కలిగించడంవల్లే కార్మికులు సమ్మె విరమించుకున్నారని అంటాడు బాలచంద్రన్. ఎంతైనా ఎగ్జిక్యూటివ్‌గదా? మరేం చెబుతాడు?

## వేట తెచ్చినపాటు

ఊల్ఫ్‌గాంగ్‌ఎపో అనే పెద్దమనిషికి ఎలాగైనా సరే ఓ ఎలుగుబంటిని వేటాడాలన్న సరదా ఉండేది. జర్మనీకి చెందిన ఆయనగారికి తను చేసే ట్రక్కుడ్రైవర్ ఉద్యోగంనుంచి రిటైరయ్యేంతవరకూ అందుకు తీరుబడే దొరకలేదు. ఎలాగైతేనేం? రిటైరైన తర్వాత ఓ తుపాకీ పుచ్చుకొని ఎలుగుబంట్లకోసం గాలించడం మొదలెట్టాడు. అయినా అవి ఎక్కడా దొరకలే



దు.

"అడవి ఎలుగులు చెకోస్లవేకియా అడవుల్లో సమృద్ధిగా ఉంటాయి అక్కడికి వెడితే నీ కోరిక తీరుతుంది" అని కొందరు మిత్రులు చెప్పడంతో అక్కడికి ప్రయాణం కట్టాడతను. తీరా ఛస్తూ పడుతూ అంతదూరం ప్రయాణించాక అక్కడి అటవీశాఖ అధికారులు, "ఇప్పుడు ఈ అడవుల్లోనూ ఎలుగుబంట్లు కన్పించడంలేద్సార్. ఉన్నా ఒకటీ అరా చెదురుమదురుగా కన్పిస్తాయి. కానీ వాటిని వేటాడడం నిషేధించారు" అన్నారు కూల్‌గా.

దాంతో మన ఊల్ఫ్‌గాంగ్ ఎపోగార్కి ఒళ్ళు మండిపోయింది. "అంతదూరాన్నుంచి వృద్ధాప్యాన్ని కూడా లెక్కచేయకుండా వచ్చాను. నన్నిలా నిరుత్సాహపరుస్తారా? అదేం కుదరదు. నేను ఎలుగుబంటిని వేటాడాల్సిందే" అని మొండిపట్టు పట్టాడతను.

అధికారులు అతని పోరు పడలేక సీజర్ అనే ఓ సర్కస్ ఎలుగుబంటిని కొనుగోలు చేసి తెచ్చి, "అయ్యా మీరు తుపాకీ పట్టుకుని అదుగో అక్కడ నిలబడండి... ఇక్కడినుంచి మేం ఎలుగుబంటిని వదుల్తాం. దాన్ని తరిమి వేటాడి మీ ముచ్చట తీర్చుకోండి" అన్నారు. ఆ ఏర్పాటుకు సరేనంటూ తనకు నిర్దేశించిన స్థానంలో తుపాకీ పట్టుకుని ముసలాయన సిద్ధంగా నిలబడ్డాడు. అధికారులు ఎలుగుని వదిలారు. అయితే అది ఊహించనివిధంగా ఆ పక్కనే ఉన్న అటవీశాఖ ఉద్యోగి తాలూకు సైకిలు ఎక్కి అవ్వాయిచువ్వలా వెళ్ళి ముసలాయన్ని ఢీకొట్టింది. ఆ దెబ్బకు ముసలాయనకి నక్షత్రాలు కన్పించాయి. వెల్లకిలా పడ్డాడు. సీజర్‌మాత్రం సైకిలుతోసహా అడవిలోకి మాయమైంది. ఎంతైనా సర్కస్ కంపెనీ ఎలుగుకదా?

---

## కంకాళాల, కాసారం

హిమాలయ పర్వత ప్రాంతాలలోనున్న రూప్‌కుండ్ కాసారంలో వెదకిన కొద్దీ దొరుకుతాయి మానవాస్థిపంజరాలు. ఆ కాసారంలోని అధికమయం ఎలా అయిందన్నది ఒక మిస్టరీగా ఇప్పటికీ మిగిలే ఉంది. శాస్త్రవేత్తల అంచనాల ప్రకారం ఆ అస్థిపంజరాలు 8-11వ శతాబ్దాల నాటివని తెలుస్తోంది.

కాశ్మీర్ రాజు జోర్వార్‌సింగ్ టిబెట్‌పై దండెత్తి తిరిగి వచ్చేప్పుడు సైన్యంతో సహా మంచు




భాగం నీరు గడ్డకట్టి ఉంటుంది. ఓపిక చేసుకుని ఆ మంచుపొరల్ని ఛేదించాలేగానీ ఆడవాళ్లవి, మగవాళ్లవి, పిల్లలవి, పెద్దలివి అన్ని వయసులవారి అస్థిపంజరాలూ అసంఖ్యాకంగా లభ్యమౌతాయి. ఆ కాసారం కంకాళాల తుఫానులో చిక్కుకుని ఉంటాడని అందుకే అక్కడ అన్ని కంకాళాలు లభ్యమౌతున్నాయని

ఓ వాదన. అదే నిజమైతే స్త్రీలు, పిల్లల కంకాళాల మాటేమిటి? అనే ప్రశ్నకు సమాధానం లేదు. మరో ఊహాగానం ప్రకారం మోక్ష సాధన కోసం హిందువులు ఒకప్పుడు హిమగిరి శిఖరాగ్రం నుండి క్రిందికి దుమికి ప్రాణ త్యాగం చేసుకునే వారట. అలాంటి భక్తులవే ఈ అస్థిపంజరాలంటారు మరికొందరు. అయితేగియితే వైరాగ్యంతో ప్రాణత్యాగాలు పెద్దలు చేస్తారేమోగానీ పిల్లల అస్థిపంజరాల మాటేమిటి? అని ఆ వాదనను త్రోసిపుచ్చడం జరిగింది. మరో అంచనాను అనుసరించి రూప్ కుండ్ పరిసరాల్లో టిబెటన్ల శిబిరం ఏదో ఉండేదని అదే మంచుతుఫానుకు గురై అంత మంది చనిపోయారని తెలుస్తోంది. ఇది కొంచెం వాస్తవానికి దగ్గరగానే ఉన్నా దీనికీ సరైన ఆధారాలు దొరకడం లేదు. శాస్త్రవేత్తలు పరిశోధనలు సాగిస్తున్నప్పటికీ ఇంకా కాసారంలోని కంకాళాల మిస్టరీకి తెరపడలేదు. ఇండో-చైనా యుద్ధానంతరం రూప్‌కుండ్ మీదుగా భారత్‌కి తిరిగి వస్తున్న సిపాయిలద్వారానే ఈ కంకాళాల రహస్యం ప్రపంచానికి తెలిసింది.

---

## 'భగవద్గీత' భట్టీయం

ఎనిమిదేళ్ల వయస్సులోనే భగవద్గీతను కంఠస్థం చేసి పదిమందితో 'శభాష్' అన్పించుకున్నాడు వ్యోమశర్మ. శ్రావ్యమైన తన కంఠంతో తడబాట్లు, పొరపాట్లు దొరలకుండా సంస్కృత శ్లోకాల్ని అతడు మంచినీళ్లప్రాయంగా ఒప్పగించేస్తుంటే విని బదరికాశ్రమంలోని శంకరాచార్యులవారే తన్మయులైపోయారు. పెద్దపెద్ద సంస్కృత విద్వాంసులకే నోరు తిరగని సంస్కృత సమాసాలు, పదబంధాలు ఆ చిన్నారి కంఠం నుంచి జలపాతంలా జాలువారడం చూచి, ఆకాశవాణి, దూరదర్శన్ అధికారులు అప్రతిభులయ్యారు. ఇంత చిన్న వయసులో సంస్కృత భగవద్గీతను ఆసాంతం పుక్కిటపట్టిన ఆ బాలుని ప్రజ్ఞావిశేషాల్నివారు పరిపరివిధాల కొనియాడారు.

వ్యోమశర్మ రెండు మూడేళ్ల ప్రాయంలోనే రేడియోలో వచ్చే క్రికెట్ కామెంటరీలను, వాణిజ్య ప్రకటనల్ని విని అప్పటికప్పుడే వాటిని తిరిగి విన్పించి తల్లిదండ్రుల్ని ఆశ్చర్యపరిచేవాడు. అతని ధారణాశక్తిని పసిగట్టిన తల్లి, భగవద్గీతను వల్లెవేయించి కంఠస్థం చేయించింది. ప్రస్తుతం బైబిలు, ఖురానుల్ని కూడా చదువుతూ "త్వరలో వాటిని కూడా భట్టీయంపట్టేస్తాను" అంటున్నాడా కుర్రవాడు. అతని తండ్రి వినయ మోహనశర్మ ప్రస్తుతం అలహాబాద్‌లోని టాగూర్ టౌన్‌లో పనిచేస్తున్నారు.




Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.



ఫొటో: కె.భవాని శంకర్

CHATURA Telugu Monthly Hyderabad – 500 482 Regd. No. H/H

# ప్రియ మాధుర్యమే ముందు
# ~
# మిగిలినవన్నీ ఆ తరువాతే.....

పరిసరాలను మై మరిపించే పరవశం.
తాజా ఘుమఘుమల ఆనందోల్లాసం.
ప్రియ వక్కపొడి రుచే వేరు. ప్రియ సంస్థ అందించే
ఈ నూతన అనుభూతి ఫ్యామిలీ ప్యాక్ లలో లభించును.

ప్రియ
స్పెషల్
సుపారి

స్పెషల్ రుచి స్పెషల్ వక్కపొడి–ప్రియ

